# పాండురంగవిలాసనాటకము

డాక్టర్, పసుపులేటి వీరస్వామినాయనిచే

విరచితము.



చెన్నపురి:

శ్రీ 'రామ' ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1930.



 [దీనివెల రూ. 1.

# అవతారిక.

బొంబయి రాష్ట్రంబునందలి చంద్రభాగానదీతీరంబున శ్రీ పండరిపురియందు రత్నాలబేరము సేయుచున్న పురందరుఁ భూసురుఁ డొకదినమునఁ దన్ను నొరులు పిసినారి యని ప ల్కొనుటకు వగచుటయు, అతని సతి లక్ష్మీబాయి నిజసుతావివాహ నకై చింతిల్లుచుండ నతఁడు తనచెల్లెలియసుతున కాకన్యారత్నము నీఁ దలంప నామె యియ్యకొనక వేఱొకని కీఁదలంచుటయు, అప నతని కొమారుఁడు జయరావు కోలాపురిలోని పెండ్లికొడుకుల గ ములఁ దెలిసికొనఁ బోవుటయు, పురందరుఁడు బొంబయిలోనుఁ లక్ష్మీబాయి శ్రీరామనవమిపండుగ సేయుటయు, తత్పుత్రిని బ్రా ణులు వర్ణించుటయు, నారదుండు లోకవ్యవహారములఁ బండరిపు రాజునకుఁ దెల్పుచుఁ దాను రాజువలనఁ బురందరుని కృపణత్వము వి శ్రీమహావిష్ణునకు నివేదించుటయు, శ్రీపాండురంగఁ డొక విటుఁడై కనకవల్లి యనునొకసానియింటికరిగి తనకడియ మామె కిచ్చుటయు, అర్థ కులాకడియమును గానకె కొత్త్వాలుతో విన్నవించుటయు, బ్రాహ్మణుల బజాఉను వర్ణింపుచు, పురందరు గృహంబున వైశాఖోత్సవము నెఱప టయు, పురందరు పునరాగమంబును, కనకవల్లి తనకంకణమును మంత్రి కిచ్చి దానిఁ బురందరుఁ డిచ్చె నని తెలుపుటయు, పాండురంగఁడు పురందరునియొద్దకు యాచకార్థమై వచ్చి యతనిచే నిరసింపఁబడి లక్ష్మీ బాయివలన ముంగరగొని తద్భూషను బురందరుని యొద్దనే తాకట్టు పెట్టఁదలంచుటయు, పురందరుఁడు సందేహించి తనభార్యను గోపించు టయు, అనంతర మామె భగవదనుగ్రహమువలన గలిగిన ముక్కరఁ జూపించి భర్తకుఁ దత్త్వోపదేశము సేయించుటయు, వేశ్యాభూసురసం వాదంబును, పురందరునికిఁ గారాగృహప్రాప్తియు, పురందరుఁడు నిర్దోషి యని రాజునకుఁ బాండురంగఁడు తెల్పుచు నతనిఁగోపగించుటయు, రాజు చింతిల్లి పురందరునిఁ దగు సమ్మానములతో దేవాలయమునకు రప్పించి యతనికి శుశ్రూషసేయుటయు, అవల కిష్కింధాప్రయాణంబును నాది గాఁగల శ్రీపాండురంగవిలాసనాటకమందలి విషయసూచిక.

P. V. N.

1902-వ సంవత్సరమున, నే విజయనగరమున శ్రీమహారాజావారి చికిత్సాశాలయందు చికిత్సకుండుగ నుండుతఱిఁ దత్ప్రభుసంబంధమగు "ప్రాసపా" ద్వ్యంశావళియను నొక చిన్న గ్రంథమును రచించి యచ్చువేయించి ప్రకటించితి. అంత నచ్చటిప్రధానకలాశాలా సంస్కృతాంధ్ర పండితప్రముఖులు విశ్వకళాశాల (College Education) కుపయుక్తమగునట్టు లీనాటక మొనర్పుమని కోర ముదితమానసుండనై వల్లెయని వారియిష్టానుసారమే దీనిఁ బూర్తిచేసితిఁ గాని, దీనికిం గొన్ని విఘ్నములు గల్గుటంజేసి వెలువరింపక విరమించి యీగ్రంథవిషయమే రమారమి వింశతివత్సరములు బొత్తిగ మఱచి పోయితిని. అనంతరము కొంత వ్యవధిగలుగఁ బండరీపురికిఁ జని యచట శ్రీ పాండురంగని సేవించి యచ్చోటనే కతిపయదినము లుండునంత భగవత్ప్రేరేపణచే నకస్మాత్తుగ నీపొత్తము సంగతి మదింబడఁ దిరుగ దీని నెట్లులైనఁ బ్రకటింపవలయునను తలంపు నన్ను వేధించుటచేతను సుత ప్రేయసీ (జానకమ్మ) నిరంతరప్రోత్సాహముచేతను నెట్టకేలకు వెలువరిచితి. దీనియందుఁ దలారివాండ్రకును గోకర్ణదాసను నొక బ్రాహ్మణునకును గ్రామ్యముపయోగింపఁబడియె. ఇందలి దోషములు వరించి విద్వత్ప్రకాండులు మన్నింతురుగాత.

ఇట్లు,

డాక్టర్, పసుపులేటి వీరస్వామినాయుఁడు.

## ప్రథమాంకము.

స్థలము 1. పురందరు గృహము

2. దండివసంతరావును ఋణమిమ్మని బలాత్కరించుట.

3. జయరావు కోలాపురికిఁ బోవుట.

4. భూసురులు రుక్మిబాయిని వర్ణించుట

5. రాజమందిరము. నారదప్రవేశము.

## ద్వితీయాంకము.

స్థలము 1. బొంబాయి యోడరేవు

2. వైకుంఠము. నారదుఁడు

3. పండరీపురి.

4. విటవిటీసంభాషణ.

## తృతీయాంకము.

స్థలము 1. ఒక చావడి:—కొత్వాలు. అర్చకులు.

2. బాజాఋ వర్ణన.

3. పురందరుని యింట వైశాఖోత్సవము జరుగుట.

పురందరుఁడు బొంబయినుండి తిరిగివచ్చుట.

కడియమును గుఱించి తలవరిచాటుట.

4. ఆనందరావు తననావలుపట్టుపడినవని తెలిసి సంతసించుట.

## తురీయాంకము.

స్థలము 1. పురందరుఁడు తనభార్యతో సుతావివాహార్థమై సంభాషించుట.

2. పురందరుని వర్తకశాల. అక్కభట్టు యాచించుట

3. కనకవల్లి మంత్రికిఁ గంకణమిచ్చి శరణాగత యగుట.

4. అక్కభట్టు పురందరునికి ముక్కరఁజూపి యతని నూఱువరాలిమ్మని యడుగుట.

5. లక్ష్మిబాయి తులసీపూజసేయుట. పురందరుని వైరాగ్యము.

1. పండరీదేవాలయము. పురందరుఁడు.
2. భటులు పురందరునిఁ బట్టుకొనుట. పౌరసంభాషణ.
3. మంత్రి కచ్చేరి.
వేశ్యాపురందరుల సంవాదము.
పురందరునికిఁ గారాగృహప్రాప్తి.
4. రాజు తనభార్యామంత్రులకుఁ గలలోనడచినవర్తమానముఁ దె

## షష్ఠాంకము.

స్థలము 1. రాజుభార్య లక్ష్మీబాయి నాశ్వాసించుట.
2. పండరీదేవాలయము.
3. గ్రామాధికారులు
4. కోలాపురి.

## సప్తమాంకము.

స్థలము 1. ఆస్థానము.
2. పురందరుని గృహము.

## అష్టమాంకము.

స్థలము 1. గ్రామోపాంతము.
2. ఉద్యానవనము.
3. పౌరపరస్పరసంభాషణము.
4. మంత్రియోలగము.

## నవమాంకము.

స్థలము 1. అడవి.
2. ఋశ్యమూకాద్రి.
3. తుంగభద్రానది.
4. కిష్కింధాంతిక పర్ణశాల.
పనివాండ్ర సంభాషణ.
5. కిష్కింధా దేవాలయము.

# నాటకపాత్రములు.

## పురుషులు.

1 పురందరుఁడు—కథానాయకుఁడు.
2 యశోవర్ధనుఁడు—పండరిపురి రాజు.
3 రామభూపాలుఁడు—రాకొమరుఁడు.
4 జయరావు } పురందరుని పుత్రులు.
5 కేశవరావు }
6 ఆనందరావు }
7 వెంకటరావు } పురందరుని ఋణికులు.
8 హరిరావు }
9 వసంతరావు }
10 ధర్మరావు—ఒక ధని.
11 రంగరావు—ధర్మరావు లేఖకుఁడు.
12 దండి—పురందరు లేకరి.
13 గురునాథుఁడు—పురోహితుఁడు.
14 నారదుఁడు—దేవర్షి.
15 అప్పుభట్టు—మాయాకారుండగు వైకుంఠుఁడు.
16 వైకుంఠుఁడు—పరమపురుషుఁడు.
17 విఠుఁడు—మహానుభావుం డగు పాండురంగఁడు.
18 దామోదరుఁడు—పురందరు బంటు.
19 అమృతరావు—సరస్వతిబాయి భర్త.
20 విద్యాసాగరుఁడు—సరస్వతిబాయి సుతుఁడు.
21 గోకర్ణదాసు—వెంకుబాయి కుమారుఁడు.
22 సూత్రధారుఁడు—నటీ భర్త.
23 కొత్వాలు—ఒక న్యాయాధిపతి.

మఱియుం గొందఱు ప్రసంగవశమున వచ్చెదరు.

తే. ఘనత కెక్కిన మండపం। క్యాంపు వైద్య
శాలలో రోగహారి నై । జరపువాఁడఁ
బండరీశ్వరు భక్తిమై । బరఁగువాఁడఁ
గన్యయా నాటక మొనర్పఁ । గడఁగినాఁడ.

క. నెరసుల్ వెనకఁగ ముస్గవి
వరులకుఁ దొరలవె? మదీయ । వాక్సంతతి నే
నెరవని దలఁతునె? సుబుధా
దరమాశ్రవములను గనిన । దక్కదృఢముగన్.

ఇట్లు సుజనవిధేయుఁడు,

డాక్టర్, పసుపులేటి వీరస్వామినాయఁడు.

నెల్లూరుపురస్థుఁడు — నెల్లూరు పత్తేఖాన్ పేట కాఁపురస్థుఁడు.

శ్రీ ర స్తు.

శ్రీ రామచంద్రపరబ్రహ్మణే నమః.

శ్రీ రాధాకృష్ణాభ్యా న్నమః.

# శ్రీ పాండురంగ విలాస నాటకము.

నాంది.

శా. శ్రీకారుణ్యపయోధిశౌరి తనవాసింబాసి ప్రేపల్లెలో
జోకం జేరుచు గోపికాలిరతుఁడై జ్యోతిల్లుచున్ రాక య
స్తోకవ్యాజముఁ బూనుటేల యని సంక్షోభించి శ్రీయన్మనో
జ్ఞాకృత్యన్విత వత్సమెక్కెనో తదధ్యక్షుండు నన్ బ్రోవుతన్. 1

ఉ. వాసవసూనుఁ డాత్మజనబంధుసుహృత్తతినాజిఁ గాంచి యు
ల్లాసము నేవగించి యవలంబితతూణిఁ దృణీకరింపఁగా
వాసిగ నేకృపాబ్ధి నిజవక్త్రగుహాంతరజాత సౌరయో
షాసురసూరసాగరదిశాముఖపద్మభవాండముల్ సము
ద్భాసిలఁ జూపి తేర్చెనో సదా యతఁ డిచ్ఛల నిచ్చుఁ గావుతన్. 2

ప్రస్తావన.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును.)

సూత్ర:—అతివిస్తరమేల? నేఁ డీ పురివారందఱు నన్జీరి "ఓభరతశాస్త్రవిశారదా! మేము మున్నెన్నఁడో శ్రీపురందరదాసచరిత్ర నించుక వింటిమిగాని తన్నాటకం బాడఁగ నెన్నఁడు చూడమైతిమి. కావునఁ దత్కథాగౌరవముచేతను మాయందలి కరుణారసభరంబుచేతను బుధనిధులసమ్మతిగఁ దన్నాట్యంబున మమ్ముఁ గృతార్థులఁ గావింపు" మనిరి. (సభవైపుఁగని) అహో! ఈసభాసదుల మనఃపద్మంబు లీమహత్కథాతరుణార్కరుచులన్దలంచిన త్రుటిలో నేత్రుటిలేక వికసించుచున్నయవి. ఇఁక సోఁకిన నెటులుండునో! (తెరవంకఁ జూచి) ఆర్యా? నీనాటకము గనవలయు నిట రమ్ము.

—ఇనీ, ఒకనాఁడైన దిగనాడక చీటికి మాటికి రా, రా, రమ్మనుమాటయేనా? (తెరవెడలి) ఇదిగో, వచ్చితిని. ఏమి యానతి?

సూత్ర:—ముదితా! ప్రవీక్షించితివే? ఇమ్మహాసభను.

తే. గురుకవులువైణికనిధియు గరువమునను
ధర్మయందొక్కరొక్కరు దనరుదురు, రిట
నట్టివారలు లెక్కకు నమితముగను
నిండియుండఁగఁ గన్నుల పండువయ్యె. 3

కాదే?

నటి:—(సభనుగాంచి) అవునవును? ఆర్యపుత్రా! సంతసముగాని యిపు డేమి సేయ వలయును?

సూత్ర:—ఏమా?

ఉ. రంగవిభూషణుండు హరిరాజదపూర్వపదాబ్జసేవ ను
ప్పొంగు పురందరుండు తన పాత్రియుమేటరు లిందుఁ దోఁచు సా
రంగవరేణ్యపాలుని గ రంబు భజించెదు వీరదాస సా
రంగుఁ డభిజ్ఞుఁడైన కవి హాయిగ సర్వము నేఁడె గూడె సా
రంగదళాక్షి, సూపెదము రమ్ము వినోదము మోదమా సభన్. 4

నటి:—అటులా, సంతసము. ఇదిగో, ఇందిందిరమందిరమందిరయగు వనేందిరకాహ్లాదకరంబగు నీవసంతతిలకంబునఁ బసగల్గు కిసలంబుల మెసవి సన్మణితంబున వనంబున వినోదంబు గల్పించు పికంబుభాతి భవద్వచనామృతలవారింగ్రోలి గానంబున సుగుణగ్రహయాళురైన నీసభ్యులను గరంబు రంజింపంజేయ నుపక్రమించెదను.

సీ. బాలరసాలప్ర వాళప్రసవబంధ, భూతిఖాదత్రైవ్యక భూతిగాఁగ
మాలతీపద్మినీ మంజుగంధగ్రాహ, మత్తసమీరుని పొత్తుగాఁగ
కలకంఠకలకంఠకలకలార్భటులాత్మ,వన్యార్భమంగళధ్వనులుగాఁగ
నలరికుట్మలగుచ్ఛకావరోహాయతి,న్నయనొక్కొకశాఖనందనమ్ము

తే. నా, సువాసనావాసమ్ము మాసుతునక
యమ్ముషడృతువులకును సా రమ్ము రటద
ళిశుకములకిమ్ముగాఁ గ్రమ్మె దిశల నేక
తోరణమ్మనఁ జైత్రిక మ్మారజముగ. 5

సూత్ర:—ఆర్యా! మేల్మేలు. హా! ఈకంఠమేమి! ఇట్టిగాన మెచ్చోఁగానము. హా! నీగాథ విని వినకమున్న నీగాథ యంతయు విశదమయ్యె. నీవెట్లు పాడితి

బళారా! "మంగళధ్వనులన్న" జ్ఞప్తివచ్చినది. ఇప్పుడే మనకథానాయకుఁడగుపురందరుఁడు గారాత్మప్రియతో నిజసుతావివాహార్థమై గొంత ప్రసంగింపనిటవచ్చి కూరుచుండి యేదో యనుకొనుచున్నవారు. ఈతరుచ్ఛాయనుండి చూచాయగ నాలించెదమురమ్ము.

(నిష్క్రమింతురు).

---

## ప్ర థ మాం క ము.

### స్థలము 1. పురందరుగృహావేదిక.

పురం.—(తలయూఁచుచు) ఆహా! ఏమి వారిసాహసము. నావలన నేటివఱదనుక సరకులఁగొని జీవించుచుఁ దుదకు నన్ను సరకుగొన కిటుల మాటాడుచున్నారు:—"పురందరునిది చిక్కనిచేయి" "చిక్కనిచే" యనెదరు. చిక్కనిచే యేమైన వారిఁ జక్కఁజేసినదా? మఱియు నతఁడు "సాధు, వతఁడసాధు"వనెదరు. నేనెట్టిఁడైనది వారి కింకను వెల్లాటకము కాలేదు గాఁబోలు.

ఆ. పరధనంబుపైన భ్రాంతి లే దెన్నఁడు
నొరుల సభల కెన్నఁ డరుగలేదు
బుణికు లొసఁగు రూక నీరైనఁ దీయుచుఁ
దృప్తిఁ జెందియుందు నింటియందు. 6

ఇందుకా, నాది చిక్కనిచే యనెదరు. వారిది బారెఁడు చేయానేమో. ఓహో! ఏమిబేర. మొన్న వారిలో దుష్టాగ్రేసరుఁడగు హరిరావుగతి యేమైనదో తెలియదా?

క. పెద్దల సుద్దులు బద్దని, గద్దఱియై పద్దుఁబూని కడ తేర్చి ధనం
బద్దిర! నడుమంత్రపుసిరి,తద్దయుఁగల్గినను గుజనతతిలాయుఁగదా? 7

పెండియు నతని హితుఁడు వసంతరావు గరువము రేపట మాపటఁ దెల్లమి యగు "వినాశకాలే విపరీతబుద్ధిః" అనునది యసత్యమగునే! సరిసరి. వారివారి మొఱఁగులు వారివారికే చెఱుపు. చిక్కము పోవుచున్నఁ గుక్క లెన్ని మొఱవవు? ఇయ్యవనియందు ధనికులవిషయమై యొరుల కసూయగలిగియుండుట యసాధారణము గాదు. అటులుండియుఁ దెల్లవాఱిచూచిన నట్టిప్రశ్మరి దిమ్ములెందఱో నానావిధజంతుజాలంబులు జలపూర్ణతటాకంబుచేరి చరించు నందంబున మాబోంట్లగుమ్మములఁ గ్రుమ్మరిలుచుందురు. మెతుకులు చల్లినఁ

గాకులు గొఱిగ యగునే? మంచిది, అములుచ లేమనినను మాకేమి ములుచ.
(ఎలనగుచు) అన్నిటికి ద్రవిణమే మూలము. అట్టిది యున్నంగాదే!

క. అడిగెడు వారలు వేవే
లడుగు మనెడువారు గొంద ఱక్కట నివిగో,
నడికుడకలు గొమ్మంచును
బుడికెడువాఁ డొకఁడుగలఁడె, భోగము లేమిన్. 8

(చెవియొగ్గి) కాలిచప్పు డగుచున్నది. ఎవరుగా నుందురో,

ప్రవేశము: ఆనందరావు.

పురం:—ఓహో! ఆనందరావుగారో, దయసేయుఁడు. బహుకాలమునకే దర్శనము. మీవాణిజ్య మవారణముగ జరుగుచున్నదా?

ఆనం:—ఊఁ, తమదయవలన.

పురం:—లెస్స, మరేమి విశేషము?

ఆనం:—పారశీకదేశపుఁ బాదుసాగారికిఁ గొంత జావాహితి వలయునఁట.

పుర:—సరి, ఎంతవరలోఁ గావలయు?

ఆనం:—తెలిసిన దరయేగద. లోఁగడ మాలెక్కఁజూచినఁ దెలియు.

పురం:—మంచిమాట. (లెక్క నభినయించుచుఁ దనలో) ఓహో! సరాసరి రెండు వందలవరాలు పొలిగలదుగాని ధనముచేపడినఁగాదే బాధ మనఁదగు.

ఆనం:—(స్వ) వహో! ఒక్కముక్కొఱ కితఁడు గ్రుక్కలు మ్రింగుచున్నాఁడు.

ప్ర:—ఏమి యాలోచన, కాసురా దనుకొనుచున్నారా స్వామి? నాస్నేహితుఁడు ధర్మరావుగారింటనుండిన నిప్పుడే పైకముఁ దెచ్చి యిచ్చివేసియుందును.

పుర;—అట్లే కానిమ్ము, (దండితో) ఓయిదండీ! వీరుకోరిన సరకులనిచ్చి పుచ్చి వసంతరావుసమాచారమేమో, గన్గొని రమ్ము.

దండి:—చిత్తము. (నిష్క్రమించును.)

పురం—నాప్రయాణారంభముననే యీలాభముఁ జూడఁగా నుత్తరోత్తరాదాయ మనంతమని తేలెడిని. ఇప్పని మన పుత్రులకు సయితము ప్రాఁబఱచి ప్రతిభావంతులఁ జేయందగు. సాధారణముగా "మర్కట కిశోరన్యాయము" వలెఁ దల్లిదండ్రులు తమ బిడ్డలను సదాయింటనుంచుకొని సోమరులఁజేయుట వారి బుద్ధిహీనతయే. ఇందువలన నాబాలురు తమ దుర్వార దుస్సంగత్వ దుర్వ్యాపారత్వములచేతను వెండియుఁ బాతకాలలయందు వారికిఁ దీరుగా దేహారోగ్యు

యైక శిక్షలలవడమిచేతను స్వధర్మకార్యములు మాని యనుకామీనులై దుర్మరణముల పాలై నశించుచున్నారు.

ప్రవేశము : లక్ష్మీబాయి.

పుర —(భార్యతో) ఏమి, నేనిపుడు బొంబాయికి గమనింప గమనించియున్నాను. నీవు స్వగృహకార్యభారధౌరేయవై పదిలముగ నుండవలయు.

లక్ష్మి:—నాథా, చాల సంతసముగాని నే లోఁగడ మనవిచేసిన దేమి చేసితిరి?

పురం:—ఏమది?

లక్ష్మి:—విశేష మేమియులేదు. మనయాత్మజయగు రుక్మి పరిణయయోగ్యయయ్యెఁ గదా? నామనవి నూరీకరించి తగినవరు నేర్పాటుచేసిన వాసి యని మనవిచేసియుంటిని.

పురం:—(ఆలోచించి) ఓహో, ఆసమాచారమా? ముందే నేఁ బ్రస్తావించియుంటినే? మెడఁబట్టిన మేనఱిక మున్న దని.

ఆ. నాదు చెల్లెలిబిడ్డ । నడువడి గననేల?
యచ్చ రూపరి చదు । వరి పనుపరి
యుక్తునియపనుల । నువిద నతనికిడఁ
గలుగు మనకు బల మ । బలకు ఫలము. 9

లక్ష్మి:—(సచింతగ) స్వామి? ఈవాచికము నేనెఱుంగను. అయిన నాబాలిశుఁడు బాలిశుఁడని వినియున్నాను, గాన మన మాణిక్యము నామసిగుడ్డను గట్టుటకు మనంబొప్పునే? నాకీసంగతి దుర్ధరముగ నున్నది.

పురం:—అట్లయిన నీ యిష్టమేమి?

లక్ష్మి:—కోలాపురియందున్న యమృతరావుపుత్త్రుఁడు సుగుణకలాపసంపన్నుం డనియు సకల కలాకలాపభూషితుండనియు నేనెఱుఁగుదుఁ గాన నతని కిక్కన్యనిచ్చినఁ గడు సొంపుగ నుండును.

పురం:—నీమాటలు నాకును దుర్భరముగ నున్నవి. అయిన నేఁదిరిగివచ్చి యేదోయొక యేర్పాటు చేసెద. (నిష్క్రమించును)

లక్ష్మి:—(సవిచారముగ) అకటా! ఏమిది, నాయిష్టమునుడివినతోడు తోడనే భర్తగారాయస్తచిత్తులైరి. నాపన్నికము వ్యర్థీకృత మయ్యె.

తే. ఇంపితంబగు నాతలం । పిట్లు గలుగఁ
గాదు గా దనె నార్యుఁడు । నాదు యత్న
మడవిఁ గాచిన వెన్నెల । యాయెనో! మహి
నాకమానదు ఫలమున్న । రట్లు లేక. 10

ఆయన నీవృత్తాంత మంతయుఁ బెద్దబిడ్డనికిఁ దెలియఁ జెప్పెద. (తిరిగిచూచి) వాఁడుగో, వచ్చుచున్నాఁడు.

ప్రవేశము: జయరావు.

లక్ష్మి:—పుత్రా, వింటివా?

జయ:—తల్లీ, ఏమిసంగతి? ఏల విచారగ్రస్తవై యున్నావు?

లక్ష్మి:—తండ్రీ, ఈనీసహోదరివిషయము దక్క మఱేమున్నది?

జయ:—జా మికేమి?

లక్ష్మి:—నాయనా, మీనాయనగారు వారి మేనల్లుని కీబిడను బాణిపీడనము సేయఁ దలఁచియున్నారు. మంచి నోములునోఁచనివారికి వాంఛాప్రపూర్తి యెటు లవును?

జయ:—జనని, వగయేల? తండ్రిగారి కగోచరధర్మ మున్నదే? అయిన మీమనోరథము వారి కెఱింగించి యెటులైన వారి మనంబు ద్రిప్పెద.

లక్ష్మి:—వలదు. వారివాక్య మతిక్రమింపఁగూడదు.

జయ:—క్రమింపవలయునని గాదు. ఎల్లి నేఁగోలాపురిలోని ఋణస్థులపాలికరిగి యా బాలునిఁ గనుఁగొనివచ్చి తన్నిజస్థితిఁ దండ్రిగారికి నివేదించి భవదభీప్సితము సఫ లత గావించెద. మంచిది, అమ్మరో, అమ్మాయి నేరికి మీరు పాణిగ్రహణము సేయఁదలంచితిరి?

లక్ష్మి:—మన సరస్వతిబాయి పుత్రుండగు విద్యాసాగరున కీఁదలఁచితిని. అయినను భవ జ్జనకుని వాక్యము నన్యథాకరించిన నికార్యము సార్థకమగునే? ఇపుడు నీవచ టికేగి సర్వము గ్రహించి యీనవమికి ముందుగ రమ్ము. చూత మీబిడయుప గతి యెట్టులో. పోయిరమ్ముగాని యభీష్టార్థమునకై మునుమున్న దేవాయతన మున కరిగి,

క. కృష్ణా మానముగాచిన
కృష్ణుఁ శ్రీకృష్ణమిత్రుఁ గృష్ణరహితు భ్రా
జిష్ణుఁ దర్శింపుము రో
చిష్ణుం బరిపాతకృష్ణు సిద్ధిస్థితికిన్. 11

జయ:—మహాప్రసాదము. సెలవుగైకొనెద. (అని నాలుగడుగులు సని యించుక యాలోచించి) మంచిది, నేఁగోలాపురికి నెప్పరంబునఁ జని వెంకటరావుతో సంభాషించి బావగారి యింటి కరిగెద. అరిగి యతనిగుణాగుణములఁ బరికరిం

పిమ్మట భావిసంబంధి సంగతి వరసెద. అరసివచ్చి (సచింతగ) మాతాపితలతో నేమి నుడువవలయు. ఆహా, ఇచట గొప్పమలికిశము గలిగె.

జ. చ. కం. ఒకవేళ బావగారిక
ప్రకటిత ధీ సంయుతుఁ డని ? వలికితినో?
వికలమతి యగు జనని, హా!
వికాసియగుఁ దండ్రి ? పీ లెట్లో. 12

బావను సుధీనిధి యంటినో, తల్లి యుల్లంబు తల్లడిల్లు. కాదంటినో, తండ్రి వల్ల నొల్ల గిల్లు. ఇపుడు "నిజము నిష్ఠురము దెచ్చు" ననునది సరి దాఁకినది. దీనికి వల్ల యెట్లు? అహో. నాపాటు "ముందుపోటు వెనుకవా" టనుపాటిగ నున్నది. సూటిగఁజూచినఁదల్లిమాట జవదాఁటరాదు, తండ్రి వాక్యములునునట్టివే. ఇందుకు శ్రీరామచంద్రుసుడ్డులే నిదర్శనము. విశేషమేల! ప్రియసహోదరి శ్రేయోనుభవమునకే గద యెవ రెన్నిపాట్లువడినను. ఇపు డేల యింతవంత; యథార్థస్థితులారసి యనంతరము కర్తవ్యం బవలంబించెద.

(నిష్క్రమించును.)



ప్ర థ మాం క ము.

స్థలము II. వసంతరావుగృహము.

ప్రవేశము : దండి

దండి:—తెలియును, ఇదియే వసంతరా వుండుచోటని. తలుపుదట్టెద. (తట్టుట నభినయించుచు) వసంతరావుగారు, ఓ వసంతరావుగారూ.

వసం:—ఎవరో యనుకొని పరాకుననుండును.

దండి:—ఎవరింట? పలుకరు.

వసం:—(విని తనలో) అబ్బా! ఇతఁడో! "పింగలివారిపేకి" యంగే. కడు నలుక మెయిఁ బిలుచుచున్నాఁడు. ఇఁక నన్నేఁచక విడుచునా?

దండి:—(స్వ) ఎంత పొగరుఁబోతు, పలుకడు. (ప్ర) ఓయి, ఏల తలుపుదీయవు? నన్నెఱుఁగవా?

వసం:— (తహతహపడుచుఁ దనలో) అబ్బబ్బా! ఇంకేమిగతి. పైకముకూడ లేదే. "నిర్ధనః పురుషః పశుః" వనున దేవో యని యనుకొంటిని. (ప్రకాశము) అయ్యా, కొంచము పనియున్నది. కూర్చుండుఁడు. ఇదిగో వచ్చెదను.

(భార్యతో రహస్యముగ) వింటివే? అదండిబంటుంబోలె నీదండి యార్భటి. మనము మున్నే సామొనఁగిననేలిదము సేయుచు నీ కలపనగంప కొసరి మన పెంపు పెంపవచ్చియున్నాఁడు. ఇఁక మన మెంతకొసరినను విడువఁడు. ఆహా! ఈ యిబ్బంది కెటులోర్వ నగు? నరులలో నజ్ఞానము, కలాదునియందుఁ గలంకము, చందనవనమునఁ బన్నగము, స్త్రైణమున వ్యభిచారము భాతి నామహానుభావయు యశస్వినియు నగు లక్ష్మిబాయింట నీతుంటరి సమావేశమయ్యె. నేఁడు ఋణవిముక్తిఁజేయవలయు నన్న మనము చేబోడులనుగదా? వీని ముఖంబా! అబ్బా! శిలీముఖంబే! ఇందుకేమి ముఖంబు?

రాధః:—నాథా, సాధన మేమున్నది. "యద్భావితద్భవతి నాత్రవిచారహేతు" వను నది వినమే? వేయేల? మన నోమునోఁత లెటులో, యటు లగు.

తే. సత్యసంధుఁడు శ్రీహరిశ్చంద్రునకును
దులువ నక్షత్రకుని బలెఁ దలరె నితఁడు,
గోడు గాంచిన విడ్పునే లేడికంట
నీరుగాఱిన వేఁటకానికిని ముద్దె? 13

దండి—(అగ్రహాదీప్తుఁడై యరళంబు దబదబదట్టుచు) ఓయి దుర్మార్గుఁడా! ఎంతపిలిచినఁ బలుక, వోహో! పెద్దమనిషివే. నేవచ్చినపని విచారింపక నన్వెలుఁగున నిలఁబెట్టెదు. నీతాతగారి బంటని తలఁచితో! నీ తెలివి తెలిసె. తెలివి. తలుపు దెఱవు.

వసం:—(ఆవేగమున భార్యతో) ఈపగదారిపంతము నీకుఁ దెలియదు. క్రోధమునకుఁ గన్నులులేవన్నట్టు వీఁడహమించి కలనుకుఁ గాలుద్రవ్వచున్నాఁడు. కావున వీనియప్పుఁ బరిష్కరించుపర్యంతమునేఁ బఱగడగనుండెద. "సాధూనాం దుర్జనోభయ" మనునది వినమె? కొందఱు కార్యనిర్వాహకు లీభూమియందుఁ దమతమ కార్యము లనుకూలమగునంతకు నొకచాటుఁ జూచుకొంచున్నారు గారే?

ఉ. దాఁగఁడె, తొల్లి నైషధుఁడు దారగుణుండొక నాటియందు,భూభాగము మాని యావిరటుపాలవసింపరె, పాండవోత్తముల్,
సాగఁడె, వేల్పుతేఁడు నిజసాదనసాధనముల్ త్యజించి, సద్భాగములోఁగ శశ్వదను భావ మనర్థముగాదె? యేరికిన్. 14

ఇఁక నీయభిప్రాయమేమి? వీఁడు వసనాభి, నన్నుఁగష్టపఱపక గాని వీడఁ డని మున్నే వచించితి.

రాధా:—స్వామి! ఒడ్డారమువలదు. ఎద్దియో యొకయంతరువుచూచుకొన్న నిపుడు ప్రయోజనమేమి? ఇతనినేదో యొకపంతమున సమాధానముచేసికొనినఁబంతు. గోటితోఁ బోవుదాని గొడ్డటితోఁ గొట్టమేలా?

వసం—నీకుస్వాదము. నకులోరగములకు మైత్రి పొసఁగునే?

దండి—ఏలజాపిరము? తీసెదవా, లేదా? అపరము. హో, కండ్లుపైకి వచ్చినట్టున్నదే?

వసం—(స్వ) అక్కటా! ఈఘోష పరిఘోషమును మించియున్నది. ఈగర్విష్ఠుని నడఁచుటకు నెడ రేదియుఁ గనఁబడదు. (ఆలోచించి) "నిర్ధనః పురుషః పశు" వనునదినిజము.

ప్ర:—అయ్యా, మన్నింపుఁడు. (అని తలుపుదీసి) వందనము, దయచేయుఁడు.

దండి—(సాగ్రహుఁడై) ఇప్పటి కయ్యా, దయసేయుఁ డనెదవో? చాలాలు. ఇఁకనీచాలిక చాలింపు. నీపంచకే తెంచినవారల నభిభవించి బయలుననుంచినఁ గాని, నీపరువు బయలు మెఱయదేమో? ఔరా, అరరినిదీయుమనిన నెనుపోతు మీఁదవాన కురిసినట్టుండి నన్నింతసేపు బహిర్ద్వారంబున నిల్వరించితివి. సరిసరి. నీతచ్చన తెలిసె. అందుబడియైన సొమ్ము నొడలెఱుఁగక తెంచెప్పలుగఁ జిందు వందు చేసితివి గద? నేఁడు వడ్డిమొదలు చెల్లింపుము. నిన్నుఁ బెద్దమనుష్యుఁడని యనుకొంటిఁ గాని యిపుడు నీబటాబూరము తేటె. ధన మర్పించెదవా, లేదా?

వసం:—(స్వ) హా! ధన మెంత సేయుచున్నది. "మాతృపుత్ర విరోధాయ హిరణ్యాయ నమోనమః" అను నది నిక్కమే.

ప్ర:—అయ్యా! పైకమిచ్చెదఁగాని యిపుడు మీ కీ యచ్చలమేల? ఆఁకరంబు కరంబు దురితాకరంబుగాదే? మిమ్ము నేనేమైనఁ దిట్టితినా! తిమ్మితినా?

దండి:—(రోషించుచు) ఓయి! పలుమాటలేల? నాపని నొక్కటఁ జక్కఁ బెట్టనిచో నీపని యిప్పుడే చక్కఁబెట్టెదఁ జూడు. నేఁడే నీవచ్చవలసిన ముడు సిమ్ము? లేక, రా రమ్ము బైట. (అని మెడఁబట్టి త్రోయుచున్నాఁడు).

వసం:—అయ్యో! అయ్యో! ఏలగళగ్రహణము సేసి నెట్టెదవు. ఏమిరాధా! ఇతఁ డవినీతుఁడని మున్నె సెప్పితిఁగదా? నన్నిట్టి బరిబారిఁద్రోసి చాఁ జూడనెంచి తివో? ఇప్పు డీయిమ్ముదప్పు దప్పింప నెవరున్నారు.

రాధ:—(తొట్రుకొని దండితో) స్వామీ! తామసము మామా! ఏల నీసోమ? "కోపః పాపస్యకారణ" మని యెఱింగియు మీబోఁటికొలీనుల కిట్టి కౌలీనంబు కౌలీనంబుగాదే?

క. ఓదండీ, విభు విడు, మతి
వాదమభేదులగు మీకు వర్జ్యముగగ, యి
వ్వాదమున ఖేదమగు, ని
ర్వాదము చేఁగల్గు మీకవార్యయశంబుల్. 15

అయ్యా! వీరిని జెకసికలాడఁ ద్వాదృశులకుఁ దగునే? నామనవి వినుఁడు.
(అని వనరుచున్నది.)

దండి:—(క్రోధపరీతమనస్కుఁడయ్యు నాబిడ గొడవఁగని తనలో) అయ్యయో!

క. అంబుజముఖి వగ చెఱ వగ
నంబుజజ సతీవిపంచికావిష్కృత నీ
లాంబరి రాగ విడంబన
శంబాద్భుతరసలహరి ప్రసారరవముతోఁ. 16

ఆహా! ఈదీనాలాపంబులు కచ్ఛపీనిక్వాణసంస్పృశంబులుగావే?

ప్ర:—చూడవమ్మ! నీభర్త యిత్తఱిఁ దరితీపుసేసి నన్నారక తృణప్రాయంబుగ నెంచుచున్నాఁడు.

రాధ:—అయ్యగారు! వీరి కేమిదెలియదు. మీరీకోపునరాపాడి వృథా క్రోధించుటేల? పాండు.

తే. తుంటరులవలె మమ్మెంచ వంటుగాదు
తంటలకు రాము, మేమెప్డు తంటనేయు
వారమేకాము, మముఁదంటఁ బఱపకు మిఁకఁ
దీర్తు మీతంట నెన్నిది దివసములకు. 17

(భర్తతో, జనాంతికము) నాథా! వీరి నేదో యొకవెరఫన సమీచీనవాక్యంబుల సమాధానపఱచిన వెరవుగదా? గోరుచుట్టుమీఁద రోఁకటిపోటన్నట్లు మనము ముందే లేమిడిచే బాధపడుచున్నను వీరితో నిపుడు విరోధము సహితము హితమా?

వసం:—పోపోవే, వీఁడహంభావమున నిక్కుచు వైరించుచున్నాఁడు. అనుశయమున్న వానికెన్నటికైన ననుశయమున్నె? ఇట్టిది మిత్రతాపాత్రమే?

తే. అధిక లోభికి ధర్మశాస్త్రార్థముగమ
నిక, దివాంధమునకు ధామనిధి విధంబు,
మహిని మూబకుఁ గామినీ మణిపాలంబు,
మలినముఖునకు సద్గుణి చెలియొటౌను? 18

దండీ:—ఓయివసంతా! ఈకాంతాప్రశస్తోక్తు లామోదించి ప్రశాంతస్వాంతుఁడనై సిన్విడిచితిని. నిర్ధారితకాలములో మెల్లమెల్లఁ జెల్లింపవేని నిన్నేఁపకమానను. పో! నేఁడుతప్పించుకొంటివి. (పండ్లు పెటపెటఁగొఱుకుచు నిష్క్రమించును.)

రాధ:—నాథా! అహో! అప్పనునది కాసంతయైన నెంతదావంతముఁ జొప్పఱచు. ఎఱుఁగరే? అగ్నిశేషము, ఋణశేషము, శత్రుశేష మనర్థహేతువులని. ఈయచలయందు నచ్చువానికన్న నచ్చుదలలేనివాఁ డెంత ధన్యుఁడు?

తే. అప్పులఁబడి శ్రీహరి దెప్పెటిలెనె?
అప్పులఁబడి హరిశ్చంద్రుఁ డడలలేదె?
అప్పు నిర్యాతనమొనర్ప నెప్పరమున
నప్పువడువాని బ్రతుకొక గొప్పబ్రదుకె? 19

వసం:—అట్లే యప్పుదీర్పసమకట్టెద. అప్పులేనివాఁడే ధనికుఁడు. వానికపాయమేలేదు.

రాధ:—(ఇష్టదైవమును వేఁడుకొంచున్నది) ఓదైవమా! దచ్చోకపగల్కడ తెగకమున్న ఋణవిముక్తిఁజేయుటెట్టులో యని యాతంకవిద్రాఘి నీఁదుచున్నదాన.

ఏకాక్షరి:—

క. నిన్నెన్నిన నన్నన్నను
నన్నన్నా! నాననన్ను నన్ననినానెన్
నిన్నానన నానునానను
నన్నా! నన్నానినన్న నానేనెన్నన్. 20

ఎటులైనను మా కీవే శరణము.
(భర్తతో) స్వామీ! రండు. (నిష్క్రమింతురు.)

---

ప్రథమాంకము.

స్థలము III కోలాపురి.

జయ:—(నలుప్రక్కలఁ జూచి) ఔరా! ఈపట్టణంబు డంబు.

ఉ. నైగమ హర్మ్యసౌధములు నైగమవేదులు నైగమార్యులున్
లాగము గల్గు తేజులు ఘనంబులఁ గేరు ఘనాఘనంబులున్
వీఁగెడు వంజులాప్రమ్మరివేష్టితవిశ్రుతఖేయయుక్తిమై
సాగర నేమి నీపురికి సాటియె యేపుటభేదనంబు, హా!
హా! గమనింపహస్తిమశకాంతరమా నిది యేమిచోద్యమో! 21

(ఆలోచించి) అయిన మదీయపురీవరంబు చంద్రభాగాపగాప్రాప్తిక్ శ్రీపాండు
రంగాశ్రయావాప్తిక్ గించిద్ఘనం బని యెన్ననగు. (ముందుచూచి) అహో !
వెంకటరావుగారే తెంచుచున్నారే !

ప్రవేశము : వెంకటరావు.

జయ:—వెంకటరావుగారు, క్షేమమా?

వెంక:—ఆ, తమదయవలన.

జయ:—సంతసముగాని, పైక మెపుడు చెల్లించెదరు?

వెంక:—అయ్యా, ఇపుడు కరమున నొకపిరసైనలేదు. నాల్నాళ్లు నిదానించి పయనే
సినఁ జెల్లించెదను.

జయ:—అట్లే కానిమ్ము. పొమ్ము.
(ఆత్మగతము) సెబాసు, ఇత్తఱి నెత్తఱియే; ఏలయన దినచతుష్కము వ్యవధి
యున్నది. ఇపుడే మేనత్తగారి యిల్సేరెదను. ఇదిగో వారిగృహము.

ప్రవేశము : వెంకుబాయి.

వెంకు:—(జయరావు గ్గని, ఏమి నాయన! ఎపుడు రాకడ?

జయ:—ఇప్పుడే, అత్త.

వెంకు:—మనవారందఱు సుఖమున్నారే ?

జయ:—అందఱు సుఖులే.

వెంకు:—కూర్చుండుము. మఱేమి యతిశయము ?

జయ:—ఏమిలేదు, గాని మామగారెక్కడ? బావగారెక్కడ?

వెంకు:—మీమామగారింటలేరు. బావ యిప్పుడే వెలికిఁబోయెను.

జయ:—సరిసరి, అత్తా, నేనిప్పుడే తిరిగివచ్చెద.

వెంకు:—అట్లే పోయిరమ్ము.
(స్వగతము.)

క. అకటా! మత్సూనుం డిపు
డకలంకుఁడు బావకెట్టు లగ్గపడునో, వా
లక మేమగునో, నామది
వికవికలై పోయె వాని వికృతిస్ఫురణన్. 22

ఏమైన మన మేమిసేయఁగలము.

జయ:—(గోకర్ణదాసు నొకవీథికాంతరమునఁ గని తనలో) అహో! ఏ మితని యా
కారము ! ఇట్టి వైరూప్యముండునె ? మన వంశికులలో.

క. మొలకచ్చన్ బింజింపఁడు
బలుపొందన్ మెడనడుసుల బవినీనిబలెన్
గలిగి దురోదరులగు వెం
గలులఁ గలసి తమకు తమకు గడు బెడఁగారున్. 23

ఔరా, ఇట్టి యెడ్డియను మడ్డియని యెుడ్డుట కడ్డియేమి? అయినఁ బిలిచి సంభాషించెద. (ప్రకాశముగ) బావా! ఓయిబావా!

గోకర్ణ:—(తిరిగి చూచి తనలో) ఓహో! మనవాఁడే, వీఁడు. అప్పుడే యెంత పెద్ద వాఁడైనాఁడురా.

ప్ర:—ఏమిరోయి, ఎప్పు డొచ్చావు ?

జయ:—(తనలో) అన్నా! ఏమీ మృదూక్తి. ఈయాబరివల్కు-పల్కులు చెనుబరి పల్కులుగావే? అయిన సంభాషించెద.

ప్ర:—బావా! ఇప్పుడే వచ్చితిని.

గోక:—సరిగాని, వస్నావవోయి, మనతోఁటలోకిపోయి మావిఫలాలు తింనాము.

జయ:—బావా! ఇపుడే భోజనమొనర్చివచ్చితిఁగానఁ దినుటకు వీలుగాదు.

గోక:—తింతేనేమోయి నువ్వుకూడ మాపూరిఫలాలుతింతే వాట్లరుచి తెరుస్తుంది.

జయ:—ఆరుచి నాకు బాగుగఁదెలియును. బావా! నాకు సెలవిమ్ము. నేబిలాఁ జన వలయు.

గోక:—ఓరి? నీవధిక ప్రసంగివి. ఎద్దడుకులరుచియేమెఱుఁగురా? దున్నా! ఛీ! ఛీ! రా. (అని పైఁబడి పుట్టములాగును.)

జయ:—(స్వ) ఔరా ! ఏమి తనివిరసము. ఇతని విజృంభణము. కేవలదుర్మార్గునికిని నిరక్షరకుక్షికి నుండుగుణము లిచట గలవు. మదీయ జనయిత్రిమాట లేటికిఁ దాటాదూటములవును. ఇఁక నీకోపిదాపుననున్నఁ గడు దాపగు.

ప్ర:—ఓయి! నేనీదినమున సదనమునకుఁ జనవలయుఁ గాన నన్వీడుము.

గోక:—ఓరి! నీయబ్బవచ్చినన్ విడిచిపెట్టన్ రా.

జయ:—ఏల పోరు? విడు, విడు. (అని చలువవిడిపించుకొని ప్రధావించును.)

గోక:—(వెంటనంటి) హో, హో, నిలు నిలుము.

వనమయూరవృత్తము:—

ఏర, నినుఁజేరఁదలఁ కేర, ననుఁజేరక
బోర నను బాఱినను, బో, బవరమారక
గారనుగఁ జేరు మిటఁ గా వనిన నోర్వ
న్దారసిలి కట్టి నినుఁ దాఁచెద జిగీషన్. 24

(అని నాల్గడుగులు వెన్నడికొని మరలుకొనును.)

జయ:—(క్రిందఁబడి లేచి తిరిగితిరిగి జూచుచు) కట్టా! పులివాతఁబడి చచ్చి బ్రతికిన ట్లయ్యెఁ గదా నా బ్రతుకు. (కూర్చుండి) ఇస్సీ! ఎంత మోసమాయె. ఏమితని దౌష్ట్యము. ఇట్టి యధమాధముని మాకం డ్రికోరుట యేలాకో. "అయోగ్యేపురుషో నాస్తి" అని వారి కేలదెలియదు.

కవిరాజవిరాజితవృత్తము:—

తెలిసెను నేఁడభి ధేయము, వీఁడనఁ దెంపరిగా, గురు దృష్టిగనక్
ఖలునివికారము గన్గొనకెంతయుఁ గన్యనొసంగను గైకొనె, నే
దెలిసినవార్తలు దెల్పఁగబొంకని తెక్కలిగాఁ బనిఁ దీర్చునొకో,
కలఁతవిచిర్చెదఁ గార్యవిపాకము గాంచుగతిన్గడ గట్టివెసన్. 25

కానిమ్ము. ఇపు డికం కేల. ఉపకంఠమునన్నున్న విద్యాసాగరుని నట్టుసేరి యతని గుట్టెట్టిదో గనెద. (అని రెండంగలువేసి) ఇదిగో, అతని కేతనము.

సరస్వతిబాయిగారు దాసి, గాసి కేదో నుడువుచు నెట్టెదుటనున్నారు.

సర:—(జయరావునని యనుమోదముతో) ఓహో! ఎప్పుడు నీరాక ? మనవారికి మంగళమే ?

జయ:—ఇప్పుడేవచ్చుచున్నాను. ఎల్లరను భావుకమే? అత్తగారూ! అమృతరావుమామగా రెక్కడ? విద్యాసాగరుఁ డెక్కడ ?

సర:—మీమామగారింటలేరు. పుత్త్రుఁడారామమునయుం దున్నాఁడు.

జయ:—అటులా! నేబావతావున కరుగవలయు. ఏమార్గమున నచ్చోటికిఁ జనవలయును.

సర:—ఇదిగో, దాసి యచ్చటికే సనుచున్నది. నీవిచ్చో సించుక విరమింపు. నేఁబుత్త్రుని రప్పించెద. (దాసితో) ఓసీ! జయరావు వచ్చెనని తెల్పి కుమారుని బిలిచికొనిరమ్ము.

జ. ను:—అటుగాదు. నేనటకరిగి మీతనూభవునితో సంభాషించి యావిహారమునఁ గొంతవిహారం బొనరించి మరల నేతెంచెద.

సర:—నీయిష్టము. అదిగో, ఎలదోఁట. పొమ్ము.

జయ:—(రెండడుగులిడి తనలో) ఔరా! ఈవసికారాజము ?

విచకిలితవృత్తము:—

వనమువిహగకలరవముల వఱలుతరుకిసలములఁ
దనరభినవకుసుమతతులఁ దఱలుహిమపవనములఁ
ననుపగుఁ గనుకలికివెఱఁగు, నవనమునకుఁ బరఁగు నీ
మనసరివరవనికి నసుగ మనము తివిరితివురదే ? 26

ఏల యరగలి ? అగిగెప.

ప్రవేశము : విద్యాసాగరుఁడు.

విద్యా:—(జయరావుగ్గని) ఆవృత్తుఁడుగారు, దయసేయుఁడు. మీయాగమమెప్పుడో ?

జయ:—ఇప్పుడే బావ. మీరీనందనమున నేమిసేయుచున్నారు ?

విద్యా:—ఇదిగో! ఈవసంతద్రుమమున శాఖాపంబు వెట్టించుచున్నాఁడను. సర్వదా యీఫలితము మంచరము తీరు. గినిఫలంబులో, యత్యంతబంధురంబు లతిమధురంబు లని వేఱే వక్కాణింప నేల ?

జయ:—(స్వగతము) బళీ! వీరా మందారమును మందరముగ విషయీకరించిన ట్టున్నది. ఏమిచిత్రము !

ప్ర:—అహో, అట్లైన సీచెట్టు "చెట్టా! చెట్టుఁదలకట్టు చెన్నుఁజిదుమదే!"

విద్యా:—(సాశ్చర్యుఁడై, తనలో) ఆఁహఁ ! ఏమికైపదము !

ప్ర:—అందుకు సందియమా ?

క. పట్టుగలిగి క్రొమ్మావిని,
మట్టుపఱచి ప్రోదిసేయ మధురఫలంబుల్
పుట్టఁగ, నేలా, పెట్టుక
"జెట్టాచెట్టుఁదలకట్టు చెన్నుఁ జిదుమదే ?" 27

జయ:—(స్వ) అప్పప్పా! ఇట్టిసకలకలావిశారదుండగు విశారదుండసుగదా మద్భగినికి సమంచితవరుండు

ప్ర:—విద్యానిధీ, శ్రీరామనవమి నన్ను నిరీక్షించుచున్నది గాన నే నుపేక్షింపక యింటి కరుగవలయు. ఆలస్య మయ్యెనేని యస్మదాలయమున జనని రేపగలు నాకసాలేవడి కోలాకుపడుచుండు. సెలవిండు.

విద్యా:—అట్లే పొండు.

జయ:—(స్వ) లోకమున నిట్టివిద్యావైదుషిగలఘనుల నల్లువారుగఁ జేకొనిన వారిభాగ్య మెంతభాగ్యము! సరి. వచ్చినపని నెఱవేఱె. ఇఁక వెంకటరావు న్గనఁ జనెద.

(నిష్క్రమించును.)

విద్యా:—(దక్షిణకరస్ఫురణసూచించి) ఏలొకో! నాకుడిభుజ మదురుచున్నది. సుఖావహామనఁ జెల్లునా! కనవలెఁ జనెద. (నిష్క్రమించును.)



## ప్ర థ మాం క ము.

### స్థలము. IV లక్ష్మీబాయిగృహము.

### బ్రా హ్మ ణ్య ము.

లక్ష్మీ:—(స్వ) హా! ఏమిది. భర్త దూరదేశవాసియైయుండ శ్రీరామనవమి సేయఁదగదనినను నామాట లామోదింపక "జననీ, జనకుఁడుగారు గ్రామాంతరమున నున్న నేమి? నేమింటనుండి సకలజనులుసేయు నవమిపండుపుసేయక మిన్నక యుంటమేలా?" యని సుతుఁడు నుడువ వల్లె యని యెల్లవస్తువుల సేకరించి తెఁగాని యిప్పటికిని బుత్రుని పొడవుపొడవడదు. అగ్రజన్ములందఱు వేచియున్నారు. ఎటులేని యీసర్వజనీనోత్సవ మవిచ్ఛిన్నముగ జరపవలయు. (జన్నిగట్టులఁగాంచి) అయ్యలారా! భగవద్భజనము గావింపుఁడు. ఆగమనపఠన మొనర్పుడు. (పుత్రితో) అమ్మా! నీవు వీరికావశ్యకపదార్థముల నిరాఘాటముగ సమకొల్పుచుండుము. (అని లోని కరుగును.)

1. భూసురుఁడు:—(లక్ష్మీబాయి నుద్దేశించి వేఱొకనితో) వింటిరే? మనము నక్క మొగముఁ జూచివచ్చినట్లున్నది. లేనిచో నీయన్నుల మిన్నదియే, మనకు నీవుల మొదవువలెఁ జిక్కునా? ఈమె కెప్పుడు స్వస్తి యగుఁగాత.

తే. ఎద్దడిని నొచ్చువారలఁ దద్దనెమ్మిఁ
గాపుగడసేయఁ గాంక్షించు కఱుదునెంచఁ
గాదునే? విందులకును ముంగొంగుబంగ
రనఁగఁ దగుఁగాదె? యీపాఱు తనుననువుగ. 28

2. భూసురుఁడు:—అందుకు సందియంబేమి?

తే. కాంతయీగికి కందంబు కందిమండె
జామిసత్కీర్తి పాలేటి నేమినిండె
ధాత్రియీవుల మ్రానిపైఁ దనముఁ జెండెఁ
బలుక మనకౌనె? యీపాఁప పంటపండె. 29

చూడఁగ నీగృహిణీ భర్తగారింట లేనట్టున్నది.

1. భూ:—నిక్కము. మనపుణ్యము మంచిది గనుకయే, వారు విదేశమునకుఁ బోయిరి.

3. భూ—ఒకవేళ యతఁ డున్న నేమి?

2. భూ:—(చిర్నవ్వుతో) ఏమా, మననోట మన్నెగొట్టిపంపును. నీవెఱుఁగవు గాఁబోలు. అతని సమాచారము నాకు నంతగాఁ దెలియదుగాని జనశ్రుతినిబట్టి సెప్పెద.

తే. యాచకావళిఁ జేపట్టఁ డార్తజనుల
వీఁపుఁ దట్టఁడు విఱిగిన వ్రేలికింత
సున్నమైనను బెట్టఁడు తిన్నచేతఁ
గాకి నైనను గొట్టఁడా కట్టఁడి, సుమి. 30

4. భూ:—కాదుకాదు. ఇది కేవలాసత్యము. వారినేఁ జక్కఁగా నెఱుఁగుదు. బహుప్రదులు. సంశయమే లేదు.

ప్రవేశము: లక్ష్మిబాయి.

లక్ష్మి:—భూసురులారా! మీమీయుపగ్రాహ్యంబులు సంగ్రహించితిరా?

1 భూ:—గ్రహించితిమి గాని భవదీయవిఖ్యాతనయులు తనయు లెచ్చటనున్నవారు? కానఁబడరు.

లక్ష్మి:—అయ్యా! మదీయజ్యేష్ఠపుత్త్రుఁ డీదివసమునకు వచ్చి చేరెద నని సనెఁ గాని యింతవఱకు వానియోచూకిఁ గానను. ఏతత్కారణముననే నాచిత్తము తత్తఱిల్లుచున్న యది. (కొమరితతో) నాముద్దుపట్టి, నీవు సైతము నీయగ్రజులకు మాఱుగ నీయగ్రజులకుఁ బసదనమ్ములిమ్ము. నేనిప్పుడే తిరిగివచ్చెద(అని చనును.)

1 భూ:—(రుక్మిబాయి సౌన్దర్యముగాంచి సాశ్చర్యుఁడై తనలో) హా! ఈమెఱుఁగుఁబోఁడిలావణ్యము ! ఈబిడ శ్రీకారు మెఱుపుఁదీఁగయో ! (రెండవవానితో, ప్రకాశముగ) చూచితివే ? ఇటు. ఈకమలకమనీయవదనము.

క. ఔరా! ఇది మోమాది
వ్యారుణభరితోదయస్ఫుటాబ్జము గానక్
సారంగ కదంబకములు
తా రసమా రసముగొఱలఁ దద్దయు జతనన్. 31

2 భూ:—ఇది యొకవిచిత్రమా ? చంద్రుఁడే యీమె ముఖముఁ జూచి వెలవెలఁబోవుచుండ నిఁకఁ బద్మము లన నెంత.

3 భూ:—బళా ! ఇప్పద్మనేత్ర నేత్రాదులశృంగారము వర్ణింపఁదరమే ?

తే. లేమకన్నులసరిరాక లేడిసేరె
రాజుఁ, దామోమువాంచి ధూర్జటినిఁ జేరెఁ
దిమిరి యజ్ఞారి తాఁదలం ద్రిపథగన్న
శి నిడుకొని తెగుదలనేమి సెప్పఁడయ్యె. 32

4 భూ:—బళిరే! ఈభువనమోహనాకారము ! అప్సరస్సతులలో నైన నిట్టిరూపసి యుండునే.

తే. చెలియ యానంబు పున్నాగములఁ గలంచుఁ
జెలఁగు నూఁగారుపున్నాగములమలంచు
సలలితాక్షులు పున్నాగముల మురించు
సెలయు పొక్కిలి పున్నాగముల హరించు. 33

1 భూ:—ఇవియా ? వర్ణనలు. ఈబాలామణికురులు నీనెన్నడుము గదా ! ముఖ్యాస్తిత్వములు.

ఉ. దీనికురుల్వినీల ఘనతేజమడంచుట కేమిహేతువో ?

2. భూ:—(కాదా మఱి)
మానుగఁ దల్లితండ్రులు కొమార్తల కీయని లక్ష్మి గానఁ బెం
పూనెను నైజవృత్తి.

1. భూ:—
కనవో, నడుమంత్రము లేని దయ్యె, హా!

2. భూ:—(అవును, అది యట్లే కొన్ని శ్రేష్ఠస్త్రీజాతులలో)
కొను గనంగరా, దలంతి కందురుకందువసృష్టిసూత్మతన్. 34

3. భూ:—చూడఁగ మన్మథుఁడే యిట్టిమనోహరాకృతిఁ బొందియుండవచ్చు నని తోఁచెడి.

1 భూ:—ఇన్నివర్ణనము లేల ?

తే. మహినియోషాకదంబసంపత్తిసవతు
సేయఁ దమికొన నేరైన నేదగొనరె?
జోకకీనవలామిహి సూత్రపడునె ?
ఈమెయంగున కీమె యంగేప్రతిగద. 35

ఇట్టి రమణి కెట్టిరమణుఁడు గల్గునో! (తిరిగిచూచి) అదిగో! ప్రోయాలే తెంచుచున్నది. మౌనముద్ర ధరింపుఁడు.

లక్ష్మీబాయిః పునఃప్రవేశము.

1. భూ:—అమ్మగారూ! ఈబాలికామణి నేరికిఁ బరిణయము సేయఁదలఁచితిరి ?

లక్ష్మీ:—స్వామి! తత్కార్యమునకే మత్తనూజుం డరిగియున్నవాఁడు. (సాస్రయై) నాభర్తగారికిఁ దనభాగినేయున కీవలయు ననియే యభిమతము. అయిన నెట్లవునో, చూడవలయును.

2. భూ:—(ఆలించి, తనలో) అయయో! ఆదున్నకా, ఈచెన్నలరుకన్నియఁ గట్టుట. ఇట్టి మధ్య య్యామధ్యలోకంబుననుండునే.

ప్ర:—అయ్యో తల్లి! అతఁడు బ్రహ్మకులజాతుండైనను యథాజాతుండు సుమా! అతనిఁ జూపుడుగుట్టమని చెప్పుదురు.

క. ఓతరుణీ, యెఱుఁగుదునా
కాతాళముకొడుగల బికారిని మున్నే,
ఆతనికొసవకు నాతినిఁ
గోఁతికిముత్యాలపేరుఁ గూర్చుటపేరే. 36

కావున,

క. భావజరూపకులవయ
శ్రీవిద్యావైభవములఁ జెలరేఁగెడు భూ

దేవునకొసఁగుఁడు, చెలువే!
భావింపఁగ జోడుకోడెఁ బరఁగనిచెలుముల్. 37

లక్ష్మి:—అవు నవును. మీ ప్రశస్తవాక్యములు వేదవాక్యములవలె శస్తములౌనుగాని యీబిడ యదృష్టము పితామహుని యిష్టము సమకుఱవలదా?

2. వ. భూ:—మానినీరత్నమా! మానినుపల్కులు వినుఁడు. మీపట్టినపట్టున కెట్టి వాలాయ ముండదు. (తక్కినవారితో రహస్యముగ) ఆహా! కంటిరే? ఈమె చిత్తవృత్తి.

తే. చదలు చూపెట్టు నీహారజలకణములు
నలువు మెఱసిననవమగు ననలుననలు
నవ్యనవనీతమైన యీనాతిడెంద
మునకు నెనయౌనె? యద్భుత మనఁగఁ జనదె. 38

లక్ష్మి:—(భూసురులతో) మీరందఱు ప్రతిగ్రహించితిరా?

భూసు:—గ్రహించితిమి, పోయివచ్చెదము. (నిష్క్రమింతురు.)

లక్ష్మి:—ఏల! ఇంతప్రొద్దుపోయినను దనయుఁడు రాఁడయ్యె. (తిరిగిచూచి) ఓహో! వచ్చుచున్నాఁడు.

ప్రవేశము: జయరావు.

లక్ష్మి:—(సానందయై) తనయ, కాఁదారి మాఁదారి ప్రొద్దా సన్నమగుచున్నది. ఇంత తామసమేల?

జయ:—జననీ, అచ్చోటఁ గొంతప్రసంగమువలన దిరిగిరా నంత యాలస్యమయ్యె.

లక్ష్మి:—వత్సా, చక్కటిఁ జక్కఁబెట్టితివా?

జయ:—తల్లీ, ప్రసవ్య మయ్యె.

లక్ష్మి:—(సచింతగ) అయ్యో! ప్రతికూల మయ్యెనా?

జయ:—కాదుకాదు. అనుకూలమయ్యె. మనవిచేసెద.

తే. అన్న! మీయల్లువాఁడెట్టిఁ డన్న నన్ను
సారెఁ జీకొట్టిరాకొట్టి చటిచెఁగానఁ
బాన నుద్దింపఁగా సుధాహీనమయ్యు
హేయమానట్టి విడెముగాదే! మదంబ. 39

జనయిత్రీ, ఆమూర్ఖుఁ డొడలెఱుఁగక తఱిమి జాలిఁబెట్ట పీడువడి నేఁదిట్టఁడనై పారిపోయితిని. నేఁడు తండ్రివాక్యము పూర్వపక్షమయ్యె. అబ్బా! అట్టిసమున్నద్ధుఁడగు నల్లుఁడు పగవానికైన వలదమ్మ. మూర్ఖతనొకవేళ మనబిడ్డ నిచ్చిన 'జామాతాదశమోగ్రహః.' అనునది ముమ్మాటికి నిశ్చయమే.

లక్ష్మి:—అటులా, పుత్రా, అవ్వలివృత్తాంతమేమి?

జయ:—అంతఁ గ్రొత్తయల్లుని మందిరమున కరిగి యతని నాక్రీడంబునఁ గని భాషించితిని. ఆహా! తదీయతారుణ్య లావణ్య సౌజన్య సౌశీల్య సౌభాగ్య భాగ్యము లనిర్వాచ్యములు. ఆవిద్యావైశారద్య, మాప్రసంగప్రవీణత, తద్వాక్పాధురి, నిరవధికము. పెక్కుమాటలేల? నిక్కముగఁ జతుష్షట్చతుర్దశాష్టాదశవిద్యావేత్త యన నతనికే చెల్లును. అట్టి కుశాగ్రబుద్ధి నే నెచ్చోఁ గానను.

శా. విద్యామండనమండితుం డతనిపే ర్విన్వార లెంతేనియుఁ
విద్యాసాగరుఁడన్నఁ దద్ఘనుఁడె, హా! విశ్వంబునం దందురీ
చోద్యం బేమనవచ్చు నింక జననీ! జోడింపుజోటి న్దనుఁ
హృద్యంబౌ నవరత్నయుక్తకనకం బింపొంగదే? యేరికిన్. 40

తల్లీ, "సుకవితా యద్యస్తిరాజ్యేన కిం" మ్మనునది వినవే?

లక్ష్మి:—(సానందబాష్పయై) తండ్రీ, మాబాగాయె. అతఁ డతివిహస్తుఁడని మున్నే తెలిపితిని. నీవు నైతము గనుఁగొంటివి.

జయ:—మాతా! వారివారియంతరువులు సమంజసముగఁ దెల్పితి, నీకఁ దమచిత్తము. నేఁ జనెద. (నిష్క్రమించును.)

లక్ష్మి:—ఆహా! అట్టిబిడ్డఁ డొకఁ డుండినఁ జాలదే.

తే. ధరణిరంజింపఁ జంద్రుఁ డొక్కరుఁడచాలుఁ
గాక, యగణితనక్షత్రగణము దేల?
సుగుణవంతుండు సూనుండు దగునుగాని
తెగటు బారాది బిడలున్న వెగటుగాదె. 41

సందేహమేల? బాగుగ నోఁచినస్గాదే, అట్టి వియ్యముకూరు. ఎన్నిబన్నము లావహిల్లిన నట్టిబాంధవము వర్జింపఁదగదు. సరి, చూతము. (నిష్క్రమించును).

## ప్ర థ మా ం క ము.

### స్థలము V రాజమందిరము.



ప్రవేశము: వెంకటదాసు, మంగయదాసు.

వెంకట:—(భజనము సేయుచు) మంగయదాసుగారు, మీరు గాత్రకులంబులో నొప్పారి తీరినవారు గాన నొకరాగ మాలాపింపుఁడు.

మంగ:—మంచిది. (అని పాటపాటగ నొకరాగ మాలాపించును)

వెంక:—(ఆలించి) హా! ఎంత స్వరసాహితిగ నున్నది! దయచేసి యీరాగమున నొక పదముఁ బాడుఁడు.

మంగ:—ఆలాగే.

సీ. హరికెఱుంగ నికరం బౌనా,కరంబది, రుచినెఱుంగని తెడ్డురూపుగాక
వెన్నునిగాంచని కన్నులుకన్నులా, కండ్లఁబోనియురుల కండ్లుగాక
నరహరిఁ బొగడని నాల్క నాల్కయది, పశువుపై తోలుక బద్దగాక
కమలేశుగుడిని ద్రొక్కనికాలు లా కాళ్లు,రచ్చనిత్రించునిట్రాళ్లుగాక

తే. కాన దుర్భ్రమముల నెల్లఁ గానజేర్చి,
గానలోలుని కర్పింప లేని వాని
తపము జపమును దేహమాత్మయును దురిని,
బదరిపదటనేవదలిన పదురుగాదె. 42

వెంక:—సత్యము. సత్యము. సకలము భగవదర్పితము సేసి యనుభవింపని వానిజన్మము ను భగవద్భజనము సేయనివాని జన్మమును బూడిదలో నేయివేసినట్లు వృథ. (ఆలించి) మిత్రమా, ఇఁకఁ జాలించి యాలింపు మాగానము. ఆహా! ఎంత మనోరమము?

మంగ:—(ఆలకించి) ఔనౌను. నాదు జానుగులకును గడుజానుగ నున్నది. ఇది ముల్ల యతివీణాగానంబునఁ గలిగియుండవచ్చునో? రమ్ము. వినెదము.

నేపథ్యమున:—

సీ. సురుచిరేంద్విననేత్ర దురితవల్లిలవిత్ర,త్రిదశారి జైత్ర గిరిత్రమిత్ర
నిర్జితామిత్రస న్మిత్రగోత్రపవిత్ర, యవనిసుక్షేత్ర ధైర్యజితగోత్ర

నిరుపమచారిత్ర నరసురస్తుతిపాత్ర, హతధరాపుత్రనీలాభ్రగాత్ర
సద్భక్తవనచైత్ర సత్వమహామాత్ర,తపనీయమయపోత్ర తార్క్ష్యపత్ర
తే. వికటదుర్జననికరాగ మకరపత్ర, విషమపంకహిమానికా వీతిహోత్ర
యాప్యసంసరణగిరిత్ర యానపాత్ర,మహితదీనావనచరిత్ర మాకళత్ర.

ప్రవేశము : యశోవర్ధనుఁడు, శుభకీర్తి.

యశో:—(రాజ్ఞితో) తరళేక్షణా, భవన్మానస బిసప్రసూనసూనుండనై యుండఁ ద్వన్నేత్రయుగచపలతావిశేషమునకుఁ గతమేమి ?

శుభ:—ప్రాణవల్లభా, బహువిధచమత్కృతినిర్మించి సల్లలితంబగు వల్లకీగానంబు నా యుల్లంబు న్బల్లటిల్లఁజేసి కర్ణాలంకారము గావించెఁ గాన మన్మనంబుచలించె.

యశో:—(ఆకర్ణించి) ఔనౌను. ఒకానొక మృదుమధురగానము మాకు నైతము శ్రవణరసాయనం బయ్యెడు.

శుభ:—(మరల శ్రవణమభినయించి) ఆహా! జీవితేశా! ఎంత కర్ణామృతము !

క. ఆమృదుమనోజ్ఞగానము,నీమహినెన్నఁడునుగాన మిదిసుర గణికా
సామాన్యలదో, వాణిదో, సామీ! దేవర్షిదో, విచార్యము, సుమ్మా.

యశో:—(చెవియొగ్గి, స్వ) అహో! ఇది మహతీక్వణముగ నున్నది.

ప్ర:—

క. నారీమణి, వినుసపయో, నీరదగాత్రుఁ బ్రఫుల్ల నీరజనేత్రుఁ
గోరెడుగానవిశారద, నారద గానంబటంచు నమ్మెద నెదలోన్. 45

శుభ:—(దృష్టిసారించి) మనోనాయకా, నిజము. శారదా మనఃకుమారులును సత్యవతీమనోహరులు నగు నారదులవారు విచ్చేయుచున్నవారు.

యశో:—(చూచుట సూచించి) కాంతా, సత్యను, సంయములు షోడశోపచారపూజనీయులు గాన మన మమ్మహాత్ము నెదుర్కొలుసేసి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించెదము. రమ్ము. వారిమహత్వము నెఱుఁగ నసాధ్యము.వినమే,తొల్లి తన్మహతీస్థితపుష్పహారమజునిప్రియ యగు నిందుమతిపైఁ బడి యకాలమినిం జకాలఁడినసంగతి. కావున మనము బహు జాగరూకతతో నడువవలయును. (గద్దియడిగ్గి సవినయముగ) మునిగ్రామణీ ! వందనము.

నార:—రాజకులావతంసమా, సుఖీభవ. సకల రాడ్దుర్వహగర్వాభిప్రభంజనోభవ.

శుభ:—సంయమీంద్రా ! శరణు.

నార:—సాధ్వీమణీ! సిద్ధమనోరథాభవ.

యశో:—యతిసార్వభౌమా! ఈ రత్నఖచిత స్వర్ణాస్తరణం బలంకరింపుఁడు.

తే. ధాతృసుకుమారసత్తపో ధనత్రిలోక
మాన్యసంచారిసుకుమారి మానహారి
యరిమురిం ధన్యతన్గాంచె నస్మదన్వ
యంబు హృద్యభావత్కాగమంబుప్రాప్తి. 46

స్వామీ!

క. ఎక్కడ కేగుచు నిక్కడ,
కక్కజముగ వచ్చితయ్య యక్కటికన్నా
చక్కియుఁ జొక్కం బయ్యెన్
స్రుక్కిన స్రుక్కులును స్రుక్కె సుగముగ దక్కెన్. 47

నార:—

చ. రజనిచరారిశౌరిపద రంజితభావ, భవద్యశోధనం
*బజవసుధీరబ్రధ్నజఖగాబ్జగరిష్ఠము, నైజవిక్రమం
*బజవసుధీరబ్రధ్నజఖ గాబ్జగరిష్ఠము, తేవిహాయితం
*బజవసుధీరబ్రధ్నజఖ గాబ్జగరిష్ఠ, మహా, వసుంధరన్. 48

తే. కమఠరాజుపన్నగరాజు కరికులాద్రు
లరయగళలంబనము వక్రచరవిధంబు
గండమలినతఁ దూఁగుట గరమచలమ
టంచుభూకాంతనిర్జేరె నవనిజాని. 49

---

* ఈపద్యమున కర్థము:—

| | యశస్సు. | విక్రమము. | దానము. |
|---|---|---|---|
| 1. అజః | శివుఁడు | విష్ణువు | బ్రహ్మ |
| 2. వసుః | భీష్ముఁడు, లేక రత్నము | భీష్ముఁడు, అగ్ని | భీష్ముఁడు, కుబేరుఁడు |
| 3. ధీరః | బృహస్పతి | మందరాద్రి | సముద్రము,ఇరావంతుఁ |
| 4. బధ్నజః | వినాయకుఁడు | యముఁడు, కుమారుఁడు | కర్ణుఁడు [డు |
| 5. ఖగః | చంద్రుఁడు, జటాయువు | గరుత్మంతుఁడు | మేఘుఁడు, కపోతము |
| 6. అబ్జం | శంఖము | నక్రము, హాలాహలము | కల్పవృక్షము, ధన్వంత |
| | | | [రిః. (పుం) |

రాజకుంజరా, నే భూలోకలోకనార్థినై నను డెంచి శ్రీపాండురంగని సందర్శించి యిట కేతెంచితి. నీబోటి సద్గుణగణవిభ్రాజితుండును, మహాశయుండు నగు ధరణీశ్వరుం డిద్ధరామండలంబున నుండ విలోకింపక ననర్థ మగునే? వెండియు నీపండరీక్షేత్రమహిమాతిశయము గణనాతీతము. అయినఁ గొంత విశదీకరించెద నాలింపుము.

సీ. ఘనవాహినీనికరనిషక్తిసన్మణి, సమితినానాథంగ చక్రయుక్తి
శాదతారాబ్జాళిసంసక్తిచే నను, సారిధరాధర సంచయాప్తి
ప్రథితచక్రివిహార పరిలబ్ధిచేవల, మానఘనాఘన దానలబ్ధి
గరువంపుహరిసముత్కరప్రాప్తిచే ద్విజ,న్మవరోపలబ్ధిఁ గమలకరామ
ఆ. నస్వినీపరికరనిషంగంబుగరిమఁ
బుష్కరేశప్రతతి నిది పొల్చెనంచు
మెండు తెలిదీవి విడిశౌరి పుండరీక
వరదుఁడై పొల్చెఁ బండరీపురవరమున. 50

ఏతన్నిమిత్తంబున నీపురంబు పండరీపురం బనుపేరన్ బరంగె.

తే. క్షేమమే, నీసతీసుత సేవకులకు
నీదురాజ్యంబునకు నీకు నెమ్మిదెల్పు
యశో:—
మానివర, భద్రమయ్యె మీ మహిమకతన
దక్కదే శ్రేయమ్మునఘుల దర్శనమున. 51

త్రికాలవేదీ! మీరు నను డెంచుటం నే సిద్ధమనోరథుండ నైతి. భవద్దర్శనంబు భగవద్దర్శనంబుఁ బోలెఁ బరమవల్లభం బొదవెఁ గాని సూక్ష్మ సందిగ్ధమొండు నాడెందమున సందుకొని సందడించుచున్నయది. మీరలీవిచికిత్సారాహిత్యమున మదీయమనోరుజను జికిత్సింపుఁడు.

నార:—రాజదేవేంద్రా, ఆసంశయ మెయ్యది?

యశో:—అవధరింపుఁడు.

తే. ఇందుగలఁ డొక్కరుండు పురందరుండు
బ్రహ్మబంధువుకృపణుండు వార్ధుషికుఁడు
వానితో బాదరించెడు వానిఁగాన
నతనికమితార్థసాధనీ యంబదెట్టు? 52

నార:—రాజశిఖామణి, తద్బ్రాహ్మణులకుండు గతజన్మంబున హరిధ్యానసనాథుండై స్వకృతాగణితమఖాప్తి నేతద్భవంబున నఖండైశ్వర్యాధికృతుం డయ్యెఁ గాని తొలిమేన నతఁ డొక భక్తుని నిర్నిమిత్తముగఁ జెఱయందుంచిన కతమున నీభవంబున నతనికిఁ గారాగృహప్రాప్తి యుత్పాదిల్లఁ గలదు. అయిన నాఖండలుంబోని యతం డిప్పుడు తద్భార్యామణిమూలంబునఁ గృతకృత్యుండు కాఁగలండు. కావునఁ దచ్చృద్ధాంతము కేవలాశ్చర్యముగాదు గాని సాశ్చర్యకలికాలమహిమ వినుు.

సీ. వావులుచెడిపోయె వర్ణాశ్రమాది ధ
ర్మంబులు భువిసంకరములనొందెఁ
గూటసాక్ష్యములు బొంకులుఱంకులు సుఖసం
కటములు కటముగఁ బటవణించె
వట్టివేదాంతము లక్కట్టాయితము లయ్యెఁ
జెట్టచెర్గుములుప్పుం జీభవించెఁ
దల్లిదండ్రులమాట దప్పయ్యెనొప్పైనఁ
బెద్దవయ్యెఁ బత్ని సుద్దులెల్ల
తే. నిత్యకర్మము నీఱయ్యె సత్యమాటె
రాజ్యమేలఁగఁ దేఱని రాజులైరి
కవులవాగ్ధారలెల్లనా కమ్ముఁ జేరె
నేమనఁగవలెఁ గలిధర్మ మిల, నిలేశ. 53

సీ. మనుజోత్తమా విను మఱియుత్తరోత్తర
మీభారతావని నేసఁగువనట
లరయఁగన్యాశుల్క వరశుల్కపై శౌచ
జాలములఁబడి ప్రజలరితివిడి
యాత్మజావిక్రేత లైవేదబాహ్యులై
పావనోర్వీకీర్తి భంగపఱచి
యమితధనాశచే నధిక వృద్ధులకైన
వెలలకు మదిరేతు ణలనొసంగి
తే. సంతసించెదరీయ నాచారములల
బాలికలు పొందుదురవస్థ లోలిఁదలఁపఁ,

గనఁగ, నెట్టిదుర్వృత్తుల కైనసకట!
చిత్తమెరియదె? యన్యులఁ జెప్ప నేల. 54

వెండియుఁ గొందఱు మూర్ఖులు నిర్దయాత్మకులై క్షుద్రదేవతలకుఁ గడు నీచమై నరకహూలకము నతిభయానకము నగు బలుల నిచ్చుచు నిర్భరనిరయమునుండి నిర్గతిఁ గానక నిధనమునొందుచున్నారు. ఇట్టి దురాచారములంబట్టియే, భూసురేశ్వరుఁడు కడునిడుమల కాలయమగుచున్నాఁడు. ఇట్టివి లేమిచే "వర్ణానాం బ్రాహ్మణః శ్రేష్ఠః" అను విఖ్యాతిని ద్విజుఁడు వడసి సుఖించుచున్నాఁడు. కావున "అహింసా పరమోధర్మః" "సదాచారేణస్వాస్థ్యం లభతే" అను సువార్తలగుర్తించి తదభిచరులై వర్తించిన నైహికాముష్మికసుఖము లనుభవించుట కేలాటి యభ్యంతరము తోరలదు. "సుజనస్యకీర్తిర్లోకే ప్రసరతి" అను నీతివాక్య మెఱుంగమే ?

యశో:—దేవా, పరమాహ్లాదం బయ్యెఁగాని మఱియొండు విజ్ఞాపన చిత్తగింపుఁడు. ఔదార్యము లేనివాని కెట్టిగతిగలుగు?

నార:—నరేంద్రా, ఏమానవుండైన నేమి?

ఆ. దానరహితుఁడైనఁ దా లేవడిఁ బుట్టు
నందువలనఁ బాప మడరిసేయు
నట్టిపాపిసువ్వో, యఘరూపమునఁబడి
మరలఁ బేదయయ్యు మహీనిదోఁచు. 55

ఏతత్పరిహారమునకై యథాశక్తిఁ దాగశీలుఁడు కావలయుఁ జుమా.

యశో:—మహానందమే. స్వామీ, వేఱొండు విన్నపము.

ప్రభువృత్తము.—మని కితపడియును మమతాశలస
మ్మనమున్గడుస మ్మతిఁగూర్తురిలన్
మనసిజగురుఁ బ్రభు మదియించుచునా
మనిగానరుస మ్మదమానసులై. 56

దేవా? దీనికిఁ గతమేమి?

నార:—భూపాలా, మంచిప్రశ్న యడిగితివి. భక్తిమాత్రము కులాచారవంశనియమస్థానకాలపరిమాణాదుల నావశ్యకము లైనను విను, మిక్కిలియుగంబున నసేకులు మాయామోహితులై తనువులు నిత్యమని నమ్మి తుచ్ఛభోగాస్పదనిజకళత్రపుత్రధనార్జనవిషయమై సదా ప్రయాసపడుచు వేశ్యాసంగీతనృత్యములయందో నిహీనకార్యములందో నిరస్తపురాణములందో, తన్మనంబుల ఘనం

బుగాఁ జొన్ని నీరసంబగు కల్లోలకల్లోలముల న్దేలుటంబట్టి దేహకష్టముగాని ద్రవ్యనష్టముగాని లేని సదానందకరమగు "రామా, రామా" యనునామంబు (కష్టతమమైన యాగయోగతపస్సమాధులకన్న నెన్నియో మడుంగులు సుల భమై ముక్తిదమైనను) వారిడెందంబులఁ బట్టదు. అట్టి రామనామప్రభా వంబు నీకుఁ గొంతదెలిపెద. నందించి యాలింపుము.

సీ. సారమై త్రిభువనా ధారమై భవవార్ధి
తీరమై భక్తసత్కారమగుచు
యోగమై యమృతసం యోగమై యధికాను
రాగమై విగతోప రాగమగుచు
నందమై ధీయుతా నందమై సద్గుణ
బృందమై యోగుల డెందమగుచు
సాదమై చ్యుతశౌరీ వాదమై సర్వార్థ
మోదమై సంతత శ్రీదమగుచు

తే. నెసరు శ్రీరామనామంబ దేమొనాక, వలచువారికినపవర్గ వైభవంబు
కరతలామలకంబగుఁగాదె ! శాశ్వతశుభదాయకమ్ము నీవిడ ధాత్రిఁ [జేటు.

రాజేంద్రా:—

తే. వినుము, హరినామ మెచ్చోట వెలయుచుండు
నుండుసురయతిసంఘము లుర్విసర్వ
తీర్థముల్గాకభక్తసం దిగ్ధతాప
హారిమాపునోహరి శ్రీహరియుఁదనరు. 58

యశో—మునీంద్రా, తాము వాత్సల్యపూర్వకముగా రామనామామృతపానంబు దయ చేసినందున నేఁ బవిత్రుండ నైతి.

నా—భూజాని, వేళమీఱినది. పోయెంచెద. (అని రెండజలిడి తనలో) నేఁటాసు, ఏతద్దివసంబునఁ గలహబీజంబు లభించె. దీనికి సాగరమేఖలారమ ణుండును దయామయుండును నగు శ్రీహరి మానసాలవాలంబు గావించుటే నంచు. ఆటుగావించినఁగదా? కలహాశనుండను సార్థకనామంబు నిలుచు. (మంద హాసముతో) ఆహా, ఏతన్నిమేషమునఁనే చని యల్లకల్లోలముచేసి చూచి సంతోషించెద. (నిష్క్రమించును.)

మహా—(రాజ్ఞితో) ప్రియా:—రమ్ము. (ఇద్దఱు నిష్క్రమింతురు)

# ద్వితీయాంకము.

## స్థలము. I బొంబాయి యోడరేవు.

---

### ప్రవేశము: పురందరుఁడు.

పురం—ఓహో, ఈరేవు నావలకెంత తావలమైయున్నది! పలోక్కుఁ జిరుతేపలు గతాగతములఁ దెల్పుడు సేయుచున్నవి. ఈతేవయేరేవునంగానము.
(చేవాటున నొకకర్ణధారునిఁగని) ఓసరంగూ, ఓయిసరంగూ, ఈయుక్కుజీనులు దించిన యానపాత్రము లెవరివి?

సరంగు—అయ్యా, ఈప్రక్కగాలిచే మిగులఁ జెడ్పడి తుప్పలు దూలుచున్నకలంబులు కలకత్తాలోని భీమనాయకునివి. ఆకడపుఁజేతులుగలయవి బొంబయివారివి.

పురం—(స్వ) ఇకఁదేల యానందరావు ప్రసక్తి ప్రసంగింపఁడు. అతనియోడలు కొన్ని యిచ్చోటనే యుండవలయుఁ గదా?

ప్ర. ఓయి మాలిమికాఁడ, అదిగో, గను.

ఉ. సారసమీరునిన్గలఁచి జంతువులన్ జఠరంబుఁజేర్చి, వా
లారుశిఖల్ధరించి తల నాఘనమున్విదళించి విన్నునన్
దారకరాజిఁదారుకొను తచ్ఛిఖరంబులు చెంగలింప నా
మేరువు రేవమీఁటి గడు మేటిలునొక యొకండుతోఁచెడున్. 1

అదెవ్వరిది?

సరం—సామీ,

తే. మారుతోద్ధూతపోతంబు మ్రగ్గిదైవ
హతనరునిమాడ్కియవిధిసం వృతమునొంది
నేఁడుదేలెడు నానంద నీరధిఁగను,
... మదియె, ఆనందరావుగా రిది, మహాత్మ. 2

పురం—(సంతసమునఁ దనలో) ఓహో, ఇఁకఁ జిక్కినదే.

సరం—అతనివి మఱికొన్ని యిటీవల గాలివానలోఁ జిక్కుపడి మునిఁగిపోయినవి.

(నిష్క్రమించును)

పురం—(విచారగ్రస్తుఁడై) అకటా! ఇంకేమున్నది! ఇంకేమున్నది!
అయ్యా, ఓడంగి, ఏయంగున బ్రుంగుడువడినవి. ఎట్టి దుర్దశలిరిగి మేకొనె.

అయ్యయ్యో, ఇఁకగతియేమి, వలనుతక్కె. నావన్నుగడయంతయుఁ గలలోని భోగముపంతమాయె. సరంగూ సరంగూ, (సబాష్పుఁడై) ఇంకేమి సరంగు. నా జీవగఱ్ఱయుఱ్ఱూఁతలూఁగనయ్యె. "దాక్షిణ్యాద్ధననాశన" మ్మనునదేల వీసరపోవు.

తే. అహహ నాకొంగగుంలె, నే నతనికేల?
వడ్డికిచ్చితిరొక్కంబు వడ్డియాస
మొదలుచెరచు ననెడుమాట మోఘమగునె?
ఇరవుకొనదయ్యె మనమిప్పుడించుకైన. 3

(నిట్టూర్పునిగుడ్చుచు)—కటా, ఏకతమునకో యిట్టియేకతమున నెట్టి యేక తముశట్టినది గాదు. ఏమిబుద్ధి. "విప్రాః పశ్చిమబుద్ధయః" అనునదేలదూలు? (పర్యాలోచించి) ఔరా, ఇప్పటికి మదీయహృదయం బొకింత సుస్థిరతన్నే కొనె. నేఁడీకప్పులపైఁ బైకొనఁబైకొనెప, నొండేని, నిజగ్రామమున వానిది సర్వముఁజేపట్టవలయు. సరిసరి. లేకరికప్పుడే వ్రాసెప. ఆహా, వడ్డి విశేషమా శింపని నాగటియేయిట్లైన సిక విశేషచక్రవృద్ధి గట్టువారికగతి యెట్టిదిగ నుండవలయు. చాల్చాలు. తలదిగెనది. అబ్బా, నాయబ్బతోడు. ఇఁక వృద్ధి జీవికయే యసర్వ్వము. వెండియు నప్పిచ్చినవాఁడు ఋణగ్రస్తుని కెప్పుడు మేలు దలఁచుచుండినను ఋణిమాత్రము త్తమర్ణుని కెప్పుడు కీడుంపలఁచుచునే యుం డును. ఆహా, కాలమహిమ. (నిష్క్రమించును.)

---

ద్వితీయాంకము.

స్థలము. II వైకుంఠము.

ప్రవేశము : నారదుఁడు.

నార—(పరామర్శించి, యమందానందభరితుఁడై) ఆహా, ఇదియ, పరమపదము. వైకుంఠధామా,

ఉ. శ్రీయుత విగ్రహాయ, సుర సిద్ధముఖాబ్ధి సుధాకరాయ, కం
జాయత లోచనాయ, ధృత హాలహలాంచిత కంఠభాసుమి
త్రాయ, పరేశ్వరాయ, శ్రిత తాపసకల్పకుజాయ, విష్ణు రూ
పాయ, పరాత్పరాయ, భృత భక్తవరాయ నమోనమో నమః. 4

(రెండడుగులుసని వైకుంఠద్వారముగుండా ప్రవేశించి పురుషోత్తమునిం గని)

వందనమాదరశీలా
వందనసురమావిలోల వారిదనీలా
వందన మరిగణఫాలా
వందనముదయావిలీల వారణపాలా. 5

వైకుం—ఋషివృషభా, భవదీయాగమ మానందభరితమయ్యె.

స్వాగతవృత్తము:—

స్వాగతంబ, యతి సత్తమ, భావ
త్సాగమంబుఁబడు రారజమయ్యెన్.

నార:—

బాగుగానొకవివాదము దెల్ప
న్రాగశీలుబరి రా, విరసం బే? 6

వైకుంఠధామా, విజృంభితాంబుజమరందాను భోగాయత్తచిత్తసంయుక్త షట్పద రాజం బన్యసుమంబులనాశించునే?

వైకుం—(మందహాస కందళితముఖారవిందముతో) సమీచీనము. అయిన భవ దాస్యాలోక మొండు మనోవికారమును సూచించుచున్నయది. మీరెల్లోకంబులు సంచరించితిరి. అవ్వానియందలి విశేషంబు లెయ్యవి.

నార—సర్వేశా, సర్వదా కందమూలఫలాశుగంబు లాహారంబులుగఁగొని భక్తబృంద మనస్సరోవరపురాళమైన మిమ్ము సదాపూజించు సస్మదాదులమానసం బన్యథా చలించునే? అయినఁ బండరీపురియం దొకవిషయమున మదీయమనం బప హృతమయ్యె.

చ. కలఁడొక భూసురుండట యఖండధనాంధుఁ డసభ్యలోభసం
కలితుఁడునాఁ బురందరుఁడ ఖర్వప్రసన్నవిపన్న మూర్తులన్
గలగొనఁ జేయుఁగానిసగ కాసునొసంగఁడు లక్ష్మిబాయిత
త్కులునికళత్రమయ్యుఁదత దానములన్నగఁ జేయుచుండెడున్. 7

వైకుం—నా, అంతటివాఁడా?

నార—సర్వజ్ఞా, సర్వవ్యాపివి, పరబ్రహ్మమవు. మీకుఁ బరోక్షమొండుగలదే?

వైకుం—వేధస్తనయ, అతినియతిచే గర్వించి నియతిపరివర్జించి మద్భక్తప్రకరమునకు దురాసదమానభంగమొనర్చెడువానికి సద్గతి గల్గునే? వినవే?

" శ్లో. మద్భక్తం శ్వపచంవాపి నిందాం కుర్వంతి యే నరాః
పద్మకోటిశతాద్దేశ్చ నక్షమామి వసుంధరే "

అనువాక్యము. (లక్ష్మితో) లలనామణీ, కర్మయుగధర్మ మాలించితివే ?

"శ్లో. దాతాదరిద్రః కృపణో ధనాఢ్యః
పాపీ చిరాయుస్సుకృతీగతాయుః
రాజాఽకులీనస్సుకులీనసేవ్యః
కలౌయుగే షడ్గుణమాశ్రయంతి"

లక్ష్మి—నాథా, ఏతత్కారణమున నే పురందరుఁడు ధనదుఁడట్టివాఁడైనను ధనదుఁడు గాఁడు. కనుఁగొనిన సర్వము త్వదీయ మాయాచాతురిగ నున్నది. అయినద్దాము కరుణాకరులు.

మత్త. స్వామి, మున్ను దశాననుస్సురు వాలినిన్నరుఁ గంసునిన్
సామజారిని హేమనేత్రుని సత్పథంబునఁ జేర్పరే ?
మీామదిన్వగ నేఁడఁ జేసియు మేదినీసురు నేదిన్
భూమిమీాబిరుదాంకితంబతి పూజితంబయి గ్రాలదే. 8

తే. సారసాక్షయాతఁడుయథా జాతుఁడైన
వినుతిగాంచఁడె ? నిజనితంబినికతమునఁ
గానఁదడవవె, యప్పాలు వానిఁబూని
సూనవాహితవల్కంబు సొగియుఁగాదె. 9

భక్తవత్సలా, మనభక్తాంగన యగు లక్ష్మిబాయి నోముటయుఁ దద్భర్తనుఁ గినాళుఁ డని పాముటయు భవాదృశుల కర్హం బగునే ? సర్వేశ్వరులు, సర్వజనీనులు, సర్వమంగళప్రదాతలు, నిగ్రహానుగ్రహాభిజ్ఞులైన మీా కసాధ్యమే మున్నది ?

వైకుం—(స్మేరాననాబ్జుఁడై) ఆలించితివే ? సురమాని, ఈమాధవీ వాక్యఫక్కి.

నార—రమేశా, మీారు జగజ్జనకులు. ఈతల్లి జగజ్జనని. కావున సర్వధర్మగ్రహ యాశురకు బోధింప నగునే ?

వైకుం—త్రిభువనసంచారీ ? మదీయ లీలావినోదంబులు నీకెఱుకయే ?

శా. నన్నున్నద్దల్చెడువానికంటనుబడ న్నానార్థరాహిత్యనా
పన్నుంజేయకగాని, నిర్ధనుఁడు సంపాదించి పోఁగొట్టి తాఁ

గన్న నేనివరంకునన్నవకురూ కన్నోఁబె నన్వీడి, యో
యన్నా, పన్నునునన్నుఁ గావుమనినా హ్లాదంబునన్గాచెదన్. 10

నార—యథార్థము. మీరు ప్రోజ్వలదయామతులు గాన జగద్ధితంబుపొంటె నిటు లొనరింపుచున్నారు. ఇఁక నాకు సెలవిండు. (నిష్క్రమించును.)

వైకుం—నే నేఁడో యొకచందమునఁ దప్పక పురందరు చేష్ట గనుఁగొనవలయు. (లక్ష్మితో) నీయభిప్రాయ మేమి, రమ్ము. (నిష్క్రమింతురు)



## ద్వి తీ యాం క ము.

స్థలము. III పండరిపురి.

ప్రవేశము : విటుఁడు.

విటు—(నలుప్రక్కలఁగాంచి సంతసమున) అహో, ఈపాండురంగక్షేత్రం బఖండీభూతతేజోవిభవంబునఁ దనరి భక్తజాతంబునకు సర్వదా పారిజాతంబై పరమపదాభిఖ్యఁ గాంచుచున్నయది. వెండియు,

సీసమాలిక.

చిలువేఁగలనుగను-జిగిమిషతోనాల
 చేరువచక్కి-కి-జీరువాఱుఁ
బత్తులుగుమిఁగూడి-పలపలగూళ్లకు
 వేగిరించుచును వే- ర్వేరఁజేరుఁ
జెలఁగుసొమ్ములెన్నెట్టి- జిలుఁగుపయ్యెదవగ
 జీరువాఱవిటులఁ-జీరువారు.
స్నానసంధ్యల్గాఁగ - సమ్ముదమున వేగ
 మురవైరిసన్నిధి-కరుగువారు.
ప్రజలరక్షించెదు - పండరీనాథుని
 వేగన్నులోనాడి-వియలుదీరుఁ
బొరుగు రికిగమించి- పొలిబేరములమించి
 సారెకాఁకొనియూరుఁ- జేరువారు.

అమ్మ, కబళముఁ బె - ట్టమ్మయంచు బికిర
మునకుఁ జట్లను బట్టి - సనెడువారు
పక్వవికర్తను-న్పశ్చిమాద్రి కిఁ బంచి
రాజును రోదసీ-రమణిగోరు.
యామినీవరుఁడు స్వారియరుగుతరుణ
మందు యామినీకాంత పెంపొందిచల్లు
నాణిము త్తెపు సేసయో యనఁగ రిక్క
తుటుములు విన్వీధిఁదన రెసంతోషమొనరె. 11

ఇపుడిరులు జీరువాఱినను నిచ్చోటు దీప్తులచే నలంకరింపఁబడినకతన పట్ట
మధ్యాహ్నముగ నున్నదే గాని ప్రాద్దేమియు లేదు, గాననే వేగ వేశ్యమునకుఁ
జనెద. (రెండడుగులుసని యుత్ప్రేక్ష్యం డై) బళారే, ఈప్రదోషమునందే పట్ట
మైల నద్దెసలఁ గ్రచ్చె.

ఉ. వంటుగ నంటసిల్లె నిటు - పంటవలంతి నిఁదంట సేయ, బ
ల్లంటయుఁ, దమ్మిమంట, మఱి-దస్యులపంటయుఁ, బాంథకోటి పె
న్దుంట, బొజుంగుగొంటరుల-తోడును, దోరపు వెంట పెంటయుౕ,
మింటికి మంటికే కగతి - మీటినఫుంట, నిశాచిరంటి, హా! 12

(తలయూఁచుచు) దొడ్డసమయము. బల్దొడ్డసమయము. ఇదిగో, వేశ్యాగృ
హము. తలుపుఁ దట్టెద. (తట్టుట నభినయించి) ఎవరు ? ఇంట నెవరు ? పలుకరు.

చేటిక—(ఆలించి తనలో) ఈస్వర మెవ్వరిది ! ఎన్నఁడో విన్నట్టున్నది. కన్గొన
వలయు.

ప్ర: మీ దేయూరు ?

విటు—(స్వ) ఏమిాజాగ్రదవస్థ.

ప్ర: నీ వేలోకమున నున్నావు ? తలుపుదీయుము. నీకే తెలియును.

చేటి—ఈలోకముననే యున్నాను గాని తలుపు దీయను.

విటు—ఏల ?

చేటి—ఈసంగతి నీకేల ?

విటు—ఆసంగతికే వచ్చియున్నా నని తెలియదా ?

చేటి—(చిరునవ్వుతోఁ దనలో) ఓహో, నీటుకాఁడే.

ప్ర: వచ్చితివిగదా, సంతసము గాని యేమైనఁ దెచ్చితివా? మనసమాచారము దెలియదా?

విటు—(స్వ) అహో, కుంటెనకత్తెల కెంతయాస? అయిన మనకార్యముకొఱకు హితవచనము లే మేలు.

ప్ర: తెచ్చితిని.

చేటి—ఏమి తెచ్చితివి?

విటు—ముడుపు.

చేటి—(సోత్సాహయైతనలో) మాసానికేగద, ఎవరేమి దెచ్చినను.

ప్ర. ఇమ్ము, సొమ్ము. లేనిచో వచ్చినబాటఁ బట్టిపొమ్ము.

విటు—పోవుటకా, ఇంత ప్రయాసపడి వచ్చుట.

చేటి—అవునవును - మీవేశములు దెలియును. మావేశముల కేగుదెంచినవా రంద ఱిట్లే ముచ్చటించి తుదను వంచించి యేగుదెంచుట యందఱి కభివ్యక్తమే.

విటు—(తనలో) అవురా, ఈతొత్తులే యిటువదరిన నిఁక నీతొత్తులనేలు సత్తులపొత్తు వచింపవలయునే. ఆహా! లోకము. ఎక్కడగాంచిన లంచములతోనేయున్నది. లంచమనఁగా నన్నిటికంటె మాధుర్యము. ఒకనిమేషములో నధోలోకము నూర్ధ్వలోకముగ మార్చుశక్తి దీనికిఁ గలదు. కావుననే ధనికు లనేకులు కొన్ని వేళల మనస్సాక్షికి విరోధముగ దుష్కృత్యము లొనరించినను నిందువలన రక్షితు లగుచున్నారు. ఈవిషయమున న్యాయమనునది భయపడితిరోధాన మొందుచున్నది. అయిన నిట్టిపాపకీల ముభయులను గూడ విడువక దహించును. కావుననే, దీనికి మహాపాతక మను పేర్పెట్టవలసి యున్నది. (చేటితో, ప్రకాశముగ) ఏమి, వంచకులలో నన్నుసైతము చేర్చివేసితివి. చూడఁగ నీకు సమయోచితక్రియమట్టుగ నున్నది. చాల్చాలు. తెఱవు తలుపు. తమిచాలగ హెచ్చె.

చేటి—ఎచ్చెనో లేదో తీయను.

విటు—మీనెళ వెల్లనాకుఁ దెలియునే? ఏల యింకనన్నెఱుఁగనటు మాటాడుచున్నావు?

చేటి—(సశంకగ) నిన్నెఱుఁగుట కసాధ్యమేగద?

విటు—మంచిదిగాని సేసందులోని గొప్పయాలయ మెఱుఁగుదువే?—

చేటి—అవును. అయిన?

విటు—అదెవరిది?

చేటి—(ఆలోచించి తనలో) ఓహోహో, అతఁడే, యితఁడు. దారిదప్పి వచ్చెనో! ఇపుడు త్యాగియయ్యెఁ గాఁబోలు. ఏమో తెచ్చినట్టుగూడ నున్నవాఁడు. (తల్పునందునుండి గనుచు) చేతిలో నేమో వెలుఁగుచున్నది. (నగుచు) ఆహా, ఏమైనను మనసానికప్పనమే, సుమ. కులదేవతలకైన దక్షిణార్పణముసేయకున్నను వారిదర్శనము కలదుగాని సానులకు సమర్పింపకున్నఁ గాముకులకు వేఱుగతి యుండునే? ఇదంతయు నిపుడేల. ఇతఁడు కృతపరిచయుండు గాన దలుపు దీసెద. (అరరముతీయుట నభినయించి ప్రకాశముగ) ఓహో, తమరో, పరాకునఁ బోల్పఁజాలనైతిని.

విటు—(ఆలోచించుచు) వీల రాఁగూడదని బింకముఁ జూపితివి.

చేటి—ఎవరో యనుకొని. ఇపుడు తమకేలోప ముండదు. భవదీయాగమము కోరని కోరికయే యని సంతసించెద.

విటు—దానికేమి? ఇపుడనుకొనవలసినది గాదు.

చేటి—(స్వ) బలే. ఇట్టి వెఱ్ఱిబాగులుండుటకును మనసానులు విఱ్ఱవీఁగుటకును సరిపోయినది.

ప్ర. సరి, సామి. ఇఁకఁ దామసింపక పొండు. ఇదియే దారి.

విటు—(సానందుఁడై) సెబాసు, చేటీ, నీసాటిక చేటిక నేవాటికన్ననుటరుదు. అమితాహ్లాదమయ్యె. నీవే ముందుగఁ బొమ్ము.

చేటి—మంచిది. (అని నడును)

విటు—(రెండడ్జలిడి యుత్కంఠ్యుండై), బలారా, ఈచిత్తరువులగ్గలంబగు చిత్తరువులు, (వేలొక ప్రక్కఁగని) మాయురే! నేనే యనుకొంటి. ఈఘనులందఱుగూడ సాలెపట్టునందలి మక్షికలవలె నిమ్మాయలాఁడి చిట్టకములకుఁ జిక్కియున్నవారే?

ఉ. శ్రీశునివాసమందుబహు-శిష్టగతిన్ సొగియుంచుచుండి, యా
కౌశిక మేనక, ల్విధుఁడు-కామినితారయుఁ, బ్రాహ్మరూపులో
కౌశికగౌతమాంగనలు, - కాలుఁడుగంగయుఁ జెంగలించుచున్
వైశికమంచెలుంగక, ది - వంబిదియంచిటసోలువా, రహో! 13

ప్రవేశము మనోహారిణి.

మనో—(చేటితో రహస్యముగ) ఎవఁడే, వీఁడు. ఉదాత్తునివలెఁ గనుపట్టుచున్నాఁడు. అమ్మో, పెడితేఁడో?

చేటి—కాఁడు. వానివలెనుండు నొకబాఁపఁడుసుమా, నీకేమమ్మా? ఉన్న దొకటూఁతురు. ఊరంతయు నల్లుండ్రు.

మనో—(అనుమోదించి తనలో) హా! ఈపాలువాఁడు పారివాఁడును బోరాని చెలికాఁడునైన నాపోరామిఁయుఁ బోవు.ఇఁక నాకేమిగోలు. ఏమి నాయదృష్టము!

విటు—(స్వ) ఔనౌను. ఇపుడంతయు నదృష్టమే. పిమ్మటఁగదా, నీపిమ్మట దెలియును.

మనో—(చిఱునగవుతో) అయ్యగారు, చిన్నిపువ్వ నైకొనుఁడు (అని దండం బిడుచున్నది)

విటు—(స్వ) ఈపె యేలొకో, నగుచు దండము సమర్పించుచున్నది. ఈదండ మాయుపాయములలో నొకటియై యుండునేమో. (ఆలోచించి) ఛీ, ఛీ, అటులుండదు. మంచిది, ఈపె సానితల్లిగ నుండనోపు. కనొక్కెద.

ప్ర. చిన్నిపూవంటివే. ఆపూఁబోణియెక్కడ?

మనో—సామి, ఇచటనే యున్నది.

విటు—అటులైన దీవించెదను. "క్రన్ననఁ జిన్నెలవన్నెల యల్లువాఁడు దొరకొనుఁ గాత"

మనో—(స్వ) ఏరికైన దూరపుకొండలు నునుపుగదా. చేరువనేఁ జేవిప్పదవ్వుల నున్నపుత్రిని దీవించుట గడువింతగ నున్నది.

విటు—నా వ్యవహారమంతయు వింతయే. వింతలేని చెంతనున్న యింతినెవ్వరు చింతింతురు?

తరలివృత్తము.

సంతతమునుసంతఁదఅలి - జానపదుల రావడిఁగో
సంతపడిన భూధరముల - జానువనుదురా? తెగఁగొ
జెంతఁదలఁగిరాటుపడని - చిందఱలగు రాపడల్
మంతవునని మంతువులొగి - మన్నన యొనరింపరే?

అని నీవ యనుకొంటివిగాదే? పలుకవేల? ఏమాలోచించుచున్నావు?

మనో—(స్వ) ఔరౌర, ఈయొమ్మెలాఁడు మహిమగలాఁడు. ఇతఁడు మాంత్రికుఁడో, లేక, శ్రీ పాండురంగఁడో: లేనిచో మనస్సులోని మర్మమును గ్రహించునే!

ప్ర. ఆలోచనకేమున్నది? నేఁడు వినోదమున కెక్కడు తడవయ్యెనని విచారము. అయిన నొకనాఁటికేమి? రేపటనుండి పెందలకడ విచ్చేసిన బాగగు.

విటు—అహో, రేపటిమాట? రూపమే యుండదే? ఇపుడెంతయాలస్యమైన లోపమేమి?

మనో—(స్వ) ఔరా, ఆత్రయావనులకైన నిట్టిబెట్టుంతునే,

ప్ర—అదెక్కడిమాట ?

విటు—అదియే, యెక్కుడుమాట.

మనో—అయినఁ దమది యొకనాఁటి వేసమా ?

విటు—యథార్థము. నేఁజేయునదెల్ల శాశ్వతమే గాని నేఁటిమాట నేఁడేగావలయు.

మనో—(స్వ) ఔరా, ఇతని మొండిపట్టు ! (నవ్వుచు) గొల్లకొ్రవ్వనపంతయు గొల్లనికే లాభము. నిక్కముగ నితఁడు వలవంతచే మనవలలోఁ జిక్కినవాఁడే. అయినబిడ్డవచ్చునంతలో నితనికి నా సరసపున్ననముఁ జూపుచుండెద. (చేటితో రహస్యముగ) ఓసి, నీవేగి యమ్మినిచేపే పిలుచుకొనిరమ్ము. ఇతఁడు వేఁగుచున్నాఁడు.

ప్ర. స్వామీ, ఇదిగో, ఈ చిత్తరు బొమ్మలబెడఁగుఁ జూడుఁడు. వెండియు నాయూ లేఖ్యములందలి సుమంబులెంతగఁ బూచి పరిమళించుచున్నవో, యాలోకింపుఁడు.

విటు—(వాసించుచుఁ దనలో) ఓహో, ఈపెచమత్కృతి ! ఈచిత్రము లతిచిత్రములఁట ! ఆపటములలోని పుష్పములు పూయునఁట ! సరి, దీని నోరు మూయించెద.

ప్ర. అవునవును. ఈఁగ నేయఁగుఁ జేయు సి లాహిరీమాట లిఁకఁజాలింపు.

(సచమత్కారముగ)

గీ. చెడిప, ఈ ఛేరములవసిం - చినసుమాళి
పూచునా ? పూచుఁగాక, యే - పూతభృంగ
మానకొసుమమారునే ? - సానులనఁగఁ
దేనెయుట్టడినొడికత్తె - లౌనుగాదె ?

మనో—(స్వ) ఆహా ! ఇతనినుడికారము. ఏల, ఇంకను బిడ్డ రాఁగానము? నేఁబోయి పిల్చుకొనివచ్చి వీని పిలుకడంచెద. (నిష్క్రమించును.)

చేటి—(జవనికాంతరమున) ఎంతపిలిచినను బలుకదేల. పన్నుండియున్నది కాఁబోలు. ఇఁక నానేర్పుఁ జూపింపకగాని వల్లలేదు.

ఉ. రాజముఖీ, చెలంగియుండు - రాజతి వేలకలాప్రపూర్ణుఁడై
తేజముతో వెలుంగఁగమ - తిభ్రమణంబునరాహువట్టివి
భ్రాజదతీక్ష్ణమూర్తినుప - రాగపుఁజింతనఁబొంచెఁజూవె, లే
వే, జయమా, మదుక్తివిన - వే, విగతాహితచిత్రకంబునన్.

చంద్రాననా, పాము, పాము, లేలెమ్ము. ఈతక్షణముననే నీనొసటిబొట్టును దుడిచివేయుము. నీకుశుభమగు. లేనిచో నీకనర్థము సిద్ధము.

కన—ఉలికిపడును.

చేటి—(తనలో) హా, సర్పమనభయపడినద్దెసలఁజూచుచుఁ బాఱుచున్నది. పామనిన భయంపడనివారుందురే.

(ప్రకాశముగ) దేవేరీ, పులుకుపులుకునఁజూచుచుఁ బాఱిపోయెద వేల? నీకిది మంచివేళ. లక్ష్మీవంతుఁడగుభూదేవుఁడుచిక్కె. నీచిక్కులుతక్కె. నీకెంత యదృష్టమమ్మ.

విటు— (స్వగతము) నిక్కము. చిక్కెమొక్కటియేతక్కువ.

కన—(తెరవెడలి, యసూయతోఁదనలో) అయ్యలు! ఏమిజన్మము. లయ్యలది. వయ్యముగాదే? ఒకరేయైనఁగంటికఱవుదీర నిదురగలదే? ఈమాపుట్టువుకంటె నొకచట్రాయగుటగడుమేల్గాదే.

సీ. పవలెల్ల నర్తకీ | పటిమాప్తిరేలఁ బ
ల్లవుల రాఁగోరిస | ల్లాలనంబు
సేసిడగరశేవ | డాసిరో యడుగుట
యది లేబరంబైన | నక్కట! యను
కొంటముత్తెపుఁ బంట | వింటిబంటుచెయిద
ములకుమలయుభుజఁ | గులవసతికి
వసతిరూపించుట | ముసలితొత్తుల్చాటు
ముదిరులఁగైకొంట | మదురువుగొని
ఆ. వారురచ్చలూన | వైరంబునచ్చ
పట్టునెక్కిచిక్కి | పట్టుదక్కి
చిడిముడిపడివ్రేల | బడెడిచెల్వలబాము
కంటెరాపడఁగడు | వంటుగాదె. 17

(చేటితో, ప్రకాశముగ) ఓసీ, తవలికత్తె, నీవుజాణవు. నన్నేమఱచితివి. మంచిది, విను. నాకెంతధనంబున్నను సుఖంబున నీసదృశముగా నైతిఁగదా?

చేటి—(తనలో) ఏల, యాకెనాబోకగాదంచున్నది. ఉన్మత్తయైనదిగాఁబోలు. లేనిచో నాజననంబేనయంబనునే.

(ప్రకాశముగ) అంతికా, అస్వతంత్రయగునాదియు నొకపుట్టుగే? నాయిక్కట్టువిను.

సీ. పరభర్తృగురుజనా ◦ వలిపాదభక్తిఁ బా
లినవగునీసేవఁ ◦ జనును బవలు
దోహలంబునఁ జేరి ◦ దొంగగాఁ బర్యంక
మందుపాటూపాటి ◦ నందుబారు
దీరిజలగలఘా ◦ తివడిగరక్తముం
బానం బొనర్చెడు ◦ మత్కుణాళి
ధర్మ కింకరఘాటి ◦ ధామము న్దోడుకంగఁ
దలఁచి వీణానాద ◦ ములను మించు

తే. నాదముల్సేయు మశకసం ◦ తానమెల్ల
రేలఁ దార్కొనఁ గూర్కదే ◦ తెసవి దెసవి
హస్తసైయుండు దాన ర ◦ హాస్యమేల?
ధనమురా, ఫలమున్న ని ◦ ద్రస్ఫలంబె? 18

అమ్మాయి, యిట్లు నల్లులదోమలచేఁ బరితపించుచు నిర్నిద్రయైయున్న నాదియు నొకపుట్టుకయే?

కన—పారికా, ఆహా, ఎంతనేర్చితివే, మశహారి లేకపోయెనో? చాలుఁగాని, యిఁక నీపుస్తకముగట్టిపెట్టి యిపుడేలనిద్రాభంగ మొనర్చితో, దెలుపు.

చేటి—అమ్మా, తెలిపెదఁగానివచ్చెడిలాభములో సంగో రిచ్చెదవా?

కన—అట్లేగానిచెప్పవే.

చేటి—నీయందు దయచేసి యొకగొప్పప్రభువు దయచేసియున్నాఁడని (సగముచెప్పి యూరకయుండును)

కన—ఆ, ఆ, అని, ఉన్నాఁడని, ఎట్టెట్టూ, ఎవఁడతఁడు! శీఘ్రముముగింపవే?

చేటి—పురందరుఁడుగారు వచ్చియున్నారని మీయమ్మ (తిరిగి యర్ధోక్తినుడివి విరమించును)

కన—ఆ! ఎవఁడే! దేవేంద్రుఁడా! నుడువవే?

చేటి—చెప్పెదన్గాని నన్ను మఱవవలదు సుమ్మా.

కన—లేదు. వాచింపవే.

చేటి—అతఁడే, భోగదేవేంద్రుఁడమ్మా.

కన—అనఁగా?

చేటి—ధనికుఁడు పురందరుఁడను మనయూరిబాఁపనయ్య యే తెంచియున్నాఁడనియమ్మ గారు చెప్పిపంపిరి, గాన నీవు వేగముగా రావలయును. కాలహరణము చేసిన మంచిబేరము చెడిపోవును. జీవనోపాధికి మోసమువచ్చును. తదనంతరము నీవదృష్టహీనవే యగుదువు.

కన—(సక్రోధయై) ఓసి తొొత్తా, ఇందుకా! ఆహా! ఎంతచమత్కారము చూపితివే!

చేటి—మఱియెందుకు? మీకు ముఖ్యముగా డబ్బే దేవుఁడని తెలియునే.

కన—అమ్మ రమ్మనెనా? బళిబళి, ఎంతదయ.

చేటి—అవునవును. ముల్లెముందే తీసికొనినట్టున్నది. లేనిచో నిట్టితత్పరత యేల?

కన—ఛీ, ఛీ, పో, పోవే. అమ్మయు నీవును నాపాలి పెద్దమ్మలు.

ఆ ముసలిబేరజమున కెక్కుడి ముదుక బాఁపనుఁడు దాపరించె. ఇదేమి లేఁపురము. వాఁడిచ్చేఁబో, పోవే, చాలు చాలు.

విటు—(స్వ) ఎఱుఁగవా? లోకములో లేని పురందరుఁడని.

చేటి— బాపురే! ముందిడిన యన్నమును బాఱవేయువారలు గలరా?

అమ్మో, ఏల, యింత నిరాకృతి.

కన—ఓసి, నీమాటలు, అంధకుఁడు కట్టడము బాగుగనున్నదనియు, బధిరుఁడు సంగీతము బల్సొంపుగ నున్నదనియుఁ జెప్పినట్టుగ నున్నవి. చాల్చాలు, ఆరజము లేని మీ బేరజములిఁక. ఆతని వృత్తాంత మెఱుఁగవుగాఁబోలు.

క. ఋణులకు సింహస్వప్నము
కుణపమునాఁబరఁగునార్త - కోటులనడుమన్
గణికాసక్తుండెటులోఁ
బణమిచ్చుటచింతనీయ - పథమాఁగాదే? 19

విటు—(మీసలువడివేయుచుఁ దనలో) ఔనా! ఇదంతయుఁ దప్పక నీచింతకొఱకే.

చేటి—(స్వ) ఈముండలెన్నండిట్లే. విటరాయండిల్లుసొచ్చినదిమొద, లివ్వండే, యివ్వఁడే, యంచువాని గాఁడుగాడుచేయుట నేనెఱుఁగనే? అయినను సమయమునఁ జెలికి హితవు దెలుపునదిగదా, నెఱజాణతనము.

ప్ర—సారసదళనేత్రా, ఆలాగుగాదు. ఈతనిచరిత్ర మతిచిత్రము. ఇతఁడు పరమాత్మస్వరూపిగాని యితరుఁడు గాఁడు.

ఆ-వె. ఇమ్ముగానెఱుంగు, - మిమ్మహాత్ములకంటె
ఘనులు లేరు లేర్భు - వనములంధుఁ

గానసీకలిమిసు - ఖం పడిరొయిదవు, ల
క్షింపు, మిాతనిఁబని - చెం బకారి. 20

విటు—(స్వ) బకారిరో, అపకారిరో, ముందు తెలియును,

చేటి—ఇంచుఁబోఁడి, వినుము. నీవు పాండురంగనిపంచ సంగీత నృత్యాభినయము లొనరింప నించువిల్తుని తండ్రి సమ్మతించి వరహాలసంచినిడుమంచు నీ పుడమివేల్పు నంపెనని నే మదించెద. నీ ప్రథమసుకృత విశేషమెన్నఁదరమే? ఇపుడితఁడు మనకుఁ గామధేనువు గాన వీనియందుఁ బెఱకల పోఁతవలదు.

విటు—(సాని సెగాదిగఁ జూచి తనలో) ఔరా, ఈవిశాలనేత్రములు! నిశ్చయముగ శ్లాఘ్యపాత్రములు. ఇంతలావణ్యము లేనిచో, మాబోఁట్లు వచ్చుటెక్కడి మాట.

క. కలువలొ, కమలములో, జిం
కలొ, మిాలో, వార్ధులొ, మరు - కాండములో, వె
న్నెలపులుఁగులొ, హ్రాల్లవలి
స్మలుసూపిలవించుదాత్ర - ములొ, పరికింపన్. 21

అహో, ఈయిటిగౌను! అకటా? ఈ లలితలతాంగి మోయఁజాలని భారమును మోయుచున్నది. అది యట్లేగద. పురుషులు గేలికొననిచోఁ గొందఱు స్త్రీలమితభారముగలవైనను బంగరు తగడువేసిన గుండ్రాళ్లు ధరించుటకుఁ గొంచమైనఁ గొంచింపరు.

గీ. కౌను, కుచగిరిభారసం - కటమునొంద
మోయనెట్లగుతాలసొ - మ్ములనురత్న
హారములఁ, గట! లేదిఁగ - నట్టిరాలఁ
దెంపరులుముంపఁగనదిక్ర - శింపకున్నె. 22

కన—(విటునిఁ గ్రీఁగంటఁగని తనలో) వీనిస్థూర్చి మెండుగఁ గొండాడుచున్నారు. కనుఁగొనెద. (అల్లనగుచు, ప్రకాశముగ)

ఉ. ధాతృకులేశ, నేఁడతను - తాపమనోహతులై తలంకుమిా
కీతతిశీతలామృతమొ - కించుకపానము సేయఁబోనలా?

విటు—(స్వ) ఔరా, ఎంతక్కాలమునకు దయగ్గలె నీక నేధన్యుఁడ.

ప్ర: నీతనువుఁగా స్పృశించితమి - నీయధరామృతపాయినైన, హ్రా
జ్జాతకుమారఘోరశరి - తాపముపానలు లేకమాలదే? 23

కన — జన్నిగట్టా, మన్మథక్రీడాలంపటుం డధరామృతపాయియౌను గాని వెఱవారల గుదురే? కేవల ధనార్జనాసక్తుల పోకలెక్కడ? వాలుగడాలుని కాఁక లెక్కడ? పల్కోకలఁ బోవలదు. చాల్చాలు. పొమ్ము.

విటు — ఓసి వెట్టి; ధనార్జకు లెట్టివ్యయమ్మునకైన సమర్థులుగాని నిర్ధనులకుఁ గార్యార్థము లెటులలవడు?

కన — (చేటితో రహస్యముగ) అమ్మో, ఇతఁ డుదారునివలె మాటాడుచున్నాఁడుగాని కార్యమున మట్టని యెన్నెదను. వినలేదా, లుబ్ధుఁడగుధని, దరిద్రునికన్న నమిత దరిద్రుఁడనియు, వర్షబిందువర్జిత గ్రీష్మజీమూత మనియు.

చేటి — కాదు, కాదు. అట్లు దలఁపఁగూడదు. ధనదునిబోలు నితనికేమి లోపము? నీకుఁ గొంత యిచ్చినందున.

కన — (స్వ) ఇతని నదునిగ నెఱుఁగక ధనదునిసాటిచేసి పదరుచున్నది. ఈపె యెంత వెట్టిది. ప్ర: (విటునితో) భూసురుఁడ, ఇఁకఁ జాలు, నీ సరసత.

ధృవకోకిల. తగున, లోభికిలేనిచిత్తజ - తాపమున్నదిలోననుం
చఁగను, నుంచినఁదానుదీర్ణ తఁ - జాలమొల్లమొసంగునే?
మగువకూరిమిఁగోరనూరక - మందభావనగాదె? యి
వ్వగలుహాస్యరసంబుగొల్పును-వచ్చురచ్చలు,బాఁపఁడా.24

బాడబుఁడా, నన్నేమార్పవచ్చితివో? నీవేడబమిట చాలు. తలయేరు కూరుచున్నది.

విటు — (స్వ) ఈపె నన్నెఱుఁగక ప్రేలుచున్నదేల.

ప్ర: — తీఁగఁబోఁడి, నాసమాచారము విను. దానంబునఁ గర్ణుఁడను. వెండియుభోగంబునన్, పురందరానుజుండఁ జుమ్మీ. ఈజుమ్మకా నెఱుంగవు. శంకించెదేని, ఇదిగో, రోయి (అని కంకణమిచ్చును)

కన — (చేకొని భయవిభ్రాంతులు గలుగఁ జేటితో) చేటిక, చూచితివే, ఈకడియము. తళుకొత్తుచున్నది! ఇతఁడు తస్కరుఁడో! ఇది దేయమో! ప్రాప్యమో! ఏమి కిటుకు?

చేటి — (నగుచు) కిటుకా! వెనుక దెలియును.

కన—రహస్యమా, హాస్యమా, తెలుపుమా.

చేటి—రహస్య మేల? వీనియాస్యమున్నన నీ మనోదస్యునిభాతి గానఁబట్టెడుగాన ముమ్మాటికి వీని నమ్మవచ్చును.

(చతురశ్రగ)

గీ. అతివ, వీనినివరియింప - నట్టినీదు
బాముమిన్ను గాంచనితన - బాముసరయ
దివకువలకువ లేశుల - తీరుగాదె?
సఖివిగావునఁదెలిపితి - సమయమునను. 25

కన—(తిరుగ కడియమున్నని సంభ్రమమున) అక్కటా, ఇదెవరిదో! ఈసమాచారము ప్రభునకుఁ దెలిసిన నెంత కీడ్తొరలునో! దీని నంటినదిమొదలు నా దేహము కంపించుచున్నది, గాన నిక్కముగ నిది యనపేక్ష్యము.

గీ. అరుదుకడియంబునాబోటి - కర్హమగునె?
దర్శనస్పర్శనములకుఁ - దగదుతగదు
మాయు! మగవారివిశ్వాసిం - పంగఁదగునె?
కల్లలకుఁబుట్టినిల్లారె? - కాసులందు. 23

విటు—ఒయారి, బెగడనేల? దీనిమున్ను పండరీపురీ భూపతి దయార్ద్రచిత్తుఁడై నాకు దానంబొసంగె. నీసౌమ్యవసౌమనస్యములంగని యభిలాషకుఁడనై నీకు దీని దానంబొసంగితి.

చేటి—(సానితో) రమణిరో, ఏదీ? కంకణము. చూతము.

స—ఇందము. (అనియిచ్చును)

చేటి—(గ్రహించి, చూచి, యబ్రపడుచుఁ దనలో) హా! ఎంతనైగనిగ్యము. ఇట్టి దుండుట యెంతయుం నపూర్వము. దీనిఁ జాతనినాతి జాత మేల.

(విటునితో, ప్రకాశముగ) సామీ, ఇదెచ్చటిపని? కడుసొంపుగ నున్నది. ఈభూపాలుఁడే మహాతాౣర్యసంధానమునకై దానముగనిచ్చె. దీని వెలయెంత?

విటు—(ఎలనగుచు) ఎంతైన నీ సానిదేగదా? నీకేమైన నలదా?

చేటి—(కనకవల్లితో) అమ్మగారు, ఇదిగో, కడియము (అని మరల నిచ్చుచున్నది.)

పునః ప్రవేశము. మనోహారిణి.

మనో—(కనకవల్లితో, జనాంతికము) వరారోహా, అందఱు విటులా! ఇట్టి ధనిన్గదా,

విటునిగఁ గైకొనవలయు. ఇపుడు సిగ్గుపడవలసిన తఱిగాదుసుమీ! వినవే? "సలజ్జా గణికా నష్టా" యనుదానిని. మనమలజ్జికలముగామా? ఏలతామసము. (విటునిఁ జూచుట నభినయించి) చూచితివే? ఇతని చిత్తం బిత్తఱి చిత్తజాయత్తంబున మత్తిల్లి బిత్తరియగు నీయందు బిత్తరించె. ఈ పరిహార్య మిపుడు పరిహార్యము గాదు గాన ననుమానముమాని వెలలేని దీనిఁ బరిగ్రహింపు. మనము దీనస్సుఖముగా జీవనోపాయము సేయవచ్చును.

కన—(తనలో) ఏమి, యీమెవసి, వసిగొనుచున్నది. ఇతనివృత్తాంత మెఱుఁగదేమో. (తల్లితో, జనాంతికము) అమ్మా, ఇది వైశికమని యెఱుఁగవు. ఇఁక నీవైశికము చాలు. దీనిఁ బొందినపిదప రాఁబోవు వైశశ మిట్టిదని వచింప నలవికాదు. వెండి, యితండు మొదటనుండియే లోభి, మారునిబారి నెసలారునే? ఎసలారిన మాబోఁటి బోటులఁ గోరునే? కోరినఁ గోరినంతధన మీఁదారునే? మిన్నక దారుఁగాక. ఈకంకణమా, విలువ లేనిది. ఇతని కెటులభించెనోగాని రోయఁ దగునె? ఇట్టి యీవిసంగతి యటుండఁగా లోభులను గాసడిగిన "ద" మ్మనుటకుఁ దెగించుచుండ నీప్రదానము విచార్యముగాదా? చాల్చాలు. అడియాస యేల? పడిగలుగు. నీకుఁ బదివేలదండములు. తొలంగుము.

మనో—ఆత్మజా, నీవు విలాసవతివైనను గోలవు. కాసు గడింపఁజాలవు. ఇట్టి ధనినేల యేలవు. ఇతని లోభియని యనుట తప్పు. ఇందుకు నిదర్శనము నీచేతికిచ్చిన కడియమే. ఒకవేళ ధనికుఁడు పిసిడియయినను సమయమున నతనివలె నిచ్చువాఁడు మఱియొకఁడుండఁడు. చవ్వసేయకను. నెవ్వచేఁ గళవళపడువాని యొద్ద నిడుట కేమందును? అట్టివాఁడు వేశ్యములకు వచ్చునా? గుల్లకానికి బోగముది తల్లివరుస యని యెఱుఁగవే? కావున నీకితఁడే పాత్రభూతుఁడని నమ్మి యిందు కొడంబడి యొడంబడుము. వేఱొకటి విను.

ధృవకోకిల. వరతటాకము నిండిగండిస । బాముగాను నిపాతమై
పరఁగభూరి ఝరంబుగూరును । వాఁడు దెంచిన దానిలో
నురవడించుచు వాలుఁగట్టను । నూఁచముట్టుగ నూడ్చినన్
గరణకష్టము విత్తనష్టము । గాదె, నీ కెటు పాటిలున్. 27

కన—(మనోహారిణితో) తల్లీ, మీరు కఱపునవన్నియుఁ గఱపులుగ నున్నవి. మఱియు నామైగలతరించుచు, మతిగలబరించుచున్నది. అడిమాటలేల? చాలు.

విటు—లోలంబాలకా, నేనెంతయో కూర్మిమెయిఁబోఁగ నీవిటు సేయుట మేలా? నీకెందఱు బోధించినను నిట్టి యయోమయ హృదయమెట్లు గలిగె?

తే. కిసల మానినిన్ గల్పించు । కృత్యమెంచి
యందు, "కిస" మార్చి ప్రతిగ "శి" । యక్కరంబుఁ
జేర్చి "మాఁ" దీర్చి తాఁగ నో । నర్చెనజుఁడు,
కానిచో రావడునె? నీప్ర । గాఢబుద్ధి. 28

చ. అటమటయేల, బాల, చల । మా, ఫలమా, యలమారుఁడుగ్రుఁడై
యటువిరిదూపులేయ, నలు । కా, యలుకా, వలకాఁకకోర్వ, న
న్నటమటముంచనేఁటికగు । నా, తగునా, దిగనాడఁగోర్కులిం
కెటుసను, నమ్మరాదె, వలఁ । తీ, పొలఁతీ, మలతీరుడెందముల్. 29

(అని కదియఁబోవును)

కన—ఆ. ఆ. తాళు తాళు. ఏల యీవిజృంభణ.

కం. తగవా, మగవారికినిది
తెగువా, యెగవాలఁ జాల । తెలిపుమలపె, నా
బగివాఁకగవాఁ గెదవో
వగకత్తెలుగనినవగరె । వలదుతలఁగుమా. 30

విటు—విలాసినీ, యలజ్జికవగు నీకేల యీబిగువు? జీవనౌషధము దయచేసి నాయసువులు నిలువరింపుమా.

పంచచా. చిరాక, రాదరక్తి, నీచ । సేవిసేవితుండుపూ
జిరావజీరుఁడీసడించి । సింగిణిన్గదించుచున్
నిరర్గళాస్త్రజీవుఁడైమ । నీషఁగోరఁగీఁటి, నన్
జరీనరిమ్మఁబొన్నెఁజుమ్మ, । చామ, యోమవే, వెసన్. 31

మదవతీ, మదనుఁడు దయాశూన్యుండైనన్నొదరిమఱిమఱి ప్రహరించుచున్నందున నాయవస్థ యింతింతయని యన నలవికాదు. ఇఁక నీకట్టావిహరింప నీవే దక్షవు.

మునో—(రహస్యముగ) ఇంతిరో, ఇతఁడు లిబ్బిరాయనిఁ బోలువాఁడు, సుమ్మా. ఇది గాలిమాట గాదు. ఇపుడెటులైన భవన్నయనోత్థిత కైతవవీక్షణంబునఁ బుష్పశరదశావస్థాప్తివిదళితస్వాంతుఁడై యున్న వీని జాపిరము లేక వశీకరింపుము. (కనుసన్నగ) చేటీ, ఏమో లోఁగలియందుఁ జప్పుడగుచున్నది గనుమా?

(ఇద్దఱు నిష్క్రమింతురు)

విటు—ఆహా? ఇదిగదా. దొడ్డసమయము.

కం. విరిఁబోఁడి, భయమువల, ద
స్మరుఘోరశరాగ్నిశిఖలు - మనముదహించెఁ
గరుణింపున "న్నహింసా
పరమోధర్మ"యనుఁబల్కుఁ బాలింపరహాఁ. 32

మోహనాంగి, నీవెన్నినుడివినను బ్రాణదానము సేయకగాని నిన్వీడను.

కన—(స్వ) ఔరా, "యావత్సుఖగతంపిండం తావన్మధుర భాషణ" మనునడిపొల్లువడునే? మగవారి కక్కఱదీఱువఱకే, యీ యచ్చికబుచ్చిక. తెలియనుగాని నేఁడెన్ని జిలుగులఁ బెట్టిన నితఁడు విరహతాపముచే నిక్కుచు దాఁగొనె, నిఁక వీనిఁ బొమ్మనఁ బ్రాణగొడ్డమునకు సాహసించు. వెండియు వీనిమనోలోహము మన్మథాగ్నిచేఁ గ్రాఁగి పక్వమైనా బెట్టను 'సుత్తియచేఁ బ్రహరింపఁబడి సాఁగె. దీని మదీయ సూక్ష్మచాతుర్య మన్యావణముచే నొకయూర్మికఁ జేసి కెంగేల నమర్చెద. ఈపదనునఁ బదనుచెడనీక యితని మనయింటికాపరిగఁ జేయ దొరఁకొనియెద. (కంటిప్రక్కనగవుతోఁ లఁకాడఁ దములము చేతఁబట్టి) మన్మథాకార, మీలగువుబిగువు గనుఁగొననింత తామసముచేసితిని. మన్నింపుఁడు. ఇదిగో, తమ్ములము వేయుఁడు. ఈ శ్రీఖండమును గంటిరే? దీనినలఁదుకొన మీకుష్ణశాంతి గలుగు. శ్రీరంజనాదులు మనోరంజకములు గావే? మఱియుఁ బారసీకమునుండి వచ్చిన చిత్తరువులఁ జిత్తగించెదరా? తెచ్చెద.

(అని లోఁగలి కరుగును)

విటు—ఆహా, ఇదియెట్టిమేధావిని! దీనిటాటోటెల్ల నేఁడువిస్పష్టమయ్యె. ఇట్టిరాగమనిదంపూర్వము-కంకణమహిమయే, దీనికిహేతువు.

గీ. చెలులమోహములకుఁజిక్కి - చెలఁగియిటులు
విటులుకొల్లాడుదుర్సర్వ - మటమటించుఁ
జపలలకుఁబన్నుపడునె? ని - చ్చలపువలపు
వగవరిదితాఁటయంచుని - ర్వాణులైన. 33

సెబాసు, ఈపెలోఁజేరె, నాపనితీఱె, నేనిఁకఁదాఁటెద. (నిష్క్రమించును)

## తృతీయాంకము.

### స్థలము. 1. ఒకచావడి.

ప్రవేశము—ఒకగ్రామాధికారి (కొత్వాలు). లేఖకుఁడు.

కొత్వా—ఓ లేఖరి, ఈదినమెన్ని వ్యాజ్యెములు పరిశీలింపవలయు?

లేఖ—మనవిచేసెద, (కాకితములశీలించి) అయ్యా, ఆనందరావుపై దండి దెచ్చినవ్యవహారము ప్రస్తుతము విచారణీయము. ఆవల రెండు లేఖలున్నవి.

కొత్వా—సరిగాని వాదిప్రతివాదు లెక్కడ?

లేఖ—వీరుగో, నూరెలనున్నారు (వాదిప్రతివాదులఁబిలుచును)

కొత్వా—ఆనందరావెవరు?

ఆనం—అయ్యా, నేను.

కొత్వా—ఏమి, మీ రీదండికేమైన ఋణపడియుందురా?

ఆనం—లేదు. అసత్యము.

కొత్వా—లేదా? లేనిచో నితఁడేల వాదించుచున్నాఁడు?

ఆనం—అదేమో, నాకుఁ దెలియదు.

కొత్వా—(దండితో) వింటివే? ఇతఁడప్పెఱుగనని చెప్పుట.

అయ్యో, పాపము. నీ వకారణముగ నితనిఁబైకమడుగ సొపయికముగనున్నదా? ఇందుల కేమైన సాక్ష్యముగలదా?

దండి—లేదుగాని యిది తప్పుసృష్టిగాదు. ఇతఁడచ్చియున్నది వాస్తవము. అవధారణముగ నితఁడధమర్ణుఁడు. పురందరుఁడుగా రుత్తమర్ణులు. ఇపుడేకారణముననో, లేదని యితఁడవగ్రహణము సేయుచున్నాఁడు.

కొత్వా—మంచిది. ఇందులో మీకేమి సంబంధము?

దండి—నేను పురందరుని కరణమును.

ఆనం—స్వామి, ఇతఁడు మంచికరణమే. నన్నుఁగః కరణము సేయుంటకో, లేక, భద్రాకరణము సేయుటకో, వచ్చినటున్నది.

(దండితో) ఓయి, మంగలకత్తి తెచ్చితివా?

దండి—అయ్యా, వింటిరే? ఇతని యధికప్రసంగము. న్యాయస్థానమని వీని విడిచితి. లేనియెడ, (అగ్నిలో నాజ్యమిడినయట్టు మండిపడి పండ్లు పెటపెటఁగొఱుకుచు, విరమించును) వినుఁడు, పురందరుఁడుగారు బొంబయినుండి ఋణ

గ్రస్తులవలన రూకఁ బుచ్చుకొమ్మని, యొక యధికారపత్రికఁ బుత్తెంచిరి. ఇదిగో!
(అని యిచ్చుచున్నాఁడు)

కొ—నీవే యధికరింపు (మరల నిచ్చును)

దండి—పత్రికను జూచుచుండును.

కొ—ఏల, ఊరక చూచుచున్నావు. దురధిగమమా? ఇటిమ్ము.(తీసికొనియధిగమించును)
(ఆనందరావుతో) పురందరుఁడు మీకెంత యప్పిచ్చె ?

ఆనం—ఏనూఱువరాలు.

కొ—ఎప్పుడు చెల్లించెదరు ?

ఆనం—రెన్నెలలలోపల

కొ—దండీ, ఆలకించితివే ?

దం—అయ్యా, ఇతనిమాట ! ఇదిగో, యనిన నాఱునెలలగుఁగదా. ఎవ్వరికైన నధి కరించి యనయమితఁడిట్లేపదరుట వాడుక.

ఆనం—(సవిస్మయముగ, స్వ) హా, ఇతని కెంతవిస్మయము ! ఇది యుద్యోగారంభమే గాని వేఱుగాదు. అరరే, అష్టకష్టములలో లేవడి యెంత జాలిఁ బెట్టుచున్నది. (ఆలోచించి) అవును. అది యట్లేగద. కావున నే,

తే. ధనముగలవాఁడు ధన్యుఁడతనుఁడుపూజ్యుఁ
డార్యుఁ డెకిమీఁడు బీజ్యుండు హార్షమాణుఁ
డన్నిసుగుణంబు లర్థంబు నాశ్రయించి
నిక్క, జీవన్మృతుఁడుగాఁడె? నిర్ధనుండు. 1

ప్ర—దండీ, ఏల ప్రేలెదవు. చాలు చాలింపు.
కొత్వాలుగారూ, ఇతనివల్లనే గుణవరేణ్యుఁడగు పురందరుఁడు వడ్డివలన మను వాఁడని యేపపడె. తుద కతనికీర్తికాంతయుఁ దుదిముట్టె. అదటుండనిండు. నేమున్నెక్కుమాఱు లింతకన్న మిన్నగఁ బరపత్తెము సేయుట గలదు. నేఁడే నధ నుండ. నద్దశావిదూరుండ. వీరు కృతైశ్వర్యులగుటంబట్టి నేనందఱకు నవిశ్వాస మున కెడమైతిని.

కొ—అవును. అదియట్లే. నరునికి దారిద్ర్యముకంటె వేఱొండు కష్టము లేదు. ఇఁక నీవు పొమ్ము. మాట దప్పకుము.

ప్రవేశము - రాజసేవకుఁడు.

సేవ—మీకు జోహిల్లు. (అని కొత్వాలుగారికి దండముఁ బెట్టును)
దేవర, రాత్రి శ్రీపాండురంగనికడియ మపహృతమయ్యెనని విని మంత్రిశేఖ

రులు దానిఁగూర్చి తగుచర్చచేసి చౌర్యము బైలుపడుటపవలయునని తమకు విజ్ఞాపింపుమనిరి. వారును విచారణకాలమున విచ్చేయుదురఁట. అర్చకులును వచ్చుచున్నారు.

కొత్వా—(ఆవేగమున) ఇదేమి! మంత్రిగారేతెంచెదరఁట.

(ఇంచుకవడికి ధైర్యమూని) కానీ, చూతము.

(సేవకునితో) ఓయి, ఈక్షణమున నే తత్కార్యనిర్వాహము చేసెదనని విన్నవింపు. (వ్యాఘ్రేగాండ్రతో) మంచిది, మీరేగుఁడు. మీవ్యవహారము రేపు దీర్చెద.

## ప్రవేశము - అర్చకులు.

అర్చ—(కొత్వాలుతో)

తే. అయ్య, గతరాత్రి మేము దేవాలయమునఁ
దాళకములను వేయించి తరలి తెల్ల
వాఱుజామున మరల నావంచఁగాంచఁ
గటకమట గానరాదయ్యెఁ గట, యిఁకెటులొ. 2

కొ—(సాశ్చర్యముగ) అర్చకులారా, మీరు కవాటమును బంధించునపుడుగాని తెఱచునపుడుగాని యెవరైనఁ గనుఁగొనిరా?

అర్చ—వేగురు.

కొ—బీగము లొకవేళ భూపతనమయ్యెనేమో, శోధించితిరా?

అర్చ—బాగుగాఁ బరిశోధించితిమి.

కొ—మంచిది, ఆవిన్నపున నొకవిన్నపత్రిక లిఖించి తెండు.

అర్చ—అట్లే వ్రాసితెచ్చితిమి. ఇదిగో. (ఇచ్చెదరు.)

కొ—సరి. మీరు పొండు.

(స్వ) అహారే, మున్నెన్నఁడు నవహారుల కలవిగాదు గదా, భక్తజనమనోవిహారి శ్రీహరి కరభూష. నేఁడెట్లాహృతమయ్యె! ఆశ్చర్యమాశ్చర్యము. చూడఁగ, నిది యలవడిన కలములకలపనఁ బిండిగనున్నది.

## ప్రవేశము - సేవకుఁడు.

సేవ—(కొత్వాలుతో) దేవా, అదిగో, మంత్రిగారు విజయంచేయుచున్నారు.

కొత్వా—ఏరి! ఏరి! (టిట్టుబిట్లు లేచి ప్రత్యుద్గమించును)

## ప్రవేశము - మంత్రి.

మంత్రి—(ఉపవిష్టుఁడై యర్చకులతో) మీరెల్ల ప్రదేశములు నెరవుగ గవేషించితిరా?

అర్చ—అవును. బాగుగ నన్వేషించితిమి.

మంత్రి—కొత్వాలుగారు, దేవలుల లేఖలిండు

కొ—ఇవిగో (సమర్పించును)

మంత్రి—అర్చకులార, జరిగినస్థితి దెలుపుఁడు.

అర్చ—హరిహరి, మే మొకపాప మెఱుఁగము. శిక్ష కలుగునను భీతిలేక దాని హరించిన దివాభీతులెవరో, యా మాయామహుండగు పాండుపంగనికే యెఱుక. నేఁడో, రేపో, యావశ్యతోహరుల మోసమ్మైలగు. నిజము నిల్కడ మీఁదఁదెలియుననునది వినమే.

మంత్రి—(జనాంతికము) కొత్వాలుగారు, మనమొకతూరి చతురుపాయములను, మఱియొకపారి సప్తోపాయముల నుపయోగపఱచినను జోరభయ మాఁపలేక యున్నాము. దేవాజీవు లిల్వడిఁగలవారుగాన వారి నవమతి పఱపఁదగదు. కంకణమొకవేళ పాఱువేఁటయందు జాఱి పడియుండునేమో? ఆభూషను దెచ్చియిచ్చినవా రశేషబహుమానాప్తిచేఁ బరఁగుదురని వీథికారాజంబులఁ బ్రకటింపుఁడు. తద్భూషణాన్వేషణమందు మీరును దగుయత్నముఁ జేయుచుండుఁడు. (నిష్క్రమించును)

కొత్వా—(అర్చకులతో) మీరు మీమీ నికేతనములకుఁ బొండు. పిలిపించెదము. (అర్చకులు చనుదురు.) ఆహా! నేనిదివఱ కనేకావృత్తులు చోరులనెందఱనో, పట్టి శిక్షించియుందును. నేఁ డీయాభరణమునకై యెన్నివిన్ననువులు పన్నినను బన్నమే పన్నుపడుచున్నది. ఇదేమి మాయయో! (కొంతతడవు యోచించి) ఒకసమయమున నిది యమానుషముగ నుండునో! కనుఁగొనవలయు (నిష్క్రమించును.)

—•◆•—

## తృతీయాంకము.

### స్థలము II. బజాఱు.

### బ్రాహ్మణుల సంభాషణ.

1 బ్రాహ్మ—(వేఱొకనితో) చూచితిరా? ఈ బాజాఱునందలి యందము.

మ. తమనాసా కుచముల్లొగమ్మసొబగీ తొల్యమ్ము సూ, యంచుసాం
ధ్యమున న్నంపెఁగఁబూలగుత్తులను బద్ధాళిఁ నిషద్యాంతికఁ

రమణీయంబుగఁ గూర్చి పాంథులు వినంగన్వ్రాల్చుఁ డంచుల్లస
త్సుమము ల్సూపుచుఁ బుష్పలావికలు వి ల్తుర్భ్రాతురీవై ఖరిన్. 3

2 బ్రాహ్మ—అవును. ఇట్టి నాతులచేఁత లరుదా! (ఒకపార్శ్వమునఁ గని) ఇదిగో,

గీ. కాంచు మిందీవరతిలకకాండ ములిటు
సంపుటించియు స్త్రీకటాక్షరుచిరరుచిఁ
దనరు నుస్మృద్ర మహిమచేఁ, దలిరుఁబోండ్ర
దోహదంబుల నెంతెంత దొరయదొక్కొ! 4

3 బ్రా—సరిగాని, ఈకలువలకు దోహదక్రియ లుండవు.

క. తమనయనములకు లోఁగియుఁ
గుముదసమునయంబు నీటఁ గుందుచు లోఁగన్
గమలాక్షులు బొట్టువులను
నమర్షయుత్తలై గనంగ నవి యిట్లయ్యెన్. 5

2 బ్రా—అటులుండవచ్చుఁగాని యిచ్చోట నీలతాంతంబులఁ గ్రహియించి యీమంద
గమనలు తమతమ చతురత్వమును వెల్వరించెదరు గనుమా.

చ. హరువగు చంపకోత్పలము లద్భుతమాల్య వివర్తపద్ధతిన్
ద్వరితగతిం ఘటింత్రు, మఱి బంధురసింధుర గామనీమణుల్
సరసిజపంక్తిలాక్షణిక శాస్త్రకవీంద్రులభంగి గూర్చిబల్
సరవిగఁ జెక్కుచందముల సొరు గనంబడఁ జూపు దుర్మరిన్. 6

1 బ్రా—(పరివర్తించి, చూచి) చూచితిరే, ఈ చూతఫలంబులు. ఇవి మేలురకము
లుగ రహించుచున్నవి.

2 బ్రా—(వర్తకునిఁగని) జట్టికాఁడ, వీని జట్టియెంత?

వర్తకుఁడు—ఈయవివంద, అయిదుమాడలు. అవి, ముమ్మాడలు.

1 బ్రా—అబ్బా, ఎంతవిలువ! ఇది సాటాకోటిబేరమా? లేక, తఱుఁగుబేరమా?

వర్త—ఆయడిసాటా యిచట లేదు. కీసగూడ తగ్గింపను. మీకు స్వల్పక్రయమునకు
మంచివస్తువులు కావలయునేమో? అట్లైన వేఱొకయంగడికిఁ బొండు.

3 బ్రా—(నిరోధించుచు) ఏదేని కొనవలసిన, మూడంగళ్లు విచారించికొన్న మోసము
రాదందురు. అయిన నిప్పుడు వృథగావిలుచుటేల?

1 బ్రా—ఏలవృథ?

3 బ్రా—తెలియదా? పురందరునియింట రేపకడ జరుగఁబోవు వైశాఖోత్సవము నందుఁ దలా పలయుఫలముల నంద శోందవచ్చునని. ఇది రూఢి.

2. బ్రా—అన్నన్నా! ఏమేమిః. పురందరునియింటియందా! అబ్బా! అతఁడన్న గుండె జల్లనుచున్నది.

3. బ్రా—ఎవరున్న నేమి? మనకు ఫలంబులు లభించినఁ జాలదే?

2. బ్రా—ఫలములా, బాగుబాగు, మనము మనరాజదంతముల నూడఁగొట్టించుకొని భంగపడిన, దొరకొనినవన్నియుఁ బ్రాయశ్చిత్తఫలములే.

3. బ్రా—ఇది కేవలాశ్చర్యము. అతఁడు ధర్మాత్ముఁడుగాని కఠినాత్ముఁడు గాఁడు. అతని నూరకవిని నిందించుట దోషము సుమా.

వర్త—(స్వ) వీండ్రు క్రయ్యములఁ గ్రయింపవచ్చి యిట్లేల కయ్యమాడెదరు? నే నెఱుఁగుదు, ఈబాఁప లెప్పటికి నిట్లే. తెక తేరగవచ్చినందక్కఁ గొనవచ్చి నపు డిదేఱంపు. ఆహా! మంచిక్రాయకులు, వీరు.

4. బ్రా—ఉండవచ్చునుగాని, యిప్పుడతఁ డింట లేఁడుగాన మనపనివాటమే.

2. బ్రా—ఎట్లు వాటము?

3. బ్రా—ఎఱుఁగవా? లక్ష్మీ బాయివృత్తాంతము.

తే. వినిమయముగొన, కసయము వెలరువాఱ,
కడిచి పడువిందు చేబన్న పడ, కొసంగి
కొనక, తలకొనిసేవగై - కొనక, సతత
వితరణం బొనరించు నావెలఁదిమిన్న. 7

2. బ్రా—ఔరా, ఆమెకీర్తి! ఆమె సుగుణగాత్రమని దెలిసె. ఇఁక వేయేల? నిర్గమింపుఁడు. క్రన్ననఁ జనెదము.

బ్రాహ్మణులు—ఈలాగులాగుగ నున్నది.

1. బ్రా—(తిరిగి చూచి) చూచితిరే? ఆయధికారి, తనబంటుతోఁ గడుజవంబునఁ జనుచున్నాఁడు. హేతువేమో?

2. బ్రా—మనకేల? ఈప్రమేయము. రండు.

(నిష్క్రమింతురు.)

ప్రవేశము - కొత్వాలు. భటుఁడు.

కొత్వా—(భటునితో) ఓయి, ఈయర్చకులభవనములకు బీగములు వేసితిమిగదా, ఇఁక నీవు శీఘ్రగమనంబున గ్రామణులయొద్దకుఁ బోయి, యర్చకాలయముల నిప్పుడే శోధింపవలయునని వారికిఁ దెలియఁజేయుము. ఇదిగో, చీటి.

భటుఁడు—(నిష్క్రమించును.)

ప్రవేశము—అర్చకులు.

అర్చ—(వెఱవెఱలతో) ఇసిరో, ఏమిది, ఏమిది! ఈయపవాద మెంద్దైన న్గంటిమే!

తే. దైవమా, నేఁడు పండరీదేవుపాలి
హార్యమెట్లు ముషితమయ్యె - ననయమెంత!
పంబుగఁల నంబికొమ్మల పాళపాళి
దళనమున దూనెగాదె, విధాతవ్రాఁత. 8

అయినను, "అనాథో దేవరక్షకః" అను సత్యవాక్యమురీతి, భగవానుఁడే మాకు దిక్కు.

కొ—(స్వ) ఏమాశ్చర్యము. ఎన్నఁ డిట్టియన్యాయము కనివిని యెఱుఁగను. చిరతనమునుండి పాండురంగని యర్చించు దేవాజీవు లిట్టినీచకార్యమున కొడిగట్టుదురే. మంత్రియు వీరివిషయమై లెస్సగఁ జెప్పె. మంచిది, ఈపూజరుల విచారించి కరణీయమునకు దొరఁకొనెద.

ప్ర—నంబులు, ఈచోరత్వ మెవరొనర్చిరో, నిక్కముగఁ దెల్పుఁడు.

అర్చ—మే మొక కర్మ మెఱుఁగము. ఆమంగమురారిని దొంగిలిన సంగతి యా దొంగమురారికే యెఱుక. విశేషమేల? అగ్గిపట్టుకొనినఁగద, కాలును.

ప్రవేశము - గ్రామాధికారులు.

గ్రామా—(కొత్వాలుతో) అయ్యా,

తే. అర్చకులయిండ్ల శోధింప నరిగిమేము,
సాలమూలలు లోఁగలు ల్తాలకములు
లోనుగాఁ గలవన్నియుఁ బూనివెమకఁ
గంచు మించాయోఁ బరధనం - బించుకైన. 9

గవేషితాలయంబులఁ బరధనంబేమియుఁ గనఁబడదు.

కొత్వా:—సరి, ఇంకను విచారింపవలయును. మీరందఱు దయచేయుఁడు. మరలఁ బిలిపించెదము. (నంబులు నిష్క్రమింతురు)

ఈనంబివార లుద్వర్తనులు గారుగాని యీలోప్రవిషయమై విచారింపవలయు నను నభిలాష యన్యులకున్నను వీరి కెంతమాత్ర ముండదు. (యోచించి)

అవును. వీర లెప్పుడిట్లే. గుడిలో గంటవోయిన నంబి కేమిలోటని చెప్పఁగవినమే. ఇఁకనీపని నామెత్తిమీఁద యున్నదిగాన నీనికిఁ దగునేర్పాటు సేయవలయును. (నిష్క్రమించును.)



## తృతీయాంకము.

### స్థలము III పురందరుగృహము.

### వైశాఖోత్సవము.

జయరావు—(లక్ష్మీబాయితో) మాతృకా, ఈసుదినంబున వైశాఖోత్సవము నెరపి ఫలదానంబు లొసంగవలయుఁ గానఁ దాము సిద్ధపడవలయును.

లక్ష్మీ—నాయనా, ధనార్జనమునకై ప్రయాసపడుచు సర్వకార్యనిర్వాహకుఁగు మీ నాయనగారు విదేశముననుండఁ దదనుజ్ఞలేమింజేసి యిక్కార్య మవలంబింపఁ దగునె?

జయ—జనని, జనకుఁడుగారు గ్రామాంతరమున నున్ననేమి? మనమొక సద్బ్రాహ్మణపురస్సరముగనే తత్కార్యమొనర్చిన నిది భగవదర్పితమై తండ్రిగారికి మనకు సుఖమొనర్చును గాన మదీయానుజుఁడు సన్నిహితుఁడై యుండ నీయుత్సవము నిర్విఘ్నముగ సమాప్తి చేసెదను. మాగురువుగారిటెంకిలేరని శంకవలదు. వా రెట్లులైన నీదివసమునకు రాకమానరు.

లక్ష్మీ—వచ్చిన నీయచ్చికయుండునే. అయిన నిఁక మీకుఁ జెప్పడినచొప్పునమీరిక్కార్యధుర్యు లగుఁడు.

జయ—(కేశవరావుతో) అనుజ, ఇపుడు పంచిపెట్టినవిగాక రమారమి యిఁకనెన్ని చూతఫలంబు లున్నవి?

కేశ—మనవిచేసెదను.

జయ—అట్లేకానీ.

(స్వ) తల్లిగారిమనస్సు సరిలేదు గాన దీని నల్పములో ముగింపవలయు.

కేశ—అగ్రజ, ఇంచుమించుగ నూఱుఫలములు గలవు.

జయ—ఆహో, అసమృద్ధమే. ఇప్పటికే సమాగతబాడబ్యము పరశ్శతము. ఇవి చాలవుగాన మన క్రొమ్మావితోఁపునుండి మఱికొన్నిఫలములఁదెమ్ము. వచ్చినవారిని నే విచారింపఁ జనెద, (నిష్క్రమింతురు.)

ప్రవేశము - పురందరుఁడు.

పురం—(అద్భుతాగ్రహరసముల నోలాడి) ఏమి, వీరి నిరాఘాటనిరర్థకవ్యయము.
(బ్రాహ్మణ్యముం జూచి) ఔరా, వీరందఱు పుష్పఫలతాంబూలాదులఁ గొల్లగఁ
గొంపోవుచున్నారు. అయిన సంతోషమేగాని యిక్కార్యము నే వచ్చిన
వెనుక చేయఁగూడదా? కన్గొనెద. ఎవరే,ఇంట ఏమి,యిట్టిపని సేయుచున్నావు?
నారాక గనునింపక. (అని బిగ్గరగఁబల్కును.)

లక్ష్మి—(ఆలించి తనలో) నేఁజెల్ల! వల్లడికి లోనైతిఁగదా. వల్లభుఁ డధికాగ్రహ
మునఁ బిలుచుచున్నాఁడు. ఏమైనఁ గానిమ్ము. దైవమేగతి.

ప్ర—స్వామి, మీ సేవకురాలను. వచ్చుచున్నాను.
పురం—(స్వ) ఔరా, ఆఁడువారి కసమిచ్చిన నెత్తిపై మిరెము నూఱుదురుగా!
ప్ర—ఔఁగదే, దొంగసేవకురాలితనము తెలిసె. నీకొనియూట చాలు, చాలింపు.
లక్ష్మి—నాథా, అటుల సెలవీయకుఁడు.

సంవాదసీసము:—

పురం—నాలిబూతమ, యిట్లు న్యాయ్యాయతిని లెక్క-
గొనక వెచ్చించుట ఘనమె? సతికి.
లక్ష్మి—ధనమింతరైన వృథావ్యయింతునె? దేవ,
అభిషంగమేల, మహానుభావ.
పురం—అవమానమనెదు, నిజాంగణాహితసూన
సంకులాత్మత హరి ద్రాంక మేమి?
లక్ష్మి—చిట్టకంబిదిగాదు సిద్ధాయమున నిట్టి
దనయుల తలఁపులఁ దనుపుటాయె.
పురం—దిమ్మరివి నీవు, ని న్నిఁక నమ్ముటెట్లు.
లక్ష్మి— నాథ, ప్రోవుఁడు మీయంఘ్రి నమ్మినాను
పురం— సతివియే?ద్వేషిణీ, నీవ సతివిగాక.
లక్ష్మి— ఈరసింపక నిబ్బరి కింపుఁ డనఘ. 10

పురం—ఏమి, నీకత్తి కడ్డములేదని యెన్నియో జిత్తులఁజేయుచు నిత్తఱి నెదో
ఘొందు నాకంటఁబడ, "ఇది న్యాయ్యవ్యయమా? ఇట్టి నీపెత్తన మత్తునా?"

యనఁ దత్తఱపడి యొత్తివలుకుచుఁ గరుణింపుఁ డనెదవు. ఇది నేనున్నపుడు సేయఁదగదా? నాకన్నులఁబండువగాఁ జూడఁదగదా? అన్యులవలె నీకుఁ జలచిత్తత గలిగెనా? ఇఁక చాలు చాలు. బిగము లిటిమ్ము.

లక్ష్మి—స్వామీ, దురాకృతమేమియుం జేయను. విత్తనష్టములేకయే యిక్కార్యము తెలిపితిఁ గాని వేఱుగాదు. నన్నుఁ గరుణింపుఁడు.

పురం—అవును. బాగుగా తెలిపితివి. చాలు. రమ్ము. ఇట్టి యకార్య మిఁక నెప్పుడు సేయకుము. (నిష్క్రమింతురు.)

## ప్రవేశము - తలారి.

## (విష్కంభము.)

తలా—(గుమ్మెతఁగొట్టుచు) ఓహోయీ మాసులారా, యీయూల యినోండి, యినోండి. మనపాండురంగోడి కడియంనోరుదేరుంతాదో! సెప్పండి. సెప్పండి.డం-డం,డం,డడం,డడం-డం-హో (అని మరలఁదుటుముగొట్టును.) సెప్పితే నీకు శానాశానాగామాలు, ఊళ్లు, యినాం యిత్తారంట. లేకుంటే కట్రంవుంతే మీను తెక్కు,తూక్కు వేత్తా,రహో. (అని తిరుగ మద్దువుఁగొట్టును)

## ప్రవేశము - కనకవల్లి

కన—(ఆలించి, చలించి, చేటితో) చేటి, ఆదేమి విను? తలవరియొకఁడు చాటునటున్నది. అది యరవమో, కన్నడమో, స్పష్టము కాలేదు.

చేటి—శ్రీపాండురంగని కడియమెవరో, దొంగిలించుకొని పోయిరఁట. తద్విషయమై చాటుచున్నాఁడు.

కన—(తిరుగ, చాటువనువిని తనలో) ఓచెల్ల, ఇఁకేమిగతి. ఇటువచ్చునని నాఁడే తలఁచితిఁగాదే. అహా! విభ్రమమున విప్రునివలన నే నెంతో విప్రలబ్ధనైతిని.

చ. హరిహరి, యేమిగాను! భటు లార్భటితోఁ బురవీథులందు నా
హరివలయాపహారులకు నాఱడిగల్గునటంచుఁ జాటఁగా
దరము కరమ్ము దారుకొనెఁ దక్కరిబాఁపఁడు రాయిడించె. వా
సె రభసమెల్ల. అంటుఁ గద, చేసినవారికిఁ జేసినంతయున్. 11

(చేటితో, ప్రకాశముగ) వింటివిగదా, తలవరులు మల్లుకటకమునుగూర్చి చాటించినది. నాకేమియుఁ దోఁచలేదు. మాయమ్మను వేఁగఁ బిలిచికొని రమ్ము.

చేటి—నిష్క్రమించును.

కన—అకటా, ఎట్టిగోసు! విప్ర భూసురునికూన! ఎంత దీనతమనుభవించినను డెందము చిందువందగుచున్నది. నేడు తామసముసేయక యేఖైన నొక దీనతమనునట్టమేలు.

ఆ. కంకణం బేలవచ్చెఁ గంకునివలెనేల
గంకణంబొసంగె సుంకులేక
కొంక కేను దానిఁ గొంటినేలా, యప్డు
కొంకియున్న నిట్లు కొంకనేల ? 12

దైవమా, లోకంబున నే నొక్కర్తనేనా ! నావలె సెందఱు గణికాగణంబు లుండరు ? ఉండియు నెందఱు ధనమార్జింపరు ? ఆర్జించిన యొల్లరకు నిట్టి దోసఁగులు వొసఁగునే ? నే దురాపవలయమునొంది నిరాపనిందంగుంది యీ వంచకునివలన వంచితనైతి. మంచిది. దీనిఁ దల్లికిఁ దెల్పెదు నేనెద. అక్కటా, ఆ జగజ్జల్లితల్లివల్లనేగద, నేనింత దల్లడిల్లవలసె. ఇఁక నెంత వల్లడిగల్లునో. నే మొదటనే వలదనినను వినక యీటక్కులాఁడగు విట కానిఁ దగిల్చిన దాతక్కులాఁడి తల్లియేగదా. అపుడామె తగిలించె. ఇపుడే నిగిలింపవలసివచ్చె. కానీ చూతము.

ప్రవేశము - మనోహారిణి.

మనో—(కనకవల్లితో) అమ్మా, ఏల పిలిపించితివి ?

కన—(అశ్రువులొల్కుచు) ఓసీ, తల్లి కాన, నేఁ డెంతమానభంగమయ్యె! నీవలన. నాఁటిరే యీతఁడుచేసిన బవంతము నాకుఁదెలియమి నింతదావంతముగలిగె. నేఁడారక్షులు కంకణాపహారులకు శాస్తితప్పదని చాటించిరి గాన నేదో యశ్శాంతము తక్కదని మదీయస్వాంత మశ్శాంత చింతాపరంపరల సంతాపించుచున్నది. ఈవలయము వలదనినను నాఖలుఁడు తొలఁగుబావమై నా మెడఁగట్టి తొలఁగఁబోయె. ఇపు డాతలారులు నా బాదఘుఁడును దలారించి యూశెంచి న న్నెంత నిర్బంధింతురో ! అమ్మకచెల్ల, ఇఁక నెం తెంత సంఘటిల్లునో! నే నేమిసేయుదు.

మనో—(దరహాసముతో) వారు వచ్చినారఁటే! అయిన భయపడకు.

తే. ఇంతి నీకేలవంత, యిదంతయింత
యే ! ధరణియందుఁ గల్లవే! యొన్నిసూడ

రమ్య కమలాకరంబుల రహిఁ జెలంగ
నతులకంబూపలా భోర్మికాదికములు. 13

బిడ్డా, ఆకోడెకాఁడొకవేళఁ బైకొని కాడుచేయఁ బైకొనినను వానినాడితో మనకేమి? చూడఁగ నీసుకుమారత్వము నిన్నుఁ జలింపఁజేయుచున్నదే గాని యన్యము గాదు. నేఁడీవోడక విను. ఎక్కడనైన వేశ్యోపార్జనమును వాంఛించువారలు గలరే? కాంక్షించిన మరల నిడ వెఱ్ఱులే? ఇ దెక్కడిమాట? ఈప్రచార మేగికిన్దెలుపక నాచెప్పినచొప్పున నీవిడిమట్టునఁ దహతహాపడక తహతహపడియుండు. వేపలుక్కలేల? నీపనియంతయుం నేఁ జక్కఁబెట్టెద.

కన—అవును. చక్కఁగాఁ జక్కఁబెట్టెడిదాన వే? నీ కిది నిర్విచారము, హృదయంగమము. నాకా? సవిచారము, దరసంగమము. "పిల్లికిఁ జెర్లాటము, ఎలుకకుఁ బ్రాణసంకట" మన్నట్లున్నది నావర్తమానము. ఈ పైఁడికడియము కలిమివసుమతీపతికిఁ దెలిసినఁగొలఁతలఁగదు. కావున సావధానముగ విను.

తే. తల్లి, సచివుని కన్నని ధ్ధాత్రినన్య
థాశరణమేరు లేరువా స్తవిక మిూసొ
దనుగథించి యతనికిచ్చి దన్గడెమ్ము.
ఎలుక పెఱికెఁడు ధనమన నెఱుఁగ వాక్కొ. 14

మనో—(స్వ) అయ్యయ్యో, ఈపడుచువాం డ్రిటుగదా, పాడగుట. ఏమియజ్ఞత. ముదుసలులసలు లీచెలుల కొకలక్ష్యమా? ప్రాయికముగఁ దరువులు వంకర టింకరలేక సరళముగ నుండవచ్చుఁగాని మానవు లటుండుట యరుదు. వారిలో మంత్రులన్నమ్మి సుఖంచినవారు గలరే?

ప్ర—అమ్మా, ఈనీతలంప సమంజసము. నీ కీయుంద్వేగ మేల? అయ్యో, నీ కింకను సంగతి తెలియకపోయెనే!

క. ఆరమణుఁడు నీ రసికత
స్వారమణీస్వరమణీప్రచయములలేమిఁ
సైస్వైరుండై వలగొనెను
ద్ధారక వైతింక నొరులదయ నీకేలా. 15

ఇంతియగాదు. నీవు కోరినఁ దత్సర్వస్వమిడ సర్వసిద్ధముగనున్నాఁడు. దీక్షాలోచన చేసి చూడుము. (నిష్క్రమించును.)

కన—కటా, నే నేమిసేయుదు. ఈమె యెక్కడితల్లి. దుశద్వాక్యములే ప్రేలుచుం
డెదు నీతల్లిప్రాపు సవతితల్లిప్రాపకము గాదే ? ఈమెమాటలే న న్నుంచె. కా
ర్యముమించె. అయిన నీతరుణమున సచివోత్తముని శరణమునకరిగి యీాలుత్త
మును వారికిచ్చి శరణాగత యయ్యెద. నాకిదియే యీాపదనునఁ బదనుగ
నున్నది గాని దాఁకొనఁజేయ మానహాని దప్పదు. (నిష్క్రమించును.)

---

## తృతీయాంకము.

### స్థలము IV. ఆనంద రావుగృహము.

### ప్రవేశము - భటులు.

1 భటుఁడు—(రెండవవానితో) మిత్రమా, ఆహారనిద్రలుపరివర్జించి యెంతయో
ప్రయాసపడి వచ్చితిమి. మనప్రయాసమునకుఁ దగిన బహుమతిదొరకునని
యెంచెదను.

తే. గాలిలేక బొంబాయినుండి
శ్రీముఖం బొసయించితి సెలవెటవునో ?
2 భ— ఆరఘుట్టంబు వైచిన నీరుతిట్ట
ప్రాప్తియానటులే గాక యదనమిదునె? 16

1 భ—అవును, ఇది వారివారి భాగ్యము. కొన్నివేళలఁ జేతికందినవస్తువు నోటికందనిది
యగుఁగాదే. అయిన నీతఁడు మహాదాత, సత్తుబెత్తులుగలవాఁడు గాన మన
శ్రమము తొలఁగును. (ముందుచూచి) ఇగో, రావుగారు వచ్చుచున్నారు.
ఇరువురు—చేతులు మోడ్చెదరు.
1 భ—ఆనందరావుగారూ, గిడిగిళ్లు మీాకు. మేము బొంబయినుండి వచ్చితిమి.
ఇదిగో, ఒకలేక మిమ్ము నిరీక్షించుచున్నది.
ఆనం—(సంరంభమున) ఏది, ఏదేది! ఇమ్ము.
(తీసికొని వాచించుకొంచు) అహో, ఏమదృష్టము.
ఎవోయి, రేవునందును మనసాహుల దేశమున యందును శుభచిహ్నలే?
1 భ—ఆ, అందొఱు శుభమున్నారు.
ఆనం—మతేమి సందేశము?
1 భ—దేశము బాగుగనున్నది.
ఆనం—ఓయా, దేశముగాదు, సమాచారము.

1 భ—సమాచారమా ? బాబు, విశేష మేమియులేదుగాని, మీనావ లోకచేటకు చిక్కినట్టు సమాచారము.

ఆనం—(సానందుఁడై, స్వ) వీనికిఁదెలియక యిది కింవదంతియని యనుచున్నాఁడు. హా! ఏమిసుదినము. దుఃఖోదధియందు మునుంగు నాకు శ్రీహరి పునస్సంతోష మొనర్చె.

ప్ర- ఓయి, లిపికారుఁడా, ఈక్షణముననే యేకాంతప్రాణసఖు లగుధర్మరావుగారి నామతింపు.

2 భ—పరాకు. దేవర, వారు దారియం దగపడి తమదర్శనార్థ మేతెంచెదమని సెలవిచ్చిరి.

ఆనం—బలే, ఏమీ సమయస్ఫూర్తి.

వ్రాయసకాఁడా, నేఁడు, గృహాలంకారముగావించి వేళముగ మేళములఁ దెప్పింపుము. ఈ భటులంగంటివే? కడుదవ్వులనుండి పరిశ్రమమునకోర్చివచ్చిరి.

క. మతిమంతులు వీరికి నేఁ
డితమున వేరూకలొసఁగు మిఁకఁ దస్కరమూ
షితహరి భూషకు నొకప్రతి
గతిమీఱఁగఁ జేయు హేమకారులఁ బిలుమా. 17

వెండియుం వీరలకుఁ దలారెండు క్రొత్తసరిగంచువల్వాల నిమ్ము.

వ్రాయ—చిత్తము (భటులతో) రండు, నావెంట.

1 భ—(రెండవవానితో, రహస్యముగ) కంటివే, మనము రెన్నాళ్లుపాసమున్నందుకు మనదైవమును వేడుకొన్నందుకుఁ గల్గినఫలము. ఇపుడు మనయెద్దడి యెద్దడియై సనె. ఇఁక మనము సుఖింపగలము.

2 భ—అవునుగాని, మానవునకుఁ దృప్తియుండినం గాదే, యోగివలె సదా సుఖింపవచ్చును.

1 భ—అదిసరి. లోకమున సాధారణముగ ధనికునకుఁ దృప్తియే కలుగదు. వినుము. దరిద్రుఁడు తనకు ధనములేమి విధిలేక తృప్తుండు కాఁగలఁడు గాని యాదరిద్రునకే కొంతధనము గలిగినయప్పటికైన న తృప్తుఁడే, యగును.

ఇఁక రమ్ము. (నిష్క్రమింతురు.)

ప్రవేశము - ధర్మరావు - ఆచార్యుఁడు.

ధర్మ—(ద్వారపాలకునిఁ గని) ఓయి, ఫణిహారుఁడా, మీ యేలికగా రెక్కడ?

ద్వార—ఏలికగారూ, గీలికగారూ, తెలియదు, దొరా,

ధర్మ—ఓయి, నీవాలికి చాలించి దొరగా రెచ్చోనున్నవారో, తెలుపు.

ద్వార—శ్రీరంగాచార్యులా, లోనున్నారు. ఇదిగో, ఆసనము. దయసేయుఁడు.

ధర్మ—(ఆచార్యులతో) స్వామి, కూర్చుండుఁడు.

ఆనందరావుగారి సంగతి తెలియునా? వారు వివేకశిఖామణులు, విశేషధర్మపరులు. మఱియుం వినుండు.

తే. ఒకరిలేమి, కటా! యను నోరులకెట్టి
కీడుసేయఁగఁ బూనఁడు పాడిలేక
నైన మానఁడు దుర్వృత్తి గానఁ, డహాహా!
సజ్జనులకెప్డు దైవసంశ్రయము గాదె? 18

ధర్మ—(ఆనందరావుగాని) ఓహోహో, ఆనందనిధులా!

ఆనం—(కౌఁగిలించి) మిత్రమా, ఆనందదాయకులుండ నానందనిధిత్వమున కేమి లోపము?

(ఆచార్యునివంకఁ జూచి) వందనము గురువర్యా. మీరురాఁ బవిత్రులమైతిమి.

ఆచా—మీకు సుఖముగలుగుతను. (దీవించును)

ఆనం—(ధర్మరావుతో) చెలువుఁడ, ఇదిగో, స్వస్తిముఖము. దీన స్నేలభ్యతరణుండ నైతినని జ్ఞాతమయ్యె. నేఁ బోలిపోయితినని తలఁచుచుంటిని. ఇపుడు శ్రీహరి రక్షించె.

ధర్మ—ఓహో, అటులా, చాలసంతసము (శుభలేఖనంది చూచి) సఖుఁడా, మీ స్వాపతేయము కష్టార్జితముగానఁ దిరుగ ప్రాప్తించె. మీయుల్లంబుననున్న చిల్లు లొల్లులు చెల్ల చెదరయ్యె. మీరు ధన్యులరు.

ఆనం—ఇది తరిదాల్పుసాయముచేతను మీయట్టి శేముషీనిధుల సేయముచేత నేగద, కదురుట.

ధర్మ—ఆచార్యవర్యా, వింటిరే? ఈప్రతిపత్తికి వీరిసుగుణత్వమే కారకహేతువు.

ఆచా—అమితాహ్లాదమయ్యెఁ గాని, యిపు డితని విరోధి పురందరుం డార్తగర్వితుం డయ్యె.

ధర్మ—స్వామి, క్షమింపుఁడు. పురందరుఁడు మహానుభావుఁడు. సుగుణగణ్యుఁడుగాని గర్వ్యుఁడుగాఁడు. కావున వారి నూరక పోనాడఁదగదు. వారు మన కేమి యధర్మము చేసిరి? అచ్చపలసిన సొమ్మునిమ్మనుట యెవ్వరికి న్యాయ్యమేగద?

ఆనం—(ధర్మరావుతో) మిత్రుఁడా, సరిసరి, రమ్ము. శ్రావ్యంబగు తూర్యారావంబు వినెదము.

(ఆచార్యునితో) ఇంటఁ బ్రియాకాదికలుజరుగు చున్నవి. దయచేయుఁడు, స్వామి.

(అందఱు నిష్క్రమింతురు).

## తురీయాంకము.

స్థలము I పురందరుమందిరము.

పురందరుఁడు - లక్ష్మీబాయి.

లక్ష్మీ—నాథా, కట్టడి నెఱింగియు నింకను మనమే పుట్టువును బుట్టినింటను దుచుకొంట వంటుగాదు. మనబిడ పరిణయయోగ్యయయ్యెనని తెలిసియే యున్నది.

గీ. స్వామి, వేదోక్తముగ యుక్తవయసునంద
నందనకుఁ బెండ్లి సేయు మానందముగను
గనులపండువుగను జూడఁగలుగుమనసు
మనసుతోద్వాహవిధియందు మగ్నమయ్యె.

పురం—ప్రాజ్ఞీ, నీవు సుతాపాణిగ్రహణైకతత్పరతం జిక్కి చిక్కుపడి సంరంభించుచున్న దానవు. మనబిడ్డను నామేనల్లున కీఁదలఁచితినని నాఁడే నుడివితిఁ గాదే? అయిన నీ యభిప్రాయమేమి?

లక్ష్మీ—(వ్యాకులితయై, స్వ) అక్కటా, ఈ యక్కజమేమి. నాయక్క అకుఁ జుక్కవాలగు నిక్కువ నిక్కువముగఁ గనుపట్టుచున్నది. సకలశ్రమల కెంతకు చేడ్పడినను దయ్యము తోడ్పడనిచో నంతయుఁ గాడ్పడుఁగాదే.
"అన్యథా చింతితంకార్యం - దైవమన్యత్ర చింతయే" త్తను జనశ్రుతి యేం వమ్మగు.

ప్ర—ప్రాణేశ, నే సరస్వతిబాయిసుతున కిక్కన్యనీయ గమకించితిఁగాని, నాగమ కము మీకు గమకమగునే? ఎట్లయినను,

చ. అరమరయేల, యగ్రసుతుఁ డాలయ కార్యధురీణుఁడౌఁ గదా?
దురదురవానిఁ బిల్చి మన దోహద మివ్విధమంచు నిత్తఱిఁ
దొరితొరిఁ దెల్పి తద్వచన ధోరణిఁ గన్గొని యట్లొనర్చినఁ
జిరపరమానుఁ గానసుతుఁ జేరఁగఁ బంపుము, మన్మనోహరా. 2

పురం—(ఎలనగుచు) ఓ, పరమాలోచన.
దామోదరా, జయరావును బిలిచికొని వేగరమ్ము.
(దామోదరుఁడు నిష్క్రమించును)

పురం—(భార్యతో) ఏమి, ఏవిషయమునకైన, భర్తృభాషణమునాలకించి తగిన చనుల విరతయై యోచనలు తనుఁజేయుటయు నతనిచేత భరింపఁబడునది గాదే, భార్యా.

వినవే ! "కార్యేషు దాసీ కరణేషుమంత్రీ, రూపేచలక్ష్మీః క్షమయాధరిత్రీ, స్నేహేచమాతా శయనేతువేశ్యా, షట్కర్మయుక్తాకులధర్మపత్నీ"

అను నీతిశ్లోకము.

ప్రవేశము - జయరావు.

పురం— (సుతునితో)

తే. తనయ, నీచెలియలిని నీ తల్లిసింహ
సంవాసనుఁ దగుభర్తకు సరవిఁగూర్పఁ
దనిన, నీబావకిడనొప్పె మనము, సుమ్మి,
అయిన నీయభిరతి దెల్పు మరయిఁకేల. 3

జయ—జనకా, పూజ్యులును ఘనులునగు దమకిట్టి యిష్టియున్న నందఱి కమితతుష్టి గాదే. ఇఁక నాయభిమతములో నేమిప్రయోజనము ?

పురం—అది సరిగాదు. నీ పరాయణ మేమో, నిష్కర్షగాఁ దెలుపు.

జయ—(ఆత్మగతము) అహో, మాతరపితల కిక్కార్యమున నితరేతర మైత్రిలేనట్టున్నది, వెనుకటి నిజస్థితివచింపక వెనుకదీయం దగదు. అవ్వల సహోజాదృష్టము దృష్టింపవలయు.

(ప్రకాశముగా) గురువర, అట్టి మాబాంధవము విచార్యము.

పురం—ఏల ? ఇరువురి జోడువిజోడా ? సజ్జకనుగాదా ? లేక, మాతల్లి యాజ్ఞతా అపలుకుల నుల్లంఘింపఁ బలుకగునని యిటుసట సేయుచున్నావా ?

జయ—(సచింతగ) జనయితా, నన్నింత యొరయనేల ? నే వానిచెంత నిలువఁజాలక చాపరుగునఁ బాశైంచితి. అబ్బా, మాయల్లుని దుష్కృత్యము లింతింత యనివలుక వలఁతిగాదు. నిక్కముగా నతండు దేవానాం ప్రియుండుగాని ప్రియంవదుండు కాఁడు.

ఆ. వలయనఁగ వాని బాలిశచేష్టలు
గంటి, మంటిమింటఁ గాననట్టి

కొంటెఁ గల్వకంటిఁ గూర్ప, వేఱొకటియ
పాత్రదానమగునె? ధాత్రిలోన. 4

తండ్రీ, వేఱొండువిన్నపము వినుఁడు. అటుపిమ్మట విద్యాసాగరునిఁ గని మా టాడితి. ఆహా! తన్నిరవద్యవిద్యాభావము, తన్నిరహంభావము, తన్నిరవధిక సౌహార్దము, తన్నిరాఘాటసభ్యత్వము, తన్నిరుపమానసూనశరవన్మనోహరా కారము. ఈశుభలక్షణములు కేవలాగణితవ్యములు. ఆవల మీ చిత్తము.

పురం—(నిస్పృహతో, స్వ) ఔరా! తన్నుఁ గట్టఁ ద్రాళ్లు తాఁ దెచ్చుకొన్నట్టాయె, నాపని. వీరి జిగీష నిటమున్నఁ దెలిసియున్న నీపన్నుగడ పన్నియేయుండను. ఈపె విద్యాసాగరునిపై నింత వ్యాసక్తయైయుండుట నే నెఱుంగను. (ప్రకాశముగా) సాధ్వీ! నీగాధము సాధించితివి. ఇఁక నీకోరిన జన్నిగట్టుబొట్టి యన కీబొట్టియ నిమ్ము. బంధుతాప్తులఁ బిలువఁబంపుము.

లక్ష్మి—(చిత్తముచెలంగఁ జేమోడ్చి) మహాప్రసాదము.(దామోదరునితో)ఓయి! మన గురులను దెప్పునఁ బిల్చుకొనిరమ్ము.

పురం—వీరుగో, వాణిజులు, ద్వారమున కేతెంచియున్నారు. చనెదను.

(నిష్క్రమించును.)

లక్ష్మి—(పశ్చాపశితోఁ దనలో) అన్నన్న! నేఁటికి నాతలపోఁతకు భర్తగారు మేకొనిరి గానఁ బరితాపమగ్నమైన మదీయమనఃపీఠి మహానందలహరి నోలె. ఇయ్యది నాముద్దుపట్టిపట్టునః బట్టుఁగొమ్మయగు గట్టుఁదాల్పు చేసిన కట్టడియే. ఇఁక నాకేమి తలపోఁత?

ప్రవేశము: గురుఁడు.

లక్ష్మి—(గురునితో)

విపులకందము. గురువర్య, మాకుగురులుగ
వరకార్యముఁ దాలిమి నెరపఁగలారుగ
పరమవివేకుల్ సద్గుణ
భరితులధిక నిపుణులుహారి భక్తవరుల్. 5

స్వామీ, మీరు సకలశాస్త్రవేద లగుటంజేసి సర్వలోకపూజ్యులరు. "స్వదేశే పూజ్యతే రాజా, విద్వాన్ సర్వత్రపూజ్యతే," యనున దెఱుంగమే? కావున

మీరు కోలాపురికేగి నే చెప్పినచొప్పన నికార్యము సమర్థించి వేగ రండు. మీరాకకు వేచియుండెద.

గురు—ఆలాగే. (అందఱు నిష్క్రమింతురు.)



# తు రీ యాం క ము.



## స్థలము II. వర్తకశాల.

### పురందరుఁడు: ఆనందరావు.

ఆనం—(పురందరునితో) అయ్యా, వింటిరే! ఈమధ్య మదీయసత్యావ్రతమునఁ గొన్నిగండకములు రాఁగ నాకు గ్గొంతచేతవిలె. అందుచేతఁ గొండాటము లేక యుండిన నన్నుదూఱుచు మీదండి దండింపఁగడంగె. అయినను శ్రీపుం డరీకాక్షు కటాక్షంబున నా సిలుగుతొలఁగె.

పురం—(స్వ) ఏమిది! అతఁడు నాకపఖ్యాతి దెచ్చుచున్నాఁడు. హా! దుర్నయము!

(ప్ర)—దండీ? ఓదండీ?

భటు—దేవర, వారిప్పుడే యింటికేగిరి.

పురం—ఆనందరావుగారు, క్షమింపుఁడు. అతఁ డట్టివాఁడు కాఁడు. అయినఁ జర్చించెద.

ఆనం—దానికేమి? ఇపు డభ్యక్తమైనదిగదా, మీవిత్తము. అంతేచాలు. అంగీకారప త్రికఁ బంపివేయుఁడు. (నిష్క్రమించును.)

పురం—ఓహో, కాలమహిమము.

అడిగినచోఁ జిరాకు. అడుగనిచోఁ బరాకు.

### ప్రవేశము: అక్కుభట్టు.

అక్కు—(స్వ) ఆనాఁడు పురందరుఁ డధికలోభియని నారదుఁడు వచించెఁగాని, యితఁడు దాతృత్వముగలవాఁడుగా నగపడుచున్నాఁడు. నేఁడుచూడఁగ ననేకు లీగృహామునుండి యేమేమో, గొంపోవుచున్నారు. ఇది కేవలాశ్చ ర్యము.

ప్ర—ఓప్రభూ! దీర్ఘాయుష్మాన్భవ. (దీవించును.)

పురం—(విని తనలో) ఎవఁ డితఁడు! ప్రభువనుచున్నాఁడు. (ఎగదిగఁ జూచి) ఔరా, ఇతనివేషము!

సీ. చీకుజనపనార చెన్నుఁ జెనయుఁ గేశ
పాశావృతం బగు ఫాలమెలసి
యగలినయంతికాస్యమువగవగ చెడి
వదరెడుపెన్బాకి వాఘుటిల్ల
వట్టిగోనెన్వెడ్డు వెట్టుచుఁ గరడుల
వడువున వడఁకాడు వళులుగలిగి
ముగికదురఁగ ముఱ ముఱమనుమలమన్కి
గమనికఁ గనుఁబ్రాము బొమలుబెరసి.
తే. అక్షరవిహీన పత్రపంచాంగమొండు
శ్వాసనుచే గను గనుమూయు ఛత్రమొకోఁడు
నలఁగి చెదవట్టు కృష్ణాజినం బొకండు
పన్ని పెన్మూఁతకోలఁ జేపట్టివచ్చె. 6

(ప్రకాశముగ) అయ్యా, నే రాజున్గాను, గీజున్గాను. ఏల యెక్కసక్కెము.

అక్క—ఏమి వాచించెదరు? పెద్ద విన్నపమువాఁడను.

పురం—ఓయి బధిరుఁడ, నీబాధిర్యము దెలిసెనుగాని, యేల యరుదెంచితివి? నన్ను రాజుగాఁ జేయుటకా?

అక్క—ఏమి వచించెదరు?

పురం—ఓయి చెవిటి, ప్రభువుగా నన్నుఁ జేయుటకా?

అక్క—(తనలో) ఓహో, రాజనున దొకతప్పిదమా.
(నగుచు, ప్రకాశముగ) విప్రోత్తమా? ఇప్పు డిదినీకుఁ దగియున్నదా?

చ. ఒరులకు మేలొనర్ప మనుజోత్తమయంచు వచింపఁగల్గె నా
కరులు మరుల్దొరుంగ నిటులాడితి నోడకు మేటి వీవు నే
నరవరులైనవాఁడఁ గనుమభ్రిముఁగోరు చకోరవృత్తి మి
మ్మరసి సమాశ్రయించితి సుమా, స్వరనోకహా మిచ్చఁగేఁటునే. 7

వినుము, నే నిరాశ్రయుఁడనైనందున నిన్నాశ్రయింపవలసెఁ గాన నీవీ యిక్కపాటున నుత్సవముసేయక యుత్సవముసేయుము. ఏదో సంభావనయి వ్వనిచో నే మరలుకొనుటకు వీలుండదు.

పురం——(స్వ) అన్నా ! ఇతఁ డెవఁడో, వార్ధక్యమునను న్న నలిసమర్థుఁడుగను వాచాటుఁడుగ నున్నాఁడు. మఱియు నే నధికర్థినని యెఱింగి యర్థియై యేతెంచి యిట్టియర్థవాద మొనరించుచున్నాఁడు. ఇఁక వీనిమ్రోల మనమార్దవభాషల నుచితము. అయిన వీని నింకొకతూరి పరిశీలింపవలయు.

(ప్రకాశముగ) పాఱుఁడా, ఏల మేలమాడెదవు ? నీవలె భిక్షమున కేతెంచు భైక్షమహారహాం బిచట యేదో సంభావన బొంది పోవుటకలదు గాని యెవ్వరిట్టిపట్టుఁబట్టరు. అయినను నీవు మఱియొకపరి రమ్ము.

అక్క——(స్వ) ఓహో, వీనిమాట సందేహాస్పదముగ నున్నది. ఇక్కడ యతిథిసత్కారము సున్నకాఁబోలు; కానీ, కొంచము నీతిదెల్పెద.

(ప్రకాశముగ)

సీ. ఆర్య, మీవిఖ్యాతి యాచకసంఘంబు
తోఁ దిగంతములఁ గుతూహలమున
పావణిల్లుచుండెడు నను వ్ గన్గొని మత్సు
తావివాహమునకుఁ ధనము సంత
రింప శైత్తులసంగ్రహించి మోచనపురి
నిర్గమించియుఁ బెక్కు నెవ్వలఁబడి
యెంతయు నెమ్మి నే నిందు విచ్చేసితి
నగ్రజన్ముఁడ దతీణార్హుఁ డను, వి
తే. ఱుగఁ బడు నని తలంపక వృద్ధుఁ డంచుఁ
గనుచుఁ బ్రథమాతురో క్తలాంఛనమెఱింగి
కాంతసాయుజ్యపదవిని గాంచు కొఱకు
హార్షివై సామి వసువిడుమనయమణాఁప. ८

పురం——(స్వ) అహో, యితఁడేలొకో "ఆ హారియోటుకా" యని నుడువుచు లేఁత సొట్టల నటుకుచున్నాఁడు. హారి యెక్కడ! ఇతఁ డెక్కడ! ఇతనిటంచాట యిపుడు దెలిసె. ఈబడు వమితధనాపేక్షచే నిట కేతెంచుటంజేసి పుడికిరిం చిన సంతుష్టిఁ జెందునాఁ (ఆలోచించి) లోకమున వార్ధకము పైపడినను, వార్ధకమునకు నాశమాత్రము పైపడుచుండును. వినమే, "జరాయా మపి మానవానాం తృష్ణానశామ్యతి" అన్నునీతి.

(ప్రకాశముగ)

సీ. పో పొమ్ము, విప్రోత్తమా, పామరునిరూపు
 రాపాడఁ బాడియే? యేపరించి
కొలఁదికి మించిన కొసరెలసిన నాకుఁ
 బుడుకంగఁ గొలఁదియే? పొడగను మిఁక
దివసత్రితయ మిప్డు దిగనాడి వెండిరాఁ
 బుయిలోట తక్కనేఁ బుణికిరింతు
నాలి చేఁతలుగావు నాయము న్దప్పను
 నమ్ము మద్వాక్యమ్ము నెమ్మనమున.
తే. అనుదినంబున నతిథు లభ్యాగతులకు
 క్షమ నొసఁగి యథాశక్తి సంగరము గాంచు
వారితో సంగరమొనర్ప వాట మగునె?
 వలదుఁ చాలింపు వైషమ్య వార్తలిచట. 9

పరిచారకుఁడు——స్వామి, ఈ వృద్ధబ్రాహ్మణుఁడు బ్రాహ్మణ్యుఁడుగ నున్నాఁడు. సెలవొసంగిన నర్ధచంద్రప్రయోగముచే నీశనిఁ దొలఁచెద. (అని యంగ రేకుమీఁదికిఁ ద్రోయును.)

అక్కు—— (స్వ) ఆహా,

శ్లో. "పాదపానాం భయంవాతః పద్మానాం శిశిరోభయమ్,
 పర్వతానాం భయంవజ్రః సాధూనాం దుర్జనోభయ"

మను నదేల యసత్యమగు. అయిన నీమూర్ఖులకే నుభయపడెదనో.

ప్ర——అవునవును. అర్ధప్రయోగార్హులకే యాప్రయోగ మర్హము.

పురం——(స్వ) ఔరా, వడ్డిచేదీవించి బ్రదుకువారికే యిది తగవగునని నుడువుచుఁ గడకితఁడు నన్నుఁ గుసీదునిగఁజేసెను. ఏ మితనిచతురత.

(ప్రకాశముగ) పరిచారకుఁడ, వలదు, ఉండుండుము. చూతము.

అక్క—ఓయిః పురందరుఁడా, నాతో నీకీఘర్షణ యేల? మాదృశుండు భవదావాసమునకువచ్చుటే యనర్థము. ఏమో, వచ్చి నిన్నుఁ జేపట్టుకుంచుమని కోసరితిని. నాసోత్కంఠ యెఱుంగక తిరస్కారభావముచేఁ బోకాల్మనుట న్యాయ్యమే? మనజీవితము క్షణభంగురమని యెఱుఁగవే? ఈయఃషణంబులు సతమే? నీవీవరివయ్యును నేనీసత్కార్యమునకై వచ్చితినని కొంచమైన గమనింపకపోయితివి.

శ్లో. అనిత్యాని శరీరాణి, విభవో నైవశాశ్వతః,
నిత్యం సన్నిహితో మృత్యుః, కర్తవ్యో ధర్మసంగ్రహః. అనునీతి
తెలియంగ కేల యుత్తరకుమారప్రజ్ఞలు వలికెదవు?

పురం—(స్వ) ఔరా, యితఁడు నిక్కముగ భిక్షాపాత్రుఁడు గాఁడు. ధ్యానమాపుత్రుఁడుగ నున్నాఁడు. సేవకునిమాటలే నిజము.

ప్ర—ఓ భూసురుఁడా, ఒడలెఱుఁగని సిగమేల? బిచ్చమునకువచ్చియు బిగువు దప్పవుగదా?

క. అద్దిర, గద్దఱి సుద్దులు
తద్దయుఁ బల్కుచును నీదు తాతపయిడి నా
యొద్దను బెట్టిన యట్టులు
గద్దించెద వీయనొక్క కాసైనఁ జుమీ. 10

అక్క—ఓయి, కాసునియ్యవా? ఆహా! నీజాతిలక్షణమే చూపితివి. బ్రాహ్మణిందక్క బ్రాహ్మణుని భిక్షమడుగుట మొదటనే తప్పు. అటులుండిననేమో, యోగ్యుఁడుగదా, యని వచ్చినందుకు నీ విట్లు సేసితివి. సరిసరి. ఇఁక మాటలు పెక్కేల? చూడు, నాయాచించునొడమిని నిడవేనినీకడఁ బ్రాణత్యాగము చేసికొనెద.

పురం—(స్వ) అయ్యారే, ఇతని వీరావేశము! ఈ కయ్యాలక్రచ్చతో నిఁక భాషించుట కంఠశోషయేగాని వేఱుగాదు.

క. తెలిదమ్మిఁ బోలి కనఁబడు
నలకలు తలనూఁతకోల యమరెఱ జేతఁ,
బలముడి వె న్నెయిచంచల
చలిత జలధరంబు భంగిఁ జలదరమొలసెన్. 11

ఇతనికింత పెత్తనమత్తినను నితఁడు బిచ్చమెత్తినను బింకముమాత్రము మానఁడు.

(ప్రకాశముగ) ఓబికాసి, నీ వ్యాజమంతయు నభివ్యక్తమయ్యె. ఇపుడు వృథా వాక్కలహమేల? నీవు పురస్కారమున కనర్హుఁడవుగాన వచ్చినబాటఁ బట్టిపోవుట యశస్కరము. తిరస్కారముగ నింకఁబల్కిన నీకు బహిష్కారమగునని మనస్కారముగఁ జెప్పెదను. నే నిందాకనోర్చితి నిఁక నిటనిలువక వేగఁజనిన శ్రేయస్కరము. లేనిచో నీపని నేఁడెటోపరిష్కారమగునని యెఱుఁగుము.

అక్క——(స్వ) అహో, వీనికఠినత! ఇతఁడు గడుపలునుగలవాఁడే.

తే. దగ్గఱించి నే నగ్గించి యగ్గలించి
నిగ్రహించియుఁ బగ్గించి నిగ్రహింపఁ
దుదను నెగ్గించి సెగ్గించి పదరిసంబ
ళియనె, నానిలువిట సంబళింప దౌర. 12

(నారదువాక్యంబుల స్సలంచి) హా, ఆపిశునుఁ డీపిశునుని బిసినియనినమాట పిసాళముగాదు. అట్లేగదా.

తే. నెలగనిమ్మన్న విద్ధాహి నెఱిగ మండె
ధనమదోన్మత్తులకు నేమి దయ, యొకైన
వీని వీడను. అతిలోభి మానవులకు
యాచకులు శాత్రవుల్గారె? యచలయందు. 13

(ప్రకాశముగ) ఓయి, నీబోఁటికిభూతదయాదాక్షిణ్యము లుండునే? కానీ, నీ వెచ్చోఁజొచ్చినను బెనుగాముపన్ని నిన్నువెన్నుదన్నక మానను. ఇఁక రాఁబోవునాఁటిడి, నెటుదప్పించుకొనెదవో, చూతము. ఒక్కటిమాత్రము నన్నాలిగొన కాలకింపుము. “అకాలో నాస్తి ధర్మస్య - జీవితే చంచలే సతి” అనున దెఱింగి మనుము.

పురం——ఓ మూర్ఖుఁడా, మూఁడుదినములుగడచిన వెన్కరమ్మనిన నింత తుచ్ఛదవేల? ఇఁకఁ జాలు. పో, పొమ్ము. (నిష్క్రమించును)

అక్క——ఔరా, వీని మూర్ఖత! విసుమానము. ఎన్నఁడుఁ దేమానములాగు వారి కొరుల సన్మానము దెలియునా?

చ. అరమర లేక నాగపరమాంగమణిక్ గ్రహియింపవచ్చు దు
స్తరదరవీచికాచలిత దారుణవార్ధిఁ దరింపవచ్చు ని
ర్భరధ్రువముఖ్యతారల విభాజకయుక్తి గణింపవచ్చు నా
లరులను సంతరింప వరలాంగలిశర్వులకౌనె ? మేదినిన్. 14

ఇస్సిరో, గ్రుడ్డివాని చేతియద్దమురీతి బధిరునిమ్రోల సంగీతముభాతి రోగికినిడిన మృష్టాన్నముమొగి నీలుబ్ధునకు బహుధా బోధించిననీతి వితావితయయ్యె. ఇఁక నీవెంబరవిత్తు చిత్తోత్కటము మెత్తఁబఱప భగీరథప్రయత్నంబు. అయ్యారివేరపుఁ దపసివాక్యము లసిఁబోవునే. చాల్చాలు. ఇఁక లక్ష్మీబాయిచాయకరిగెద. ఆమె మున్నె యుపకారికామణియని విఖ్యాతిఁ గాంచియున్నది.

(పెడమరలిచూచి) ఆ యిల్లాలదిగో, వచ్చుచున్నది.

ప్రవేశము : లక్ష్మీబాయి.

లక్ష్మీ—(అక్కభట్టుం గని) వందనము, భూసురోత్తమా. ఇదిగో, పీఠిక. అలంకరింపుఁడు.

అక్క—(ఆసనాసీనుఁడై) సాధ్వీతిలకమా, దీర్ఘాయుష్మతీభవ.

లక్ష్మీ—

తే. భూసురాగ్రణి, మా గృహంబునకు మీరు
రాఁగఁ దేరెభద్రమ్ము మీ రాకజోక
దెలియఁబల్కుఁడు, వేవేగఁ దీర్తుమీయ
భీష్టముల యథోచితముగ నెగ్గుగొనక. 15

అక్క— ఆనంద మానందము. సుశీలా, నే ననేకదేశములు సంచరించితిఁగాని నీవంటి పుణ్యాత్మ నెందుఁగానను. నీవిఖ్యాతి దిగంతవిశ్రుతమై ప్రకాశించుచుండుట గనఁగట్టరుదుగ నున్నది.

తే. పుడుకుఁజెలి దధీచిస్థాన భూత యగుచు
నీఁక వేలుపుటావుచే వృద్ధిఁబొంది
కర్ణుదరివాల్కములఁ గట్టి కడకునిన్నె
సంభరించె సుగుణపేటి సచ్చిరంటి. 16

ఆహా, ఇటుగదా, స్త్రీరత్నము లుండవలె.

ఉ. సూరుఁ డవార్యతాపమున, సూరుఁడు హేతి, సరోవరంబు స
త్సారసరాజి, సారసము షట్పదరాజముచే, సముల్లస
ద్వారణ మాత్మఘర్మమున, భవ్యసమజ్యబుధాళి, సామి సా
మీరిని మీఱు తేజున, సమేయశుచి స్సతి ప్రజ్వరిల్లెడున్. 17

కీర్తికలాపినీ, ఇఁక నేవచ్చిన కర్జమాలింపుము.

ఆ. నాసుతావివాహ మాసన్న మగుడునే
తెంచి నీదువిభుని మంచుమంచు
వేడఁజూడడ నను వెఱఁగు, వేతేఁడిఁగోర
నడవివాచరంబు వడువుగాదె ? 18

లక్ష్మి—(వ్యాకులచిత్తయై) భూసురాగ్రణి, నాప్రాణనాథుని, దయాసాంద్రుఁడనియుం జితేంద్రియుఁడనియుం నెఱుంగక మీరిటులఁ దిరస్కరింపఁదగునే ? అతిథులనేఁ బురస్కరించిన వారు సత్కరించినటులే గదా ? మీయట్టి పండితోత్తములు బందులేక శాంతించి పరిశీలింపవలయునేగాక తొరపడి తెగడఁ దగునా ?

అక్క—నిశ్చయమే, నేనతని బాగుగా శీలించితి. నాకుఁగూడ నతఁడు ప్రాణనాథునివలెఁ గాన్పించెడు. విను, మెవ్వరినేని "స్థాలీపులాకన్యాయము" చేఁ గన్గొననగు. కుండెఁడన్నములో నొకమెదుకుఁ బట్టిచూచినం దెలియదా ? అదేమో, యతనిపేరెత్తిన నా కేరెత్తుచున్నది. నేఁడు భవద్వరుండు కావరుండై మదీయేప్సితము కుండలీకరణ మొనర్చినందునఁగాదే, వాని నాక్రోశించి మిమ్మాశ్రయించితి. మీబోఁటి సభర్తృకావతంసలు భర్తలతప్పుల నొప్పులుగఁ జేసి సన్మానింపఁదలఁచుటయే గాక, యాగంతువులకు సహితము హితమొనరింతురు.

తే. మేటిసంతసమాయె నీ మాట నాకుఁ
గోటివరహాలమూట యీ పాటి తృణము
నెంతు మేరువుపాట వేయేల? యోవ
ధూటి, నీబోఁటి బోటి నే వీటఁగనను. 19

లక్ష్మి—(వ్యాలోలహృదయయై, తనలో) కట్టా, ఏమి దురదృష్టము ! ఈజన్నిగట్టుఁ దలకట్టు నిజసుతావివాహార్థమై రాఁగవలయుం సాహాయ్యము సేయ నోఁచనైతిని. నే నర్థపతినయ్యుఁ బాణియందొకపిరర్థమైనను లేబరమయ్యె. పెద్దలనుకొను

"చేతఁ గాసులేని సాతిమనుపీనుఁగుభాతి" యనునీతివితథమగునా ? (పర్యాలోచించి) అయిన గానిమ్ము. నేఁడీ భూసురునకు మదీయనాసికాభూషణ మిచ్చి పుచ్చెద. (అని ముంగర దీయుచున్నది.)

అక్క—(స్వ) బళా రే, ఈమెచిత్తవృత్తి. ఈమెను సుగుణగ్రామమని వేఱే చెప్పనేల. మున్నే యీమెవృత్తాంతము దెలిసి యున్నదిగాన నిపు డిదొక యతిశయోక్తిగాదు.

(ప్రకాశముగ) వరవర్ణినీ,

చ. నరపతి కెంతమూఁడిన మనంబున నిం బనువొంద, దాన దీ
వరునకు నెన్ని వాఁగు లెగఁ । బాఱిన మోళి యొకింత లేదు, భూ
సురులును దాదృశాశయులె, । పోదెము గా దిది, కాసులేమినిం
దిరిసితిఁ గొంత విత్త మిడి । ధీమతి, యిత్తఱిఁ గీర్తిగాంచుమీ. 20

లక్ష్మి—స్వామి, సంతసము. ఇదిగో, ముక్కఱ. ఇదిదక్క నాయొద్ద నొండొందదు. కావున దీని నిచ్చగించి చంద్రున కొకనూల్పోఁగను సూటిఁబాటించి ప్రాప్త మానసు లగుఁడు.

అక్క—(ముక్కఱ బరిగ్రహించి సానందుఁడై) శ్రీమతీ, ఆశకు మేరగలదే! "ఆశావధిం కో గత" యనునది వినమే ?

ఆ. ఆశచే తుఁయింప । రే శశాంకుఁడు వాలి
రావణుండు బలియు । రాజరాజు
ఆస దోసి యగుచు । నాశలఁ గబళింప
మానవు లన నెంత । దాని చెంత. 21

అయిన నాకిదియే పదివేలు. ప్రాత్తోషమయ్యె. ఇఁక సెలవుఁగొనెద.

లక్ష్మి—మీ చిత్తము.

అక్క—(రెండడుగులువని, తనలో) ఈనాసాభూషను నాపురందరునియొద్దనే తాకట్టుంచి నూఱువరా లడిగెద. ఆ పంచజనుని వంచుట కిదే చందగుచుండు. (నగుచు) ఆ కనకవల్లినే, నే వంచించితినఁట. ఇఁక నతనినడకించుట యొక మందా ? కాదు. తృణప్రాయము. అహా, య్యాయాంబాసమే యిందు కుపాదానమయ్యె. సరిసరి. చనెద. (నిష్క్రమించును.)

# తృతీయాంకము.

## స్థలము. III. మంత్రిమాడుగు.

---

### కనకవల్లి ప్రవేశించును.

కన—(స్వ) అక్కటా! ఎంత యప్రతిష్ఠ! విప్రునిచే వృథాగా విప్రలబ్ధనైతిని. తల్లియన్ననో, ధనాకర్షణాకాంక్షయేగాని తజ్జాతప్రమాదపరిహారమునకై ప్రయత్నింపదు. ఎవ్వరినినమ్మినను బ్రయోజనము లేదు. ఇఁక మాటలు పెక్కేల. మంత్రివరులు కరుణాకరులుగాన వారి కీవలయ మొసంగి వారి రూపురూపున నున్నరూపుఁదెలిపి నేనీ యభిశాపమెడఁబాపికొనెద. అందనుక నాయెద యందలి యెదమానదు. (తిరిగి చూచి) ఇదే, ప్రధానుఁడుగారు. లట్వావ్యాపారితో నేమో సంభాషించుచున్నారు (ప్రకాశముగ) మంత్రిశేఖరా, వెన్నెలకోలు. ఇందండి, కడియము. (అని యిచ్చును.)

మంత్రి—(కైకొని, సాద్భుతముగ, స్వ.) ఆహా! ఇది స్వామిదియే. (ప్రకాశముగ) అజ్జుకా, దీని నెటు లధిగమించితివి ?

కన—స్వామి, మన్నింపవలయు. మనఃపూర్వకముగ విజ్ఞాపించెద.

క. కరకరిఁ బురందరుండా
  కరివేలుపు భూష నాదుకరమున నిడ ను
  క్కిరిబిక్కిరి మది యయ్యె
  న్నరభూషణమొ కరతలాని కఱితకుఁ గరియా. 22

ఈవలయము వలదని తిరస్కరించినను నాపురందరుం డనుబాఁపం డొకకేయి ననుడాసి కనుమూసి తెనుదీసె.

మంత్రి—(స్వ) ఔరా, దీని చమత్కారము,
"స్త్రీయంత్రంకేన సృష్టం విషమమృతమయం ప్రాణిలోకస్య పాశః" అను భర్తృహరి స్వానుభవమునకు సరిదాఁకినది గాదే. (ప్రకాశముగ) ఇది కేవలాశ్చర్యము. ఔనే, అకేయి త్వదేకాభిలాషియై యతఁడు చోరఁబాఱునప్పు డాలోకించిన వారెవరైనఁ గలిగియుందురా!

కన—అవును. సాకిరివలయుఁ నెడ నిపుడే యేలికతో మాటాడుచుండిన భక్ష్యంకారుఁ డొకఁ డున్నాఁడు. అతఁడు దక్క మఱియొక్క సాక్షి నాకు లేఁడు.

మంత్రి—(భటునితో) ఓయి, భక్ష్యమ్ము లమ్మువాఁ డిప్పుడే చనుచున్నాఁడు. తీవ రముగఁ బిలుచుకొని రమ్ము. (సానితో) ఏమె, ఇది కైతవముగ నున్నది. నీవేదో యొక తెఱంగున రహస్యము దాఁగురింపఁగోరి యిటు దాఁగురించి బొంకెదవు గాని యథార్థముగ మదనార్తుఁడై పురందరుం డిట్టియుంస్మార్గమునకుఁ బోవునే?

క. వినమే, మానికదారులు
ఘనమాయా శీల లనఁగఁ గైలాటములే
మననగు, మనిన మహీలత
లను దాల్పినబడిశపాళికలకు నెనగారే? 23

అయిన నీవు కలతెఱంగు తెరల్చినను భూపనిచ్చినందున నిన్నాసింపక నీకు లభించు పారితోషికము వెన్కఁబెట్టితిమి. నీ వేగుము. (లేఖకునితో) లేకరీ ఈసంగతి ముఖ్యముగా లేఖ్యముగాన నీవిషయమై భూపతి కొకలేఖ లిఖంపు.

లేఖ—అట్లే.

## ప్రవేశము : లట్వవ్యాపారి.

లట్వ—దేవర, కేకిసలు మీకు (అని దండముఁ బెట్టును).

మంత్రి—ఓయివ్యాపారి, కనకవల్లి యనుసాని నిన్నొకసాక్షిగఁ గోరినదెఱుఁగుదువా?

లట్వ—ఎఱుఁగను.

మంత్రి—సరిగాని, పురందరుఁ డనుబ్రాహ్మణు నెన్నఁడేని వాడవది నెలవాడయందుఁ గంటివే?

లట్వ—(ఆలోచించి) అవును. ఒకానొకమునిచీఁకటియందు జాడగాఁగంటిని.

మంత్రి—అతరుణియిరువు నీ కెఱుకయే?

లట్వ—ఆ, తెలియును. నాయింటిముందే యామెగీము.

మంత్రి—వారివాదము నీకుఁ దెలియునా?

లట్వ—అదంతయుఁ దెలియదుగాని యందులో మూఁడునాల్గు దబ్బులేదబ్బెద.

మంత్రి—దబ్బులనఁగా?

లట్వ—మాటలు.

మంత్రి—ఓహో, ఆవేవి నుడువు?

లట్వ—అయ్యగారు, ఒకరాత్రి కనకవల్లియింటఁ గొన్నిమాఁకలు వినఁబడె. అవి యే మని యనుకొనుచుండఁ బురందరుని గొంతుమాదిరి గొంతుకవినిచె. ఆవల సానియుఁ సానితల్లియు నేమోమో గుసగుసలు వోవుచుండిరి. అవి తుదకు వైశ్యగహాస్యములేని విశదమయ్యే యుండును. అటువెనుక గాలిసందడితప్ప మఱియేసందడియుఁ జిక్కదు. ఇదే సమాచారము. ఈనాదబ్బులు డబ్బులు గావు.

మంత్రి—మంచిది. పురందరుఁ డంటివే, యతని నీ వెఱుఁగుదువే!

లట్వ—అవును. ఆతనిసంగతి నే బాగుగా నెఱుఁగుదు. ఆతగాఁడు చాలా డబ్బుగల వాఁడు ననేకుల కప్పిచ్చువాఁడు నాఁకొనువారి యాఁకలిఁ దీర్చువాఁడును.

మంత్రి—(స్వ) పురందరుఁ డసాధువని యాకర్ణనమైయున్న నితఁ డేలొకో యిటు పొగడుచున్నాఁడు. (యోచించి) అవునవును. దీనికిఁ గారణము కేవలధన పిశాచీమహిమయే. వినమే, యొకశ్లోకరత్నమును:—

" యస్యాస్తి విత్తం సనరఃకులీనః
సపండితః సశ్రుతిమాన్ గుణజ్ఞః,
సఏవ వక్తా సచదర్శనీయః
సర్వేగుణాః కాంచనమాశ్రయంతే."

ప్ర—సరిగాని, ఆపెకు నీకు నేసందర్భమునసైనఁ బోరామిగలదా? చూడు, నీనాలుకనుండి న్యాయ్యమ్మ రానిమ్ము, లేనిచోఁ బోరామికిలోనై నీతల నొసంగవలసివచ్చును.

లట్వ—అటులెన్నఁడు దలఁపకుఁడు.

మంత్రి—ఇదిగో, దీని నీవెప్పుడైనఁ జూచియుందువే? (కడియమును జూపించును.)

లట్వ—లేదు.

మంత్రి—ఇఁకఁ బొమ్ము. (వ్యాపారి నిష్క్రమించును.)

ఇతఁడుచెప్పినది కోమటిసాక్ష్యమునకన్నఁ గడుమోసముగ నున్నది. దీనినెటు పాటింపవచ్చును.

(లిపి కరునిజూచి) లేఖకుఁడా, ఏమివ్రాసితివో, యధిగమింపు?

లేఖ—(జాబు చదువును.)

సీ. రాజశిఖామణి, రాత్రి పురందరుం
డచలధారివిభూష నపహరించి
యుంచువిల్తునిబారి నింట్రపడి, తనదు
చేతి కిం దమని సంప్రీతినిచ్చి
దిచ్చు మొగంబయ్యెఁ దచ్చన గా దని
వేలుపు బానిస విన్నవించె,
అంతకుండైనఁ బాకారియైననిధన
ఖ్యాతుఁ డైనను ధనోపేతుఁ డైన
తే. రిష్టదుర్భరకార్యసరిద్విమగ్న
మానసుం డైనవానినిపీనుఁ డంచు
దండనవిధింపుఁ డాభీల దండనియతి
దండమే గద తస్కర దండనూఁహ. 24

ఇట్లు వినయపూర్వకముగ విశదీకరించు ప్రియసచివుఁడు....

మంత్రి—(విని సంతసించి) బలే, బలే. కరవాలంబులేకయే ఖలవారప్రాణంబులఁ గాకలమువలనఁ గలమువలన న్వలనుగఁ దీయవచ్చుఁగాదే? సరి, దీని నిపుడే జేనికనుపుము. వెండియు నీ నిమేషముననే యపహర్తలఁబట్టి శాసింప భటుల శాసింపవలయు. ఈభూష వ్యంజితమైనందు కానందముగాని తస్కరులఁ గను పెట్టవలయుఁగదా? (భటులతో)

ఉ. పట్టుడు పాండురంగ వరబాహుసుభూషణహారి నీరసుఁ
గట్టుఁడు తత్కరంబు లొగి నారమహో, యిన హర్తలోడఁగఁ
నెట్టుఁడు బంది దుర్మతులు నేరముల న్వెడనాడునట్టు లా
కట్టెఁడి నెట్టులైన సరి కట్టుచుఁ దీర్పరి కప్పగింపుఁడీ. 25

ఇదిగో, దుర్విధులశిక్షించుటకై శాసనము. కొనిపొండు. పురందరుం డొక వేళఁ బట్టుపడిన వాని మాతావునకుఁ దోడితెండు. (అందఱు నిష్క్రమింతురు)

---

# తురీయాంకము.

## స్థలము IV. పురందరువర్తకశాల.

ప్ర: అక్కుభట్టు - పురందరుఁడు.

అక్కు——(పురందరునితో) భూసురవర, ఇదిగో, ఇన్నూఱువరాలవెలగల హారిన్మణిఖచితహిరణ్మయనాసికాభూషణము. దీని సీడు క్రిందనుంచుకొని నూఱువరహాలిండు.

పురం——ఏదీ, ఇమ్ము. (ముంగరనందుకొని పరిశోధించి, తనలో) ఓహో, ఇది మామకీనము. ఇట్టిదాయకమునకుం దగునా! (బ్రాహ్మణుని సెగాదిగఁ జూచి) ఇతఁడు మున్ను దుర్దశయుతుండైనకతన ధనార్థియై వచ్చియుండెను. అప్పుడిది కానఁబడదు. నేఁ డిట్టిది వీని కెక్కడిది. ఏమిచిత్రము.

(ప్రకాశముగ) పాఱుఁడా,

ఉ. సారెకు దీనిఁ గన్గొన విచారము తేరెను, నిన్నుఁ జూడఁగాఁ
జోరుఁ డనంగరాదు, కడుచోద్యము, సాధ్యముగాని ముంగరన్
ధీర, యెఱుంగఁబల్కు మెటు తెచ్చితి, రోయికి నిచ్చినట్టివా
రేరు? భవన్మనోహితము నిత్తఱిఁ దీర్చెద నిది వెలార్చినన్. 26

అక్కు——(స్వ) అహో, ఇతఁ డీతొడవుఁ గనుఁగొని స్వకీయమనుకొని నిజాంగన యందుఁ గాతాళముగనున్నట్టు చూపట్టెడు. కావునఁ దదభిధేయమిపుడు ప్రస్తావింపఁదగదు. (అని మౌనముగనుండును)

పురం——జన్నిగట్టా, నీవిట్టేల దొంగకు న్దేలుకుట్టినయట్లు నిట్టక నిలిచియున్నావు? సంవాదగీతము.

పురం—— దీని నెవ్వ రొసంగిరో? తేటపఱుపు.

అక్కు——ఎవ్వ రొసఁగిన నీకేల?

పురం—— ఎఱుఁగఁ బల్కు

మైన;

అక్కు—— విను మొక యధికభాగ్యవతి సాధ్వి

యిచ్చె.

పురం—— ఆనారి పేరేమి?

అక్కు—— ఏమొ, సామి. 27

పురం—(స్వ) అజ్ఞారే, ఇతఁడు మస్కరిగాని తస్కరుఁడు గాఁడు. ఇతనికొసఁగిన్న వారిపేరు స్మేరుకొనఁడు. ఈముక్కర స్వకముగానిచో నిట్లమూల్యరత్నస్థగితమై వెలలేనికడానిచేఁ గడలుకొని పొడవడుటేల. దీనియొళవు విచార్యము. (ప్రకాశముగ) వృద్ధుఁడా, భిక్షుకుని కిది లభించుట వింతగ నున్నది. అయిన నేను నాస్థలమునకుఁ జని నీచిత్తానుసారము విత్తము మొత్తముగఁ దెత్తును. అందాఁక నీవిచ్చో నుండుము. (అని రెండడుగులునని, తనలో) ఆ, ఆఁడు వారిసాహసము! వారల విశ్వసింపఁ దగునా! పడఁతులబుద్ధులు పెడతలల నంటు నండ్రుగదా. నిజము.

ఆ. ఒకఁడు పత్నిబారి కోర్వలేక శిరంబుఁ
జేర్చె, నొండునోటఁ జేర్చె, నొకొఁడు
చిక్కి యక్కునందు గ్రక్కునఁ దాల్చె, హా!
స్త్రీల నబల లనఁగఁ జెనఁటితనము. 28

(ఆందోళితస్వాంతుఁడై) హా, వారు నిక్కముగఁ బ్రబలలుగాని యబలలు గారు. అయిన నిపుడోరుల నిష్మైయినన నేమిఫలము? మనదిమనము సవరించుకొన్నఁ జాలు.

ఆ. పడఁతియార్యయేని పతిమాట జవదాఁటి
ముక్కుఅనె టొసంగె నుక్కివునకుఁ
దానొసంగకున్న దౌర్భాగ్యుఁ డిటమున్ను
దీనిఁజూప కట్టు తిరిసెనేల? 29

నాకు మఱుపఱచి యింతచేసిన దీఁక నెంతసేయదు! ఛీ, ఛీ, దానిమోము గన వచ్చునా.

శ్లో. "వివాదశీలాం స్వయమర్థచోరిణీ
మగ్రాశినీమన్య గృహప్రవేశినీం
పరానుకూలాం పరిహాసభాషిణీం
త్యజంతిభార్యాం దశపుత్రమాతరం."

అనునది విన మే? ఇట్టిది పరిహార్యమే. అవ్వలఁతి కెట్టివలదు వచ్చినదోగాని వలదనినను నేదో యొకదంభమున మెల్లమెల్లమెల్లముగఁ గొల్లాడుచున్నది. అప్రాజా గీజా నేఁటితో సరి. కానీ, యాతత్క్షణమే యింటికేగెద.

(నిష్క్రమించును.)

## తు రీ యాం క ము.



### స్థలము V. తోళసికోట.

లక్ష్మి—(కరములు మోడ్చి)

తే. క్షీరసాగరకన్య, నా చిత్తపీఠి
 నుంచి నిన్నెంతు సర్వస్వమంచు నీవ.
 కన్నడింపక గన్నులఅలన్ని దీర్చి
 కావవే? కల్పవల్లిన న్గన్నతల్లి. 30

(సవ్యేక్షణచలనసూచనఁ గని, విభ్రాంతితో) ఏల, నాయెడ కన్నదరుచున్నది! అరిష్టచిహ్నము గాఁబోలు. (ఆలోచించి) ఏమైననేమి? సుఖదుఃఖమునకు శ్రీహరియే గలఁడు. ఓపాండురంగ, నా మొఱయాలించి నన్నాలింపుము.

ప్రవేశము : పురందరుఁడు.

పురం—(రోషరోహితలోచనుఁడై భార్య నెగదిగఁ జూచి) ఓసి దుష్టురాలా, నీవాలా, వింతరాలుగాక. నీ తత్వమిపుడు స్ఫుటమయ్యె.

పంచచామరము:—

 స్థిరన్ సతీమణుల్ సతిన్ సతీపతిన్ శచీపతిన్
 హరిప్రియన్ హరిప్రియ న్వరార్కునిన్ భజించి స
 ద్వరుం డెఱుంగఁజేయ దుర్వ్యథావిధిన్ వ్యయంబు గే
 స్తురాంద్ర నేఁత లిట్లొకింత - చూడ నెన్నఁడున్ బళా! 31

సుగంధివృత్తము:—

 ఈవె, యీవె, ముంగర న్గథింపకన్యమున్ బరీ
 భావమంటె నేఁడు నీ స్వభావమెల్ల దేటె మా
 భావినీ ప్రపత్తిపాడు వాఱ వారకెన్నెతిన్
 దీవరించి సేయు,నే పతివ్రత, ప్రగల్భతన్. 32

లక్ష్మి—(చింతాక్రాంతయై తత్తఱిల్లి సువర్ణప్రతిమపోల్కి నిట్టనిలుచుండును.)

పురం—(సాగ్రహముగ) ఏమే, ప్రాన్పడియున్నావు? నీనత్తేది?

లక్ష్మి—(స్వ) హరిహరి, ఎన్నఁడులేదే? వీరి కింతయాగ్రహము. కయ్యమునకుఁ గాల్ద్రవ్వుచున్నారు. దైవమా, ఏమిసేయుదు. (మఱల లక్ష్మి స్వలంచుచు) ఓ యార్తులపట్టా, భక్తులమెచ్చి యిచ్చలనిచ్చు మెచ్చులచెట్టా, యీ మొఱఁ గేల? మొఱయాలించి నాతలఁకుతొలఁపవే. నీవు భక్తవత్సలవనియు, సంతాపహారిణివనియు, నిన్నే నమ్మితిఁగాదే. (కొంతధైర్యమూని పలికినమించుచు, ప్రకాశముగ)స్వామి, కొంచము శాంతింపుఁడు.

పురం—పిసాళి, ఆలస్యమేల, కానిపించెదవా, లేదా? ముక్కఱ. ఇఁకఁ బల్కినఁ జూడు, నేఁడు నాహస్తకండూయవాయనీకాయము నేమిసేయుదునో?

లక్ష్మి—(భయవ్యస్తచిత్తయై) అయయో, ఆర్తశరణ్యా, తాళిట కసాధ్యమయ్యె. వీరిగొడగొడను గొరగొరగ మాన్పుము. వేయేల, నేఁడు నీవుదక్క నాగోడు దీర్పువా రెవరు లేరు.

తే. భువనములతేఁడ, భక్తులఁ బ్రోచుప్రోడ,
దుర్జనులసూడ, ద్రోవది తోడునీడ,
కీర్తనీయుఁడ, జగముల కీలుకాఁడ,
కేలుమోడ్చెద నన్గావు కృష్ణతోడ. 33

మత్తేభము (నిరోష్ఠ్యము):—
కరి నక్రూర దశాననానుజుల నాకాంతుఁ శిలఁ సూర్యజుఁ
ధరనీయార్తులనెల్లఁ గాచినదదెంత స్గల్లగాదేని సా
దరలీలన్నను నేలు లేనియెడ నిన్దన్ జెందఁగా నేల, శ్రీ
ధర, యేతత్కథలానతిచ్చునల గ్రంథస్థోక్తులెల్లఁ సటల్. 34

(అని హరిని స్తుతించుచుఁ దులసీహారివాణమునఁ గరంబిడి సంతోషలహరిఁ దేలి భర్తతో) నాథా,

క. ఇదిగో, కైకొను ముక్కర
సదసదయై తాతె మది విషణ్ణత నీక నా
ముదముదలు తేత్తె, మీకు
న్మదిమది, హరి యాళువారి మఱచునె? తెలిపిఁ. 35

(అని ముంగర నిచ్చుచున్నది.)

పురం—(కయిశాని పరిశోధించి తనలో) మాయయు రే?

ఉ. కంటి, నిరూఢదృష్టి సురకాండ పయోధి విభాకరాబ్జులన్
గంటిఁ ద్రిమూర్తులం ద్రిదివ గవ్యగళత్క్ర సమస్తజన్ములన్
గంటిని మున్ను కృష్ణముఖ గహ్వరజాత చరాచరాళిఁ గ
న్గంట యశోద గాంచినటు, కామిని మాయయొ, నాకు మాయవో! 36

(ఇంచుక విహ్వలించి) హా! ఇది యమానుష్యము. కానిచో నీవింతయంతయు నణిమిషములోనే బయలు మెఱసి మరల బయలగునే. (కొందుభూషలు సంప్రతించి) పౌరా, కొంచమైన భేదములేక సరితూఁగుచున్నవి. ఇంతకంటె నచ్చెరువేది. ఆహా, భగవల్లీల నెఱుఁగుట కెవ్వరికశక్యము. మఱియుం నీకృతమధ్యసంగతి దెలియక వృథా కష్టపఱచితిని.

(ప్రకాశముగ భార్యతో)

ఉ. చాన, నిబద్ధిలింపు మది చంచలమయ్యె సుభూషఁ గాంచఁగా
మానుగ సర్వదేవతలు మాపలి మాపతి తోఁచె శౌరి స
ష్మానముఁ గంటివె ట్లహహా! మానిని మానముఁ గాచినట్టి భూ
జానిపదంబుఫుల్లతమ సారసలోచన, యెట్టుగ ల్గెదున్. 37

లక్ష్మి—(స్వ) శ్రీ పుండరీకవరదా, దుర్నివారమగు మదీయకష్టము నివారించిన దేగాక మద్భర్తృదురవస్థను సహితము నివర్తించి వారిచెట్టకేని దారికిఁ దెచ్చితివి. సర్వేశ్వరుఁడవు, భక్తవత్సలుఁడ, వైన నీకుఁ బ్రత్యుపకార మేమి సేయఁగలదాన. వందనసహస్రముమాత్ర మొనరించెద.

(ప్రకాశముగ) ఆర్యపుత్రా, శ్రీహరి మాయాకారుఁడైనను భక్తసులభుఁడు. అయిన దన్మహిమ దెలియుట దుర్లభము.

క. భరమగు హరినామము భీ
కరమగు నరివర్గమునకుఁ గాలుని బలె, శ్రీ
కరమగు భక్తులకు, మనో
హరమగు నబలలకుఁ, గాన నలవిరో! నుడువన్. 38

నాథా, అట్టిపరమేశ్వరుఁడు పంతగించి భూసురునిపంతంబున మనమనంబుఁ గనన్ గనంబడె. అది మీ రెఱుంగరు. మన మీ తుచ్ఛసంసారాంబుధి నోల లాడుచుండిన నికనైన దానియందుఁ దగులము లేక యుండవలయు.

ఆ. వారి చెదలు గ్రచ్ఛపంకి హిమము పంక
మరయవరుసఁ దమ్మి నగ్ని శిఖను
బడటిని యమకీట భాస్కరులను భక్త
వరుల నంటవయ్య వరగుణాఢ్య. 39

ఇట్లువర్తిల్లుచు సర్వదా శ్రీహరిపాదకమలములనే సేవించుచుండవలయు. వినరే?

శ్లో. సంసారే కింసారం, కంసారేశ్చరణకమలపరిభజనమ్,
జ్యోతిః కిమంధకారే, యదంధకారే రనుస్మరణమ్.

మఱియు,

తే. భవమె జనులకుఁజేయు సంబంధ మిలను
నదియుఁ బాసిన సంబంధ మవియు నెవరి
కెవ్వ రిది మాయ సుమి, దీని సవ్వడిఁగను
నరులు పరిపక్వలంచి తానందయుతులు. 40

మనయాయువు బుద్బుదప్రాయికంబు. సంపద యస్థిరంబు. ఇవి గళభుక్తకపిత్థంబు డంబునఁ బోవునపుడా మువ్వఁజెప్ప నలవిగాదు.

తే. ధనము తమిగూర్పు టద్దాని దాఁచుటయును
మఱియు నాశవ్యయములందు మానవులకుఁ
దనుకు తనుకులు తనువులె! తనువుశౌరి
పాదకమలస్మరణవిరవారఁ బడయు ముక్తి. 41

కావున నీయిషణంబులయందలి యాసక్తినిరసించి దైవభక్తియే ప్రాధాన్యమని తలంచి జ్ఞానమునకు సోపానములగు సన్మార్గంబును సత్సంగత్వంబు నవలంబించుచుఁ బురుషార్థమునకుఁ బ్రాణి యత్నింపవలయు. ఈయన్నిటికి జ్ఞానమే కారణము. ఇది కలుగనిచో నెన్నిజన్మములెత్తి యెంతెంత యవిధిఁ బడినను జీవాత్మ పరమాత్మలోఁ జేరనిహేతువుచే నరుండు సదానందకరమగు ముక్తిఁ బడయనేరఁడు. ఈవికలకలియుగమున భక్తిదప్ప యాగయోగతపశ్చరణాదులసాధ్యములు.

పుర—(ఆలకించి పరమానందభరితుఁడై) నాభాగ్యదేవత, భవదుపదేశోపబలసంయోగమునను శ్రీహరి కథాసుధారసపానవిశేషమునను నే విషయేచ్ఛారహితుండనైతి. "సర్వంమిథ్యా" యనులోకోక్తి నీచేత నేఁడెఱింగితిఁ గావున నేఁ బరిత్యక్తసర్వసంగినై పాండురంగనిసంగడి కేగెద. ఈయోగాములవలని ఫలమెద్దియుఁ గానంబడదు.

(దండితో)దండీ, రమ్ము. అచ్యుతునకొకకిరీట మచ్చుపాటు సేయింపవలయును.

లక్ష్మి—నాథా, తాము మఱియుం గొన్నినీతుల మనయుపదేష్టవలన వినవలయు. వేఱొకవిన్నప మున్నది.

పురం—ఏమది?

లక్ష్మి—నామనవి నూరీకరించి పుత్రికాపరిణయముగావించి పరితోషించి వెలువరించిన లెస్సయని సన్నుతించెదను. ఆకాసంతసంతరించి ప్రవాసంబు సంతసంబునఁ జేయందగు.

పురం—(యోచించి, చిన్నటినగవుతో) ప్రాజ్ఞే, ఈనీయుపాయము శ్లాఘ్యము. నే రంగనాథునిదర్శించి యజియించుటకు వలయుపూజాద్రవ్యముల సమర్పించి మగుడ నేతెంచెద. ఇంతలో నీవు గురువర్యుఁజేరి వైవాహికపర్యాలోచనము సేయుచుండుము. వెండియు వియ్యపువారిదిరాజార్హపద్ధతిగాన నందుకుఁదగి నట్టు లంతయు సంతరింపవలయు.

(దండితో) రమ్ము. పోదము. (నిష్క్రమింతురు)

లక్ష్మి—గురునాథుఁడు కార్యానుకూలమాయె నని నుడివి సనెఁగాని యాఘుఁడంత మంతయు విస్పష్టముగఁ జెప్పఁడయ్యె.

(దామోదరునితో) దామోదర, మనపురోధ కోలాపురినుండి విచ్చేసె. వారిని దోడితెమ్ము. చట్టనఁ బొమ్ము.

దామో—మహాప్రసాదము. (అని చౌహజ్జలిడి గురుస్థాంచి మరలి)ఆహా! అమ్మగారు, తమమనం బెంతనిర్మలము!

క. గురునాథురాక వగవఁగ
గురుమనమున నట్టితమియె గుడికొనుచు న్వే
గరియయ్యెక, భవదంతః
కరణప్రతిపత్తికింకఁ గరియేల, నహా! 42

తల్లీ, అడఁబోయిన తీర్థమెదురయ్యెననుసూటిగ మాటలోనే పురోహితుఁడు గారు వచ్చుచున్నారు.

ప్ర: పురోహితుఁడు.

లక్ష్మి—(సహర్షయై) దామోదర, పీఠికొకయాసనము సమర్పింపుము. స్వామీ, వంద నము. దయచేయుఁడు. తమనిధ్యాన మెప్పుడెప్పుడో, యని త్వరపడు చుంటిని.

పురో—సౌభాగ్యవతి, సుఖీభవ. మనోవాంఛా ఫలసిద్ధిరస్తు.

లక్ష్మి—అయ్యా, మీబోఁటిసంకల్పసిద్ధులు కార్యభారైకధుర్యులుగనుంటకతన సర్వదా సిద్ధమనోరథలమే. స్వామీ, అచ్చటిచిటులెటులు? సరస్వతిబాయి మనోనియతియేయమరిక? తద్భర్తగా రెట్టిభంగి ప్రస్తావించుచున్నారు? వారికీ నీకూరిమియస్తుకారమా, కారమా.

పురో—అటులేమియుం లేదు. అంగీకారమే. వియ్యంకులసంతసమున కంతములేదు. బంధుమిత్రులత్యానందాబ్ధిమగ్నులై శుభకార్యసందర్శనకుతూహాలులై యున్నారు. వారిరాకవేఁ బోకగాన మనము సిద్ధముగనుండవలయును.

లక్ష్మి—స్వామీ, అసంభావ్యతకలుగమికిఁ బాలసంతసముగాని ముహూర్తము సిద్ధాంతీకరింపఁబడెనా!

పురో—అవును. అప్పుడే రాద్ధాంతమయ్యె.

లక్ష్మి—అదెట్లు?

పురో—మనవిచేసెద, వినుండు.

"స్వస్తిశ్రీ ప్రభవసంవత్సరే జ్యేష్ఠశుద్ధపంచమీగురువాసరే పునర్వసునక్షత్రే సూర్యాస్తమయాది వింశతిఘటికోత్తరే తత్కాలమీనలగ్నే చంద్రతారా బలసంయుక్తే వధూవరయోః పాణిగ్రహణమహోత్సవః శ్రేయోనిధిః." అమ్మా, ఈలగ్న మతిప్రక్లృప్తమై శుభగ్రహదృష్టమైయున్నదని మఱికొందఱు సాంవత్సరులు సైతము స్థిరపఱచిరి.

లక్ష్మి—ఈబాగు బాగుగానున్నది. స్వామి, ఒకశుభలేఖను సరస్వతిబాయికంపుచు బంధువులెల్లరకుఁ దలాయొకటి పంపుఁడు.

పురో—అలాగే. (నిష్క్రమించును)

లక్ష్మి—ఈలగ్నము దుష్టగ్రహవర్జితమై చంద్రతారాబలసంయుక్తమగుటం జేసి పుత్రికి మంచియోగమే. ఆమె నిస్సంశయముగ శ్రీమంతురాలు కాఁగలదు. (ఆలోచించి) అయిన నిటువలుకుట వలనుగాదు. ఏలయనఁగఁ బిఁటలమీఁది పెండ్లియుఁ గొన్నితరుణముల విఘాతమైపోవుట గలదు. ఏమైన నేమి నేయఁగలము. అన్నింటికిసర్వేశ్వరునిదే భారము. (నిష్క్రమించును)



## పంచమాంకము.

### స్థలము. I. పాండురంగని దేవాలయము.



పురందరుఁడు : పరిచారకుఁడు.

పురం—హా! ఈ దేవళపుటందము. అనిర్వచనీయము.

అక్కటా! నేనింతపర్యంతము వ్యర్థముగాఁ గాలముఁ గడపితినిగదా! నాజన్మమేమిజన్మము.(ఆలోచించి) అయినన్మన్నారీతిలకోపదిష్టసూక్తులచేతను మదీయపూర్వజన్మసుకృతవిశేషంబునను నాభవమిపుడు సార్థకతఁ గాంచె. (లోపలికిఁ జని స్వామినిదర్శించి పులకాంకితశరీరుఁడై మస్తన్యస్తహస్తాబ్జుం డగుచు స్తుతించును)

ఉ. అంగజజిత్సుసంగ హరిణాంకపతంగ విలోచనా దయా
పాంగ రసోత్తరంగ పరిపాలితతుంగ వరాంగభక్త మా
తంగ మనోబ్జభృంగ శఠదంభవిభంగ రమానుషంగ వే
దాంగనిషంగ లోకనివహాంగ పతంగతురంగపుంగవా. 1

పరిచారకుఁడా, శ్రీహరి సహస్రనామార్చనకు నుపకరించు నుపకరణప్రకరంబుల దురంబుగఁ దెచ్చి యీ దేవభూదేవుల కిమ్ము.

పరి—సామి, అప్పుడే సమర్పించితిని.

పురం—మేలైనకార్యముగాని పంచాణమువారు మకుటము చేసితెచ్చిరా?

పరి—దేవ, శిల్పులు కిరీటము సమాప్తమయ్యెనని సెప్పిరిగాని మీరు దయచేసినంగాని యది చక్కఁబడదు.

పురం—ఓహో, అటులా, నే వచ్చెద. (పాండురంగని మరలసేవించి)

తే. చారుకాయభావిజితకుమారమార
శత్రువరవధూహృదయ సంసారసార
సారముషితప్రతిభటసద్వార వార
ణప్రవర్ధనవరద్రవిణ ప్రసార. 2

క. అనఘ న్యాసకమునకుఁ
జనినీసకముఁ గ్రహించి సను దెంచెద, నో
ఘనహృద్వనరుహ మధుసూ
దన, మధుసూదన, నృశంస దానవదమనా. 3

శ్రీపతీ, నే నీపాలఁబడితి నీకు న్యాసోపమము స్వీకరించి రక్షించెదవని సముద్భాషించెద. పరిచరుఁడా, రమ్ము. బొమ్మ డీకమ్ము దెచ్చెదము. (నిష్క్రమింతురు.)



పంచమాంకము.

స్థలము II. రాజవీథి: భటులు.

(విష్కంభము - గ్రామ్యము)

1. భటుఁడు:—అరేభాయ్, దేఖో మే రేతడాఖా - సాదీముందుక్పోతాయ్. ఓబ డాచోరుక్పట్కపష్టాయ్.

2. భ:—అరే, కెంమియా, ఐసాగడ్ బడ్ చేష్టాయ్. సంజో - పురందర్ చోర్ నహీ, ఓతో బడామారాజ్ హై (చెవులుమూసికొని) తోబా, తోబా, ఏసవు కర్యాక్కాం నకోబా. హబ్బా, హబ్బా, దీసీక్ దోసాసీక్ యెప్డుసూడ్ ములాఖ త్తుంటాయ్.

3. భ:—(రెండవవానితో) అరే, చుప్రవ్ - ఏక్యాయిరాబాత్ హై. మగరూర్ బాత్ బోల్తేకెం. సునో, రాజాకే కే హుకుం కామాఫక్ చలానా హై. ఓదగ్గికి పట్కరావాల్, లిట్యావ్, కొట్యావ్, సంక్లితగిల్ కిష్యావ్.

1. భ:—(మూఁడవవానితో) అరేసంయా, ఏబడాపచ్ పాల్ హై (రెండవవానితో) అరేపచ్ పాల్, చుప్రవ్. తుంయేగల్లీ మేజావ్, నాకీ దుస్రాసందుక్పోతాయ్. చోర్ దిశాతో మనకు తెలిసేదానిక్ బిగిల్ కొట్యావ్. తచ్ఛసం సాబ్ ములాఖల్ హోనా.

3. భ:—(కపిలమీసలువడ వేయుచు) అరేమియా, నాకీసూడ్, దొంగా ఆడీక్ యిట్టా నేష్టాయ్. హుటాహుటీ, చలోచలో, (అందఱు నిష్క్రమించుదురు)

## పండరిపురి : ఒకమార్గము.

---

### పురందరుఁడు : తన పరిచరుఁడు.

పురం:—ఓయిపరిచరా, ఈలోకంబున రామనామామృత పానంబుకంటె మించిన భాగ్యమున్నదే? వినలేదా? "నద్వైవం కేశవాత్పర" మ్మనునీతివాక్యము.

పరి:—(స్వ) అన్నన్న, వీరికెంతవైరాగ్యముకలిగినది. వయస్సుమొదలు "వాఁడప్పీయ లేదే, వీఁ డియ్యలేదే" యనునది తప్ప మఱియొకటి యెఱుంగనివాఁడై సదా తాపత్రయమునకు లోనైయుండెఁగదా. ఇది యాశ్చర్యము. (ప్రకాశముగ) స్వామి, మీకింతజ్ఞానము మా తల్లిగారు బోధింపనిచోఁ గల్గునే?

పురం:—(మందహాసముతో) అది వాస్తవముగాని కలుగువేళ నెవరివల్లనైనఁ గల్గును. అదియుంగాక నీతి యనునది శ్రోతవ్యముగను శాస్త్రోక్తముగనుండిన నెవ్వరు సెప్పినను వినవలసియున్నది.

పరి:—(ఉన్నట్టుండి యులికిపడుచు) హా, హా, ఎవఁడో, ఎవఁడో, ఱంకెలువేయుచున్నాఁడు. చూడు చూడు చూను. (అని తత్తఱిల్లును.)

### ప్ర : భటుఁడు.

3. భ—(కేకలువేయుచు) ఓ, ఓ, చోర్ పురందర్, ఖడో, ఖడో, మాకీసేలీక్కిశిక్యావులేదే. హాలోమత్, సామీహాతాక్కమాల్ సాన్కీయిస్సినావ్ లేదేదే. (అని కత్తినాడించుచు బయలుదేఱును.)

పరి:—(స్వ) ఆ, ఏమి, ఇదేమి! వీఁడు విఱుగఁబాటున భయములేక కత్తి జళిపించుచుఁ గవియుచున్నాఁడు. (ఆఁకట్టి, ప్రకాశముగ) ఓరీ దుష్టాగ్రేసర, ఎవరను కొన్నావురా? ఊరఁబిచ్చుక సింగము నుఱిమిచూచుచున్నట్టు చూచుచు విఱ్ఱవీఁగుచున్నావు, మన్నుమిన్ను తెలియక.

3. భ—అరే, చుప్‌రవ్ బే. మంట్కిలేద్, మింట్కిలేద్. నీకీహద్దంవస్సేగర్దన్కూసూడ్, సూడ్, ఏమిాశేష్టాయ్. (తరవారిఁజూపించుచు 'బిగిల్' అను యూఁదు వాద్యము నూఁదుచుఁ బురందరుపైఁ బడుచున్నాఁడు.)

పురం:—హా, దైవమా, ఇదేమియపోహము ! వీఁడునేఁడహమించి సానికేదో సొమ్మిచ్చినట్లు చెప్పుచు బవిపిదీయుచుఁ బైపడుచున్నాఁడు. ఏసాని, ఏమన్యాయము. ఇది న్యాయ్యమని బోధింప నెవరున్నారు. న్యాయమా, ఎటుఁడాఁగితి?

క. నేనఁట, వారాంగనకఁట,
శ్రీనాథునికటకమందఁగ జేసితి నఁట, నే
స్తేనుఁడ నఁట, యిది వినవిసు
మానం, బుడివోరు, నాదు గ మానం, బకటా! 4

1. భ—(3-వ వానితో) అరేభాయ్, తుండరోమత్, అంబీవిచ్చేహై. (అని కేక లువేయుచు, పురందరుపైపడును).

పురం—(బెగడొంది) ఆ, ఆ, ఆఁగు, ఆఁగు.

1. భ—అరే, ఆఁగుస్తై, గీఁగుస్తై. తుంబద్మాష్‌హై. సూడ్‌మియా, నీకీసంక్లీతగిల్ పిస్సాయ్. (అని పైఁబడి ప్రహరింపుచు సంకెలలువేయును.)

పురం—అహా రే, దయ్యమా, దొంగనా, డొంగనా! ఈభటులు దౌష్ట్యమున శృంఖలములువేసి దోలంగట్టి దోర్మధ్యములచే వేధింపుచున్నారు. కటా, ఈపిడికిటి పోటుల కెటుతాళనగు. శ్రీకృష్ణా, నిన్నర్చించుచేతుల కీశృంఖలలాయెఁగదా. ఈముష్టిఘాతంబు లీపరుషోక్తులు వజ్రపతనంబులై కాయమనంబుల భేదింపుచున్నవి. ఇఁక నన్నుమన్నించి విశృంఖలునిగఁ జేసిరక్షింప నీవేదక్షుఁడవు.

2. భ—(పశ్చాత్తాపమున, పురందరునితో) అరే, మారాజ్, సలాం, సలాం, అప్, అచ్ఛా బామన్‌హై; లేకిఁ, తేరానసీబ్‌బోత్ కరాబ్‌హువా. అబ్‌తుంతుఢో కాస్తై. ఏముద్రానిశాన్‌దేఖో. నీకీహంతా తెల్పిషాయ్. (అని చీటినిచ్చుచున్నాఁడు.)

1. భ—(రెండవవానితో) అరేసంయా, ఏతోబడాచోర్‌హైనా, ;కెంయిస్కామారాజ్‌బోత్తే. ఐసాబోలోమత్. సంజో, తుంయిస్కాలేకేఆవ్. జెల్దీ. హం, జాతాహం, ప్రధాన్‌కాపాన్.

పురం—(శాసనము చదువుకొని చపలమనస్కుఁడై తనలో) అక్కటా, ఏమియపవాదము. "అన్యథాచింతితంకార్యం, దైవమన్యత్రచింతయే" త్తమనదేల రిత్తపోవు. (శ్రీహరిని మనంబుననిల్పి) ఓ భక్తమనోవిహారా, భవవిదూరా, నీకు జోహారులు. నా గోహారులహరింపవే, తండ్రీ. నేనపహారుఁడనఁట.అయ్యయో! ఎంత పురస్కారమాయె.

శ్లో. కీర్తిదంచమే, నార్తిదంచమే, ఇష్టిదంచమే, విష్టిదంచమే,
వృత్తిదంచమే, విత్తిదంచమే, భాగదంచమే, రాగదంచమే,
సుకృతంచమే, శోభనంచమే, అమృతంచమే, అనితరంహరే.

పండరీశుభూషఁ ꣲ బఱిగొని కలనైన
నెఱుఁగ, జడులువీర ꣲ లెఱుఁగరితవు;
నే నొసంగితి నని ꣲ సాని వల్కిన దఁట;
చాన బుద్ధి కంకు ꣲ శంబు గలదె? 5

కట్టా, నేనేడ, సానియేడ. ఈ భటులు ప్రతిభటులై యత్యార్భటిచే హఠము సాధింపుచున్నారు. పాండురంగా, నీవాశ్రితపక్షపాతివని విఖ్యాతిఁబొంది యున్నవాఁడవే. అట్టి నిన్నుఁ బూజించినందుకా, యింతవంతకగఁగించితివి. సరి, యేల విచారము. ఇది నాతలవ్రాఁతగాని యీ భటులచేఁతగాదు. వీరేమి సేయుందురు. రాజునానతి జరపుచున్నారు. అహో! హృదయమా, నీవీ విన్న నువున విన్నంబడనేల? నీవొక పాపమెఱుంగవు. ఉపశమింపుము. (తిరిగి, చల చిత్తుఁడై కొంతవడికి శమించి) పరిచారకుఁడా, పురాకృతమిది. అనుభవింపక తప్పునా?

తే. వీరి దూఱఁగ ఫలమేమి? ꣲ దారి దప్పెఁ
గర్మ మేగునె, పంచ బం ꣲ గాళ మగుచు.

పరి—

చుక్క యెదురైన నేపని ꣲ చక్కఁబడును?
ఐన మిన్నకయున్నచో ꣲ హానికరము. 6

స్వామీ,

ఉ. పంతముమీఱ నీభటులు ꣲ వల్కెడివల్కుల నాలకింపఁదా
వంతముఁ బంతముగా దొరసె ꣲ వాఁ కొను, వీరల బింకమాఁపెదగా

పురం—

ముంతెఁడు నీటికే యలుక ꣲ ముంగడనీరము బానెఁ డున్నదే,
శాంతము దాల్పు, వీరిపరు ꣲ షత్వము చూత, మదేమిసేయునో. 7

పరి—సామి, మీరు వెఱ్ఱివారు. ఈ భటుల ప్రతిజ్ఞావచనము ల్వింటిరిగదా? ఇఁక మిమ్మేఁచకగాని వీరుపోరు. మీకింకను శాంతించియుండుటకే మేలే? యదృవిష్యుని వలె నున్నఁ బ్రయోజనముగలదే? ఇపు డానతిండు. వీరికాతాళమటేఁచి యిప్పుడే వీరలఁ బాతాళమునకుఁ బనిచెద. నాహాళాహాళిగనుఁడు. (అని నడికట్టు కట్టు చున్నాఁడు)

పురం—ఓయి, వీరియాశ్వేర మేమిసేయును. కొంచమోర్చుకొమ్ము. మఱియు విను; ఆత్మక [illegible]గిరసారంబులు గలుగవు. ఇపుడు నీవింటికేగి యా

సమాచారము నుడివిరమ్ము. నే భూపుని సందర్శించి బంధవిముక్తుఁడనై వచ్చెద, ముగ్గురి రహస్యము ముల్లోకములకెఱుక గనుక వేఱొకని కిది చెప్పకు.

పరి—స్వామి, అట్లే. మీరుమాత్రమందఱకుఁ బానకమువలె నుండఁగూడదు సుమా, మిమ్ము దిగ మ్రింగుదురు. అయ్యో, దైవమా, ఈయమలునకెంత దురవస్థ ప్రాప్తించె. (అని వగచును)

పురం—విలపగ? పిచ్చివాఁడా, ఎవరికైనవిధి విధానమలంఘ్యముగదా?

పరి—(స్వ) హా, దైవఘటన. విగతకలుషుల కీపగతురవలన నెంతతొగగలిగె. అయ్యారే, ఈయయ్య నిరానందుఁడై ఋయ్యారమున నెందఱి నియామము లకు లోనై యెంత నలఁగవలయునో. ఔరా, భటులెంత ప్రయాసపెట్టినను శాంతియే వహించి తొలఁకకున్నాఁడు. (ఆలోచించి) అవును, అట్లేగదా, శాంతులుండుట. నిందుకుండ తొనఁకునే? (ప్రకాశముగ) గురుఁడా, తమకు గురుఁడు మంచివాఁడంటిరే? అయ్యయ్యో, మంచిదశ యిదియేగాఁబోలు.

పురం—ఇపుడేల, యీచర్చ. దుష్టసంపర్కముచే సజ్జనులుగూడ దుర్జనులగుదురు. ఇఁకఁజాలు. పొమ్ము. (పరిచారకుఁడు నిష్క్రమించును)

(శ్రీహరిని నిజహృదయ పీఠికాలంకృతుంజేసి పురందరుఁడు పరవశతనుండును)

2. భటుఁడు— (స్వ) అరే, ఏబామన్ నిద్రాపోతాయ్‌యేమో.

(ప్రకాశముగ) పురందర్, పురందర్, ఉటో, ఉటో, అరేబాప్‌రే, మాదీబాల్‌సుణ్. నీకీగొప్పాతనం యెట్టాపొయినాయ్. ఆగేఆగేకంజిస్కానామ్ తెఘ్కన్నావ్. పిచ్చేపిచ్చేసామీగోడ్ ఖద్మాల్ పట్టున్నావన్ తెఘ్కన్నావ్. హిప్పుటోగాంరంగాసాన్కి తగిల్‌నాయ్ కరొక్పుకార్‌పుట్నాయ్. ఏబాత్ సున్యాలో నాకీకలిజా గడ్‌బడ్‌గడ్‌బడ్ కొట్క్ంతాయ్. తోబాతోబా, గొప్పోడ్, సామీగోడ్, అచ్ఛాబామన్ అన్‌పిష్కన్, ఏకరాబ్‌బాత్ క్యాయిక నీకీ పైకిదక్లాయిఘ్కన్నావ్. సునోమియా, ఓగాడ్డామొకంరంగా పాన్కి బాతాసునక్ర్ అప్కఖయిద్‌కరా. అరేనాయనా, దాన్కిరొప్పా మేనిప్పా తగిలేదాన్కి వఖత్‌వచ్చాయ్. సామీ, అప్కపర్వాసై. దేఖో, ప్రధాన్ గాడ్‌ఖార్‌బాత్‌కర్తాహై. నీకీ జావ్, ఓమారాజుక్ సలాంకర్క్ర్ నీకీషెపోక్. తచ్ఛనం నీకీబాత్‌సుంతాయ్. చలోచలో, జల్దీ.

పురం—(స్వ) ఇతఁ డెనఁడో మంచిబంటుగ నున్నాఁడు. వీనివెంటఁ జన మే లగు నేమో. (ప్రకాశముగ) భటుఁడా, రమ్ము, పోదము. (నిష్క్రమింతురు)

## పౌరులసంభాషణ.

ఒకఁడు—ఆహా! ఏమివిస్మితి. దివాభీతుఁడని శృంఖలములువేసి సుగుణసంపన్నుఁడగు పురందరుల వారిని భటులాఁకకుఁ గొంపోయిరి. "ఎద్దీనె నన్న గాఁడిఁగట్టు" మన్నట్టు మూషకుఁ డెవఁడైనది గనుఁగొనక భూపతి యిట్టిదూఱు నారోపించి దూఱువడవచ్చునే? ధనదునిఁబోనియతఁడేమి, ఆచోరత్వమేమి, ఆబంధమేమి? కేవలాశ్చర్యము? దానికాకరము విచారణీయము.

మఱియొకఁడు—దానికేమి? అతఁడుకాముకుఁడును గృపణుఁడు నని ప్రవాదము కలదు; కావున నాశాబద్ధులకును లుబ్ధులకును గ్రూరత్వ, చోరత్వ, జారత్వము లన్నియు సమమే. కామపులకు యుక్తాయుక్తపరిజ్ఞానము పూజ్యము గాదే? వినమే? "కామార్తాహి ప్రకృతికృపణాశ్చేతనాశ్చేత నేషు" అనునది.

తే. ధనపిశాచంబు తన్నూఁపి తఱియవ్రీడఁ
దెంచి పేరాసచే సుమాళించి మాలె;
మూషకంబెరకహిపేటి ముఱిసి దూఱి
యత్యయమునొందు పవిది నా ఁమువనిసురుఁడు. ౮

3-వ వాఁడు—ఇది కేవలమిథ్యామతి. అతనినాబాల్యముగ నెఱుంగుదు. ఆతనిఁ బిసినారియని యనుటయనర్థము. ఏలయనఁగ, నతఁడు దానపరుఁడు, మఱియుం బుత్రాభిమాని. సదావారియభ్యుదయమునకే ప్రయత్నించుచుండునేగాని శిశువు లున్నచో ద్రవ్యనాశమగునను భీతిచే వారిపుట్టుకయే సహింపని కృపణునివలె నుండఁడయ్యె. ఇంతేల యతనిప్రారబ్ధమే యిట్టు లొరయుచున్నదేగాని వేఱు గాదు. "బుద్ధిః కర్మానుసారిణీ" యనునదే తథ్యము.

ప్రథముఁడు—మీరన్నది సంకునఁబోసిన తీర్థమేగాని నిరంతరరాజ్యభారమువహించి నితాంతప్రతిభావంతుండై నిరపరాధియగు నా మహానుభావునకుఁ గూడ నిట్టి కర్మముండునే యని సందిగ్ధము. అయిన నెవరికిఁ దోఁచినది వారు చెప్పెదరు. "లోకోభిన్నరుచిః" అనునది వినమే?

4-వ వాఁడు—సందేహమేల?

మ. తనవిశ్రాణనకై తవాబ్జినికి సద్వారాధ్వభృంగాళిగాఁ
దనకీర్తిచ్ఛలమేఘరాశి కతిరిక్తస్ఫాతటిత్పాళిగాఁ

దనథామోపధివల్లికార్జున మహీశక్రంబెంతయో ప్రాఁకుగాఁ
దనరన్ భూవరుఁ డేలినన్ జనునె ? ప్రశస్త్నస్ఫారదిష్టంబిలన్.

ఇదియుంగాక,

శ్లో. పౌలస్త్యః కథమన్యదారహరణే దోషం నవిజ్ఞాతవాన్
రామేణాపి కథం నహేమ హరిణస్యాసంభవోలక్షితః,
అక్షైశ్చాపి యుధిష్ఠిరేణసహసా ప్రాప్తో హ్యనర్థః కథం
ప్రత్యాసన్నవిపత్తిమూఢమనసాం ప్రాయో మతిః క్షీయతే.

విన వే? పూర్వము శ్రీరాముఁడు, రావణుఁడు, ధర్మరాజాదులు పూర్వకర్మానుసారము నెన్నియో యిడుమలఁబడిరని.

ప్రథముఁడు—అపునవును గాని పరిషత్సదుఁ డొకఁడైన నిది కృత్రిమమని బోధింపలే పోయెఁగదా ? ఇందువలనఁ బురాకృత ఫలమనుభవింపక విధిలేదని యవగ హింపవలయును. ఐన విచారణకాలమునకుఁ జనిన నీసంగతివిశదము కాఁగలదు రండు. పోదము. (నిష్క్రమింతురు.)

---

## పంచమాంకము.

### స్థలము III.

### మంత్రి కచ్చేరి : భటులు.

1-వ భ—(మంత్రితో) సలాం, మారాజ్, సలాం, దేఖో, హాం, చోర్ పురం దర్కా లేకరాయా. ఇదో, సూడ్, కల్కా రాత్కా సాన్కి ఘర్కా పోయ్ హిప్డా దొంగా వేసం హేసోకున్ కిట్కా పాట్కా మన్కున్నాడ్. ఇస్కా మార్ మార్ కేయాల్, మేరేసామి. సలాం.

మంత్రి—(సాగ్రహుఁడై) ఎక్కడ! ఎక్కడ !

భటు—ఇగో సాహేబ్, హీక ఉండాయ్ - హాబ్బాహబ్బా, ఏమ్ నక్లీహరామ్, సామి. కండ్లూమూసోకున్ దొంగాజపం చేస్తాయ్.

మంత్రి—మంచిదిగాని కనకవల్లిని బిల్చుకొనిరమ్ము. (స్వ) హా! ఇతఁ డెంత సాహస కృత్య మొనర్చె. ఇట్టి మంతువు గని విని యెఱుఁగను. (అదృష్టితో, ప్రకాశ ముగ) ఓయి, గోముఖవ్యాఘ్రమా, ఇపుడు నీ బటాబూరము బటాబయ లాయె. ఎక్కడ నేర్చుకొంటివి, యీ కాలనేమి జపము.

ఆ. మ్రుచ్చుగోర, రాత్రి పచ్చవలువదారి
భూష నాహరించి పొలఁతి కచ్చి
తాఁటి యిపుడు దొంగ దాసుండవైతివి.
బ్రాహ్మణునకుఁ దగునె? బక జపంబు 10

బాడబుఁడా, నీవేడబముచాలు. ధనమదాంధుఁడవైన నీవత్యాశచే హరివలయ మాఁచికొనినాఁడు. విటవేషధారి వై నేఁడు దొంగభక్తుని సూటి నటించుచు న్నాఁడవు. ఇట్టి కొఱగాములు కొఱగాములకు గీములుగావే? పాఱుఁడా, చోరుఁడవైన నీకా, యానవనీతచోరునిపైఁ గూరిమి.

తే. విషమశరుబాణ మహిమ భా విసులపై వి
రాళిగొని సోలు నీవేడ? రట్టులేక
సానువుల నిత్యము విరాళిఁ బూనుమాని
చయ దురాహామృతంబేడ? జల్లికాఁడ. 11

ఓయి, ఇపుడుమాచేతఁజిక్కితివి. జరిగినస్థితి నిక్కముగ వక్కణింపుము.

పురం—(చింతించుచుఁ దనలో) హా! ఈపాతకము! ఇట్టి కర్ణకఠోరవాగ్ధారలు! అకటకట! నేఁడెంతయావలియావహిల్లె. ఇది మన్ననంబు నలివాతూలముగఁ జేయుచున్నది. శ్రీహరీ, నన్నాలింపవే? రక్షించువారెల్ల భక్షించువా రగు చున్నారు. ఈకింకరులీమంత్రి నన్ను ధిక్కరింప నేవీరి కేమి పంచకరపాటు లొనరించితి. ఆహా! ఎటుఁగాంచిన శత్రుమండలియేనా? ఆవేశ్యావైశికము న్దలంప గుండె జల్లుమనుచున్నది. దైవమా, నేఁడు నీకటాక్షము ప్రసరింపఁ జేసి యీనిందదొలఁపు మెండె నీ చరణారవిందముల నీడయే యున్నది.

క. సంగము తొడరెఁ వల దన
ముంగల వెనుకల నరాతి మూర్ఖుల గమిలో

భంగం బింగ మగునె? నా
కిం గఁదమోగ్రస్తవరమి శ హీరుతోయమునన్. 12

(మంత్రితో, ప్రకాశముగ) శమఘోత్తమా, నేనొక్కపాపకృత్యమెఱుఁగనే? మీ రొక్కించుకేని మదీయమనోభావమెఱుంగక యూరక పంతమున దిసం తుకొట్టి యిట్టిసంతాపము సంతరింప న్యాయ్యమా? ఓన్యాయమా! ఎచట డాఁగితి. సమయమున నిట్టిడాఁగురింత నీకు సంతసమే.

మంత్రి—(సరోషుఁడై) ఓయి, ఎక్కడిన్యాయము. ఇట్టి నీ కాకృత్యమునకుఁ గా కృత్యముగల్గునే? నీతియున్నచో నీనేఁతలిట్టివగునే? ఇదియునుంగాక యిట్టి యలరుఁబోఁడుల వశక్రియలకు వశ్యులుగానివారు నీ యట్టివారే?

పురం— (స్వ) మదుక్తులనర్థ్రువంబనియెంచి యాగచ్ఛులాఁడి మెచ్చగు నిచ్చక ములకు నీ యమాత్యుఁడుడోకారమునొచ్చి యీప్రకారము విప్రకారము నేయుచున్నాఁడు. భూవరుఁడును "యథాచైత్రస్థథామైత్రః" యనునట్టుం డునో? ఏమి నాదుర్దశ. వీరినిగ్రహంబు సూపుమనిన వీరుగ్రహంబు సూపెను వ్రదువునేయున్నది. ఔరా, ఏమి యీాదేలు, ఇకెక్కడిమేలు. నామాటలెల్ల జగజల్లిమాటలాయెనఁట. దీనిసెంతమఱచినను మఱపురాదుగదా. (ప్రకాశముగ) అయ్యా, మంత్రివర్యా, మంచిసెబ్బలు విచారింపక చిక్కిన నాతో నీ వాగ్వివాదము మీకుఁ గడుమోదమే? సయ్యాటలకు నా తాఁగపై నామనంబు లియ్యమైనదని యంటిరే, యది దయ్యమెఱుంగునేగాని యన్య లెఱుంగరు. అయిననిట్టి శుక్రాచార్యులనాయము మీ యట్టివారికి న్యాయ్యమే?

మంత్రి—ఔనౌను. నీదౌష్ట్యమైంద్రియకమైనను గాకాక్షి న్యాయమంటివి. ఇపు డెంత తెలివివచ్చెను. నీవు దాఁపరించునపుడును డాఁగురించునపుడును నీ తెలివి లేటలెట దాఁగురించితివి? (భటునితో) ఒరీ, కనకవల్లివచ్చెనా?

భటు—సామీ, ఇదిగో, చేరుగడనున్నది.

ప్రవేశము : కనకవల్లి.

కన—మంత్రిపుంగవా, దండములు.

మంత్రి—విరిఁబోఁడి, వింటివే? ఈ పంతగాఁడికొనకలేదుబంతియని గోదగించు చున్నాఁడు. నీ పురావృత్తమేమో యథావృత్తముగ వక్కాణింపు.

పురం—(స్వ) ఓహో, ఈతఁ డారంభముననే సాని కింత వశంవదుఁ డగుచున్నాఁడే, యిఁక నావాఙ్మూలమధిః కృతంబగునేమో.

కన—(విహ్వలచిత్తయై గుండియఁగొట్టుకొంచు) అబ్బబ్బ, ఈ బొమ్మని మోసము చెప్పినఁ దీరునా? ఈ యఱజాతి యఱచే నాకెంత యఱగావించి గమించె. స్వామీ, ఇంత టక్కరి యెక్కడనుండఁడు.

ఆ. నాగృహమున కీతఁ డేగుదెంచియు నొక్క
రేయి తాపమార్ప వే, యని వడిఁ
దక్కడికడియ మిడి తమిఁ గ్రీడ నొనరించి
యేఁచి నన్నులోఁచి యేగుదెంచె. 13

పురం—(స్వ) అబ్బా, దీని నైపుణ్యము. ఇది యేమన్యాయము! ఈ మాయలమారి యెంతయో పంతమునఁ బలపోరుచున్నది. ఓసీ, నిశాచరీ, ఎంత నేర్చితివే! విమార్గమెఱుంగని నా యట్టి వైదికునిపైఁ బిచ్చుకపై బ్రహ్మాస్త్ర మన్నట్లేల యింత మాత్సర్యము. మంచిది, ఇంకేమేమి కపటించిచెప్పి యతని మెప్పించునో యాలకించెద.

మంత్రి—(పురందరు నెగాదిగఁ గనుచుఁ దనలో) ఇంత సాహస మితఁడు సేయునా! నే నమ్మఁజాల; అయిన నింకను విచారించి కర్తవ్యమునకు నుద్యమించెద. (సోత్ప్రాసముగ సానితో) వేశ్యా, నీవు మాకెంతయో యుపకారము చేసితివి, లేనిచో నీ యాభరణము లభించుటరుదుగదా? సరి, పిమ్మట? టూకించిచెప్పు.

కన—అయ్యా, ఈతగాఁ డిట్టిమోసగాఁడని తెలియక వమ్ముగా మోసపోయితిని. ఇతని విరహతాపము వినుఁడు.

సీ. వేదండయాన నీ కోదండములఁ గేరు
  గరళార్త కోదండ కాండమేసి
నీదృష్టులఁ ఘూమ మూఁదినీగళదర
  రవహుం డుకాక ధ్వని న్రాగమెనపి
వలదు సుమాళమ్ము నలలినున్నదితుఁగాఁ
  జేయ నేచెను గాని శిఖరివత్స
జయుగాంతరంగ పే శలరంగ నటునిగాఁ
  జేయకనర్థంబుఁ జేసె మరుఁడు
తే. తగునె, ఘనకచ, నన్నుథా తప్పఁ జేయ
నాదు నతు లిఁకఁ గొంచు న న్నాదరించి

పొచ్చెముఁ బ్రచ్చి యాతిథ్య । మిచ్చి మెచ్చి
నీదయారస వృష్టిచే । నేదుమతివ. 14

వెండియు,

ఉ. కాంచనగంధిఁ బొందఁ గలి । గంధవిరావము దూల్చు టెట్లు, స
త్కాంచుకిరోమ రాజి విడ । గంధవహోర్జమడంచు టెట్లు, మె
చ్చించి ఘనాభ్రవేణిఁ గవి । యింపక యెట్లు సుధాంశునాఁప, నీ
ప్రాంచితపద్మవైరిముఖ । నందక పద్మము లూఁదు టెట్లు, పా
లించెదు రామవాణితమి । లేకిలఁ గోకిల నొంపు టెట్లొకో. 15

అని యితఁడు నుడివె. ఇది గజనిమీలనమని యెఱిఁగియుండిన నితని నప్పుడే చక్కఁజేసియుందును.

మంత్రి—(అంతయు సాంగోపాంగముగ నాలించి సాంశయితుఁడై, తనలో) ఇది నిష్కర్షగా మహాహతము. ఇతఁడు ధనియైన వితరణి గాకుండవచ్చును. అయినను సద్బ్రాహ్మణుఁడు. ఇతనివంశమో, సద్వంశము. ఇతనిసతియో, సతీమణి. ఇదియునుంగాక యితఁ డిటీవల గోవిందానుజీవియయ్యెనని వినుకలికలదు. మఱియు నితఁడు సదాచారసంపన్నుఁడు నన్యయోషిత్పరాఙ్ముఖుఁడును గాన వీని ప్రేమల జరాభీరునిపద్దుచెల్లదు. ఇట్టివానికా, దుర్గుణముండును. ఉండిన, మధ్యరాత్రంబున నాగుడికెటునిర్భయముగఁ బోవును. పోయిన, నంత సుకరముగ నెటులు కడియము దెచ్చును. తెచ్చిన, దాని నిచ్చుట కీతనిమనం బొప్పునే? వెండియు వీనిపైసరియైన సాక్ష్యము లేదు. ఈతలములం బట్టితర్కింపఁగ నితఁడనింద్యుఁడుగ నున్నాఁడు. ఇతనిమీఁద నీపె నిష్కారణముగ దోషారోపణము చేసియున్నది. ఈ వెలయాలు ఛెంగనాలుచేసికొంచమానాలుసూపించినంతమాత్రనే దీనివాక్యము విశ్వసనీయమగునే? ఇది కాకతాళీయమే! (ఆలోచించి) కాదు, కాదు; అప్రమాణము. ఇపుడు దీనిగుణ మత్రగుణమయ్యెఁగాన నిటు తడఁబడి పల్కుచున్నది. (ఆలోచించి) ఇంతచర్చయేల! బజాఱున బజాఱించు బజాఱిమూఁకలెచ్చో నిజమాడుదురు! (ప్రకాశముగా) ఓమిటారి, నీయంతరంగం బధిగమించె. కాతకుదగ్గులు నేర్పెదవో? నీబంతపుఁబల్కులన్నియుఁ జంద్రకాంతములని యిపుడభ్యక్తమైనవి గదా? ముల్లోకంబుల మోవంచనలకు వంచింపఁబడనివాఁడొకఁడుండునే? ఇఁక నీచతురిమ చాలు. విద్యమానమానంబు మానవతులకుఁ గాక మీబోంట్లకుఁ గల్గునే?

ఉ. వారక వారకామినుల వర్ణను మోపుట తెల్లమెం, దసా
ధారణ ధారణాంగముననదల్చి జయించిన యోగిరైన వే
సారక సారకాంక్షఁ జెలి సాహసవాగ్ఝరి లీనచిత్తుఁడై
మారుఁడ,మాటుడాంబికమమంగళమానని జోగియాఁ దుదిన్. 16

ఉ. చాలు, నిదేటిమాట? నెఱ జాణతనం బిట చూపమేల? యీ
లీల పురందరాఖ్యుఁడవ లీలగ నచ్చుగ మ్రుచ్చిలించునే ?
వాలుగగంటి, కొంటివప వాదము వాదము భేదముల్, జెలుల్
చాలరె? లోఁచవాలు మగలన్ వగలన్ బగలల్ రసోక్తులన్. 17

పురం—(సంతసమునఁ దనలో) నాపైనించుకించుక దయగలుగుచున్నది. అటుల దారికి రా రమ్ము, నాతంద్రీ.

శ్రీహరీ! సచివుండు ప్రకృతమున సాంశయికుం డగుచున్నాఁడు.

కన—సామీ, నేమమేల? ఈపురందరుఁడు నన్ను విడంబించినది నిజము. నాసాకిరిని విచారింపుఁడని మున్నే మనవి చేసియుంటిఁగాదే ?

పురం—(స్వ) ఓహో, చూడు, మీపెళానపుణ్యము. ఇతనికిఁదెలియదా? ఎల యెవఁడో రయున్నాఁడని పదేపదేచెప్పనేల. ఔరా, ఇదెంతజాణరా, "విషకుంభం పయోముఖ" మనునది దీనిజాతికే చెల్లును. మఱియు లోకమున నిట్టి పణ్యాంగనలవిషయమై కూటసాక్ష్యముల్ వల్కుటుందుదురు లెందఱుందురో! ఓసీ, నిర్దోషినైన నాపైనూరక యిట్టిలూతామాలపుఁ బల్కులనోడి కట్టనీకు మేలా?

మంత్రి—(సానితో) నే వానివిచారించితిఁగాని వాఁడు కృతసాక్షి. నీకుఁ బోరామియై లోపడియుండవచ్చును. వెండియు వేటొంపు సాక్ష్యము లేమింజేసి నీవాదమును నమ్మవీలులేదు. విను, నేరమినొనర్చిన నేరమినోర్వవచ్చుఁగాని నేరిమినొనర్చిన నేరము సహింపవచ్చునే? ఇపుడు నీపల్కుబడి మునియేగాక నసిగాదు, సుమా.

(పురందరునితో) నీవీకంకణము నెప్పుడైనఁ జూచియుందువే ?

పురం—చూచియే యెఱుఁగను.

మంత్రి—సరి, నేఁడు మీరంతయుం వింటిరిగదా? ఇఁక మీరేమి వాక్రుచ్చెదరు ?

పురం—సచివోత్తమ, ఈపె వాచికము కేవలవిశ్వామిత్రమని మీకే స్పష్టమయ్యె. సత్యాసత్యములేవో, మీరెఁగనుగొంటిరి గాన నిఁకనేనేమి నుడివెద. మీవలన నాపిలుగులొలఁగె, నాకు మేలుగలిగె. అయినను వినుండు.

తే. పడపుఁ జెలులెన్నఁ దప్పుల । తడక లౌటఁ
బడఁతి వాక్పాళి విశ్వాస । భాజనంబె?
భక్తగణమేడ? భువినాగ । వాసమేడ?
నాగలోకంబు నక్క వి । న్ననువుగాదె? 18

కన—(లజ్జచే శిరమువంచుకొని తనలో) అకటా, గిత్తతన్ననని బెగడి తత్తడిచెంతకుఁ బోయినట్టయ్యె, నాగలి. ఇఁక నాకు వేఱెవరులోఁడు? దైవముదక్క..

పురం—ఆహా, అలజ్జికలకు లజ్జయనునదిగూడ యుండునే.

మంత్రి—విప్రోత్తమా, మీపలుకులెల్ల సప్రమాణంబులుగాని మహారాజుగారిత్తఱిఁ బురప్రవేశము సేయఁబోవుచున్నారు. వేళమీఱినది. ఇపుడేమి సేయ నసాధ్యము. అయిన మీరు దండ్యులుగారుగాన నిశ్చింతుల రగుఁడు. మీకు సుఖమగు.

చ. గతపరిభావమూనఁగ వి । కాసము వీడదె? శూలికైనఁ, జూ!
గతజల సేతుబంధనము । గాకు గదా? ఇఁక సాకమేల? భూ
పతి కరుణార్ద్రచిత్తుఁ డభి । పన్నుఁడు నీకు హితంబుసేయు, ని
ర్జితవిమతాంతరేంద్రియ, హ । రిన్వరియింపఁ దఱిఁ గా భరింపఁ దే. 19

మీనిరపరాధ మూరీకృతంబయ్యె. అయినను మించిన కొందలంబునకుఁ గొంద లింపక యొకింత యూరే యోర్చుకొనుఁడు. సర్వము రాజుగారి దురాజ్ఞైనను యెల్లి వారిరూపురూపునఁ గలరూపుని వేదించి సకలము నివ్వటిల్లఁ జేసెద. మీరభి పన్నులుగాన రాజుగారవశ్యము మిమ్ముఁ గాపాడుదురు. (బుద్ధిశాలియగునొక కారోద్యోగినిఁజేరి) ఓయి, మహనీయులు మహాశక్తి సంయుక్తులగు వీరికిఁ గారయందు సమీచీనోపచర్యలు గావింపుము.

ఉద్యో—అనుజ్ఞ.

పురందరుఁడుగారు! దయ సేయుఁడు.

పురం—(నిర్విణ్ణుఁడై, స్వ) హా! ఏమికష్టము! ఇదేగాఁబోలు మహానుభావత్వమునకుఁ దగిన ఫలము. నావిన్నపమంతయు వితాయయ్యె. ఈ ధీసచివునిచే నిపుడు మోఘీభూతుండనైతి. ఆహా! యితని తెలివితేటలు "రామాయణమంతయుం విని సీతకు రాముఁడేమికావలయు" ననుపాటిగ నున్నవి. ఇపుడితనివ్యాజస్తుతి దెలిసె. ఇతఁడీ సుందరి కధీనుఁడై స్వతంత్రింపలేకపోయె. సరిగాని నాకిపుడు తప్పించుకొనుమార్గ మెట్లు. పరిచారకుఁడును విడిచిచనె. నేనేమిసేయుదు.

నీకాంగిసైతి. మంచిది, విచారమేల? "అనాథోః దేవరక్షకః" యనునదొకటి యుండియేయున్నది. (శ్రీహరినిస్తుతించును) ఆపద్బాంధవా! శరణార్థిని. మొఱయాలింపుమా.

ఉద్యో—సామీ, ఏమాలోచన? నావెంబడిరమ్ము. అదే, కారాగృహము.

పురం—సరి, అప్పా, సరి. ఎన్నఁడుచేసినకర్మమో.

ప్రవేశము: పరిచారకుఁడు.

పరి—అయ్యా, దిగులొందనేల? చిక్కువడి; క్రుంగఁబడక ధైర్యమూనుము. తొల్లిలోకాభిరాముండైన రాముండును, కృష్ణానందితులగు కుంతీనందనులును, సుగుణగణ సాంద్రుండగు హరిశ్చంద్రుండును, విగతఖలుండు నధికబలుండు నగునలుండును ఖేదింపరే? నేఁడు మీపురాకృతమే, యిట్టియభిశాపమునఁ ద్రోసి తుదకుఁ జెఱఁబడఁజేసె.

పురం—సమీచీనము. "అవశ్యమనుభోక్తవ్యం, కృతంకర్మశుభాశుభ" మనునదెఱుఁగుదు; అయిన నీనాల్గాలిమ్మైఁ గొమ్ముదక్కి యీ గండారునెంత చింతిల్ల వలయునో. దైవమా, యీ యపనయము రయమునసపనయింపుమా.

తే. ఆర్తసురభూజ, కోటి మా ర్తాండ తేజ,
అంబుభృన్నీల, మత్తవే దండపాల,
దారితా సురచయ, యస్మ దనయలహరి
స్వాంతము చెలంగఁ గఁ గలఁచి యాడుమయ్య. 20

(ఉద్యోగితో) ఓయి, నన్నేమఱించి మున్నాడి తోతెచ్చితివి. ఇపుడు నేమరింపనున్నాఁడ. (శ్రీహరినిహృద్గతుంజేసిశోషిల్లును.)

ఉద్యోగి—అయ్యా, అయ్యా, అయ్యో, పలుకఁడే; యిఁకేమిగతి; యిదేమన్యాయము. ఇతనిజాడఁజాడ దేహముకంపించుచున్నది. అక్కటా,యితఁడసుభంగమునకుఁ దెగించికాఁబోలు తూష్ణీకుఁడై శవముంబోలెఁ గాన్పించెడు. (కొంచమాలోచించి) అవునవును. అదియట్లే. శ్లోకము." సాధవో మృతో ర్భయం నగణయంతి"యని పెద్దలు చెప్పుదురు.

తే. అయ్యయో, వీరి యుస్సిలి తాత్మపుష్క-
రంబులు నిశీధముల సరో జంబుల బలె

ప్రగ్గి ముకుళీకృతంబులై యగ్గపడియె
నేమి గతి, యమాత్యుం డేమి యెంచునొక్కొ. 21

ఏమైనంగానీ, బిఱానలేపెద. ధాతువెట్లున్నదో! (చూచిసంతసించి.) ఓహో, ఏమిభయములేదు. శ్వసనముకూడ బాగుగా నాడుచున్నది.

ప్ర—స్వామీ, లెండు, లెండు. (అనిలేపి) అయ్యో, చాలభయంపడితిని. మీాతరము వారికి నిట్టిదినత దగునా?

పురం—అబ్బా, ఏమికష్టము. ఓయీ, "ప్రారబ్ధంభోగతోనశ్యే" త్తనునది విశదమే; అయినను భోగానంతరమున నాకీ సంకట మెటువచ్చెనో నాకే యాశ్చర్యము. నీ విఁకఁబొమ్ము. నేనును విశ్రమించెద. (నిష్క్రమింతురు)



## పంచమాంకము.

### స్థలము IV రాజమందిరము.

యశో.—(తెరలోపలనేవిష్టమున నున్న భార్యవంకఁజూచి) అజ్ఞారే! ఈస్త్రీరత్నము స్త్రీఘోషం బగుచున్నను దెలియక నెజ్జపైనింకను బరుండియున్నది కాఁబోలు; అయినఁ బిలిచెద. ఓనారీమణీ.

క. శ్రీకాంతుఁడు తనుఁబాసియు
నేకాంతామణికి దక్కె నిత్తఱియంచున్
త్మాకాంతవేగ వేగుఁ
జోకఁ బుత్తెంచె నాఁగ శుక్రుఁడుదోఁచెఁ. 22

ప్రియా, ఉషఃకాలమైనది. రమ్ము. చిత్రమగు నొక కథదెల్పెద. (పరిచారికఁగని) నేవచ్చితినని దెల్పిమీారాణిని నిశాంతమునకుమున్న తోడి తెమ్ము. (బహిః ప్రదేశమున నాసీనుఁడై వాలోద్ధూతజీమూతంబుదంబునఁ జలించుచు) ఆకటా, శ్రీహరిప్రియభక్తుఁడగు పురందరు గౌరవము దెలియక వ్యర్థముగా నతనిఁగారాగృహమందుంచిన నాఁటంగోలె మస్మానసం బనుక్షణము గారాకూర మగుచున్నది. (సవిచారముగ) అయ్యో, ఒకక్షణములోఁ జేసిన

యపరాధము జీవితకాలమంతయు వ్యసనమును గలుగఁజేయునని తెలిసియు నే నూరక యపచారమున బేరము సేయువారలఁ జారమునవేసి వారికపచారము చేసితి. ఇది ధర్మరీతియగునే? (ఆలోచించి) హా, ఎంత ప్రమాదము! ఇపుడెంత ధైర్య మూనినను డెందము శాంతింపదయ్యె (ఉత్ప్రేక్ష్యండై) కటా, గేలిగొని పుణ్య తముండగు సద్బ్రాహ్మణుని నిర్నిమిత్తముగఁ జెఱలో వేసి యాయాస పఱచినం దునఁగాఁబోలు చంద్రుఁడు శోభావిహీనుఁడయ్యెడు. వెండియు నిజభర్తయం శక్తిమంతుండయ్యెడుఁగదా, యిఁకఁదమవిరోధికంటఁ బడుట పతివ్రతాత్వమున కెగ్గగునేమో యని నక్షత్రోత్కరంబులు కరంబదృశ్యంబు లగుచున్నవి. మఱియు భక్తులభంగపెట్టి వీనికింతపంతమా యని ప్రాచ్యంగనామణి క్రోధ కషాయితముఖియయ్యెడు. ఇఁక నెంతరానున్నదో! బోటిలోఁదలపెట్టి రోఁకటి పోటున కడలవచ్చునే?

ఉ. ఏలొకొ! వేశ్య డాసిని గ కదించె, గథించెను బో, సుమంత్రితా
నేలొకొ! లేకఁ బంచె, నపు క డేలితి, నేలితిఁబో, పరాకున
న్దూలుప భక్తునేల చెఱఁ క ద్రోసితిఁ, ద్రోసితిఁబో, మురారి న
న్నేలొకొ, కూఁకరించె, నిఁక క నేవిధి, హా, విధిదాఁటవాటమే. 23

అయిన శ్రీహరిని సంస్మరించిన సంచితదుష్కృతములు హరించుఁగాన నేనటు గావించెద. "నానావిష్ణుం మోక్షదోనాస్తిదేవః" అనునది యథార్థమని శ్రుతులు ఘోషింపుచున్నవి గావే?

కందగీత గర్భచంపకము:—

ఖలనరకాంతకా దనుజ క కాల రమేశ పతంగవాహ లాం
గలిశయనా కృపాపరవి క కార విశాల సువర్ణచేల దు
ర్బలకరిపాలకా మురహా కరా దురితౌఘువిమోచనాత్మ దో
ర్బలగిరిశాంచితా వృజిన క వారిధి శిక్ష మహేంద్రరక్షకా. 24

ఇందలికందము, "నరకాంతకా" యనుదానినుండియు; గీతి, "దనుజకాలర మేశ" యను దానినుండియుఁ జూచుకొననగు.

## ప్ర: శుభకీర్తి.

శుభ—(నయ వినయము లెనయఁజేరి) ప్రాణనాయకులకు వందనము.

యశో—(జనాంతికము) కాంతారత్నమా, రాత్రి యెంత వింత జరిగెను! అద్దాని నిర్వ చింప నేనేరంచిలిగాని నీ సుఖసుషుప్తియే నీకుఁ బ్రతిబంధకమయ్యెనని మదించి నిర్వచనుఁడనైతి. ఆహా, ఆదివ్యమంగళవిగ్రహము నే నేమనివర్ణింతును.

శుభ—హా, అటులా! ఏమిదింత నాథా.

యశో—ఆలింపుము. (శుద్ధ విష్కంభము)

సీ. అరవిందదళనేత్రుఁ ॥ డాజానుబాహుండు
నుదుటఁ గస్తురిబొట్టు ॥ నొదవువాఁడు
శంఖచక్రములు భు ॥ జంబులఁ గలవాఁడు
గదయుఖడ్గముఁజేతఁ ॥ గలుగువాఁడు
రమయుఁ గౌస్తుభము ను ॥ రంబునఁగలవాఁడు
కనకచేలమ్ముఁ బైఁ ॥ దనుకువాఁడు
హారకేయూరకో ॥ టీరము ల్గలవాఁడు
సజలజలదపు మై ॥ చాయవాఁడు
తే దేవదేవుఁడు పండరీ ॥ దేవుఁ, డహహా!
పరమతుంబుర నారదు ॥ ల్పాడ, నలరి
యప్సరసలాడ, బృందార ॥ కాళివేఁడఁ,
జెలఁగి నిలిచెను నాదుముం ॥ గలను గలను. 25

కల్యాణీ, వింటివే! పెందిరువడి సెక్కి పెరుమాళ్ళిటు విచ్చేసి మదీయ స్వప్నంబునఁ జేదగ్గను పెన్నిధివోలెఁ బ్రత్యక్షంబయ్యు నన్వాఁడిచూపులంజూచె; అంత మజ్జాగ్రదవస్థయందు మాయిరువురిలోఁ గొన్ని ప్రశ్నోత్తరములు జరగె; అవి మఱచిన మఱపురావుగదా. సావధానముగ నాలకింపుము.

ఉ. ఏలరభక్తునేఁపఁగ ధ॥రేశ, మదాంధత, దస్యుఁ, డెట్లు, శ్రీ
లోలునిభూషదోఁచె, నవ ॥ లోకితమెవ్వరిచేత, వారకా
న్తాలలితాంగిగాంచె, నది ॥ నాఁచినదా, మృష, వాఁడుకామియై
క్రాలుచుదాని వేశ్యకిడ ॥ గగ్గకయాపె యొసంగె మంత్రికిన్. 26

అవ్వల నిటువచించె—నీవు రాజ ధర్మము నిరసించి మత్ప్రియభక్తుని కష్టపెట్టి ప్రథగావించి నీయుద్ధతి గాన్పించితివి.

తే. సకలతస్కరముష్కర శాసకుండ
వయ్యు హరివంశజాతుండ వయ్యు రిత్త
యనఘు శాసించితివిగదా? అవనిపతులు
రాజ్యమదమత్తు లనుట వైరస్య మగునె? 27

ఓయీ,

ఉ. భూసురువిన్యసించితివి పుణ్యజనుండ, చెఱ న్విముక్తకా
రాసదనున్ధనర్వవలె రాసభమానికమయ్యె నీదురు
త్ప్రాసమె యంబరీషనిభపావనునూఁచె విభంగడోలికన్
దోసముగాదొకో? తొలఁగదో? స్వకళత్రసమతాఖ్యలోటునన్. 28

శుభ—(తెచ్చపడి) ఆహా, మీ రెంతపుణ్యులు. శ్రీహరి సాక్షాత్కృతుండయ్యె. ఆవల?

యశో—ఆవల యీవలితలకొనదు. మఱి విను.

ఓయి ధృతరాష్ట్రా, మద్భక్తునికీర్తి సర్వత్ర ప్రజ్వలింపఁ జేయఁదలఁచి నేనిట్లొనర్చితి. ప్రజ్ఞావంతుఁడవయ్యును నీవు దీని సంశోధింప మర్లుటమయ్యె.

క. కాంచునది నచ్చవచ్చున్
గాంచక వినినంతమాత్రఁ గ్రన్నన నమ్మన్
జాంచల్యుఁ డైననోడఁడె ?
ప్రాంచద నపరాధిశిక్ష కర్హుఁడె? చెప్పుమా. 29

అయిన నీవు తొలిమేన మదీయ సేవాపరాయణుఁడ వైనకతన నిన్నిపుడు కటాక్షించితి. ఈవు మద్దర్శనంబునం జేసి విగతదోషివైతివి.

ఇఁక మదీయశాసన మంగీకరింపుము.

ఉ. చింతదొలంగి భూమి సురసింహు యశోవిజితౌషధీశుని
ష్ప్రాంతకళంకుశాంతఖనిఁ గాంతవిమానమునందుఁ జేర్చి శ్రీ
కాంతు నిశాంతరత్నమునఁ గానికిఁ జేర్పు మదాజ్ఞఁ జేసి, నా
చెంత నభీప్సితార్థములఁ జెందరె మద్భక్తసంతతుల్. 30

ఇట్లు నుడివి యదృశ్యుం డయ్యె. ఔరా! ఆ దేదీప్యమానము వర్ణనాతీతము సుమా.

శుభ.—[సంతసమున] ఆహా, దయామయుఁ డనిన నాపురుషోత్తమునకే చెల్లును.

యశో.—(భటునితో) ఓయీ, నీవీలేఖను మంత్రికిచ్చి యతని వేవేగొనిరమ్ము.

భటు—చిత్తము.— (నిష్క్రమించును.)

యశో.—(భార్యతో) రామామణి, శ్రీరమామనోహరుని ర్హైతుకజాయమానకటాక్షము నాథ క్తవత్సలత గనుఁగొంటివే?

ఉ. వయ్యముగాదె సంసరణ ⁑ వార్ధిని నీఁదిన నెంతకాలముః
నెయ్యముగా వెత ల్విడవి ⁑ నీతులభాతివనిః జరింప నా
తియ్యముగా దెలుంగు మిది ⁑ దేశికవాక్యము దీనిమానిసః
వయ్యముగా దతండు భవ ⁑ తారకుఁ డైననొనర్చునే? కుయిన్. 31

వినుము, మనము తుచ్ఛంబగునైహికసుఖాబ్ధినీఁది నకాల్క్రమంతయుం మేలము సేయుచు నిట్టగణితభవపరంపరలకు లోనై ఖలీభవించుచున్నాము. ఇపుడునిజపుత్రునకుఁబట్టాభిషేకమొనరించి పురందరులవారిని గురూత్తములుగ భావించి యాతయామసంసార మిఁక నిస్సారమనితలంచి శ్రీహరి సంస్మరణసమాకృతమతియంతులమై పుణ్యానదీనదతీర్థంబుల సేవించి సమంజసగతి గడియించెదము.

శుభ—సత్యము, సత్యము. ఈరాజ్యజన్యజన్యాభటాంభోరాశినెందనుక నీఁదులాడిన నిష్ప్రయోజనము. ప్రస్తుతము లక్ష్మీబాయికి సుఖము న్గూర్చు కార్య మొకటి గలదు. ఆమె పతివ్రతాశిరోమణి గాన నామెను దుఃఖాబ్ధిముంపకనిష్క్రమింతుఁ డగు పురందరుని వేగ బంధవిముక్తునిగఁ జేయ నగు.

యశో—సెబాసు, లెస్సగఁ బల్కితివి. నీవు పురందరుఁడుగారి యాగారమున కిప్పుడే యరిగి యమితార్తయైయున్న లక్ష్మీబాయి నాశ్వాసింపుము.

శుభ—(లజ్జానతముఖ యై) నాథా, రాణివాసినిగాన నచటికిఁ జన లజ్జాశంకలు మనంబున ఘనంబుగఁ గలఁతపెట్టుచున్నవి.

యశో—(స్వ) ఓహో, త్రపావనతముఖయైనది. సాధారణముగ నంతఃపురస్త్రీతతు లిటుండుట సహజమే గాని యిపు డిది తగిగాదు.

ప్ర—ఓరాణివాసమా, రాణివాసమా! అయిన నేమి? ఈసమయమున నిటు సంశయించుట యర్హమే?

తే. అంగనామణి, పుత్రురాజ్యాభిషేక
మెంచి హర్షించి నిజరాష్ట్ర ⁑ మెడలు మనకు
జరయుఁ బైఁబడె నాశ్రమాం ⁑ తరము గరము
సేరఁగోరితి మింక శ్రీ ⁑ చేఫలంబె? 32

మన కపస్థాశ్రమంబులు రెండును రెండైనవి గాన విశయ ముంచుకొనక తద్వి
శయమునకు హాళాహాళిఁ జనుము. ఆసుశీల భర్తృవియోగానలజ్వాలల నెంత
తప్తచిత్తయై యుండునో; వెండియుఁ దనసాధు ఖేదమునకు మనమే కారణ
భూతుల మనియామె యెఱిఁగిన మన కెట్టి యనర్థ మొనరునో; ఒకవేళ శత్రు
పాతుఁ డని దలఁచినకాశాపించునో. ఇపుడు మనమా మిథునమ్ముల కాగ్ర
హము రానీక మెలంగవలయుం.

ఆ. పరమభక్తుల నెటు । పాలనసేయు స
హస్రపాదుఁ డంచు । హాళిఁ గన స
హస్రపత్రరాశి । యంపెనో నాఁగస
హస్థలినిబొలిచె సహస్రపదుఁడు. 33

అటుచూడు, పద్మినీవల్లభుఁ డుదయాద్రికూటావలంబియై తోఁచెఁ గాన
వేగఁ గుస్తరింపఁ బొమ్ము.

శుభ—సరి, పని వినియెద. (నిష్క్రమించును)

ప్రవేశము : మంత్రి.

యశో—అమాత్యపుంగవా, ఉత్తరము చేరెనా? విషయమంతయుఁ సంగ్రహించితివా?
మంత్రి—అంతయుఁ గ్రహించితిని.
యశో—ఇందుల కేమి సాధనము?
మంత్రి—(విహాసముతో) సార్వభౌమ, రణైకశూరులును జగదేకవీరులును నగధీరు
లును గ నుండు మీరే యిటు విహ్వలించుట గన మహాశ్చర్యముగ నున్నది.
యశో—(తనలో) ఇతఁడు వెఱ్ఱిబాగులు. మద్వాక్యములఁగానికిఁ గైకొనఁడు. వీని
సమక్షమున నది జరిగియుండిన వీని కీడాంబిక ముండియుండునే.
బ్ర—ఓయి బాదరాయణీ, బాదరాయణాదిమహర్షులను గమలాసనాద్యమర్త్యులనుదన
మాయచే భ్రమింపఁజేయు మాయాకారుఁడగు శ్రీమన్నారాయణుని చెంత
మనమన నెంత? మదీయదరం బంత వింతయే. విను.

ఉ. గాదము గాదమానియెద । బ్రహ్మఁగ వేడబమాని లాఁగ స
త్వాద మటంచు దూఱి వనిఁ దారి యవాగ్రముఖాబ్జరై మొగిఁ
సోదెపు మోఁతఁ గైకొని యశుద్ధగరాళముఁ బూని నమ్రమై
ప్రోదిని నీఁది జీవనముఁనం దొగి దోఁగియుఁ బత్కులింప. కా
ద్వాదశరాసు లివ్వరుస । దంభముఁ బాసి చరించె దిమ్మునన్. 34

అదటుండఁగా "రాజానుమతో ధర్మః" అను నీతివిడిచి నేనెట్టి యధర్మమొనఁ
ర్చితి. కటా, మదీయబుద్ధిమాంద్యము దీభవించెఁ గాని కర్మఠుఁడవైన సచివా,
నీప్రజ్ఞానసాచివ్య మెటుపోయె.

క. బుద్ధుఁడ వయ్యుఁ గదతి నీ
బుద్ధిసెడె నాకు నట్టి పోయెఁ వేశ్యా
శుద్ధోక్తుల్ స్మృతులే, "స్త్రీ
బుద్ధిః ప్రళయంకరీ" సు బోధన వినవే. 35

మంత్రీ, ఇఁక నీవీయుద్యోగమున కనర్హుఁడవుగావున దీనిఁ ద్యజించినఁ గడు మేలు.

మంత్రి—(దీనతతో, స్వ) కటకటా, నేనయోగ్యుఁడనై కొంచమైనను యోచింపక
యేల యిట్లొనర్చితి. కడపట నాపనియే బీజువాజునట్టున్నది. (యోచించి)
అవును. అట్లేగదా, ప్రభువుల సేవ. వారిమనస్సునకు సమాధానముగ నడపని
వారిగతి నిర్గతియే. న్యాయాన్యాయవిచారణతోఁ బనిలేదు. అహా, మండ
లాధిపతికొలువు మండలాగ్రముమీఁది నిలువుకంటెఁ గష్టతరముగాదే.

ప్ర.—రాజదేవేంద్రా, నన్నివిషయమున మన్నింపవలయు. ఇక్కార్యము దైవికము. దీని
నన్యథా నిర్ధరింపఁగూడదు. అందునిమిత్తమునసే దీని గ్రహియింప నెట్టివారి
కైన నసంభావ్యమే. అయిన నపదానమున కాలోచనయేల.

ఆ. కడచినట్టి పనికిఁ గడుమనోవ్యథయేల?
రాచపాడి కెప్పుడు రాపు గలిగె.
నరులు తమపురాత నకృత్యఫలముల
నంద కెందుఁ జనఁగ నగుదురీశ. 36

అదటుండఁగా మీరీకర్మమొనర్చినందునఁ గాదే? భక్తవత్సలుండు శ్రీపాం
డురంగఁడు ప్రసన్నుండై తోఁతెంచె. అహహా, మీరెంతపుణ్యులు!

యశో—(విహస్తుఁడై) సచివా, నేనసమీక్ష్యకారినైనందుననే, నాకింత దావంతము
దొరసె. అయిన నిపు డీయపదానమునకై వితర్కమేల? ఏతత్కాలముననే
పురందరుఁడుగారిని నొకయాన్యయానమునఁ బండరీదేవాలయమునరయమునఁ
జేర్పుము.

మంత్రి—ఏలినవారి యాజ్ఞ. (నిష్క్రమించును.)

యశో—అహో, అయ్యనఘుని శ్రీకృష్ణభక్తవర్యుఁడనియుఁ నకృష్ణకర్మఁడనియుఁ
దెలియమి నేనింతదుర్నయమునకాలయమైతిని. అయినను శ్రీపండరీనా

థుండు దయాళుఁడై మన్నించె. ఆహా, ఆర్తసంరక్షణమందు వారిదయ వారి దయకేతరముగాని యిట్టి దని నిరూపింపఁ దరమగునా. ఆలస్యమయ్యె. ఇఁక నాలయమునకుఁ జనెద.

(నిష్క్రమించును.)



## షష్ఠాంకము.

### స్థలము I. పురందరునిగృహము.

లక్ష్మి—(డగ్గుత్తికతోఁ దనలో) చెల్లఁబో! ఏమి నాతలవ్రాలు. చిత్తము స్వాయత్తము లేక యుత్తలమునఁ దత్తఱిల్లుచున్నది. ఆహా, నాథా, మీ రేకాంగులయ్యును గారాబందీకృతులై పీడ్యమానమానులై పరిభూతులై స్వేచ్ఛావిహారోత్క్రాంతా విదూరులై యహోరాత్ర మిటులతపింప నే నెటుగని సహించుదాన. కటకట, సుగుణనిధులైన మీ కిపోరామి రాఁ గత మేమి.

క. తరపితి పతిథులలేవడి
నరిధరుడిం గరుఁడవయ్యు ని నరుసము విడి తూ
డరివలె నీవిఁక గుందక
హరిభక్తుఁడవైన భాగ్య ని మా, యెటులో ర్తున్.

ఓ పాండురంగా,

తే. నీదుపైఁ బ్రేముడించెడు ని నాదుభర్త
ప్రేముడించుచుఁ జెఱియందుఁ ని బ్రేముడింపఁ
బలుపరాకున నుండనీ ని భక్తవత్స
లతకు నడిరాదొకో? శ్రమకలం దొలంపు. 2

రుక్మి—(తల్లి చెంతఁ జేరి) అమ్మగారు, అణఁగారుఁడు. మాయందఱకు ధైర్యముఁ జెప్పఁగలిగియు నిటు శూన్యముఖవై యుంట మేలే? కర్మానుభవ మెన్నటికైనఁ దప్పునే? అయినను శ్రీహరి తనభక్తవరుల కీర్తి వెలిఁగించుపొంటె నిట్టిసంకటము సంకల్పించియున్నాఁడని జనవాక్యము గలదుగాన శాంతింపుఁడు.

భటుఁడు—(లక్ష్మీబాయితో) తల్లీ, దేవిగారు తమదర్శనార్థ మేతెంచియున్నారు.

లక్ష్మి—(సబాష్పముగ) ఇప్పిరో, నాబ్రదిమికిఁ దోడుగ రాజ్ఞిని సైతము చూడదమా. (రుక్మిబాయితో) అమ్మి, రాణిగారు వచ్చియున్నారఁట. తోడ్కొని రమ్మి. (మరల నుస్సురస్సురనుచు)

క. ఇల నే నెటులో ర్తస్మది
తలడిల్లుచు నున్నయదివె ! తారముచే నేఁ
డలవిధి నేమనవలె నొక
తలఁదఱిగిన యాశునాడఁ ! దగుఁగాకల్యాన్. 3

హా, దైవమా, అయ్యుమాపతి యాప్రజాపతి శిరంబులనన్నియుం నొక్కపెట్టు నసే యేల మట్టకపోయె ?

రుక్మి—తల్లీ, "విధిర్బలీయసీ" యనునది వినమే. లోకులు తమతమ పూర్వకర్మఫలములచేఁ గర్షితులై సుఖదుఃఖ మనుభవించుచుండ విధాతృని వృథా నిందించుట యసభ్యము. మఱియుం విధియే సృష్టికర్తయైనను దననే విధి విడువకపోయెఁ గాదే ?

మ. తనభార్యంగన సర్వభూతముఖవాక్ద ప్రౌఢిమ న్దేఱుటన్
దనసూనుం డగునారదుండు కలహాంశతర్యాతుఁడై తారుటన్
దనవాహంబెడఁ దన్నుఁగాంచిన సుపక్షంబు న్దినంగోరుటన్
గని శ్రీకంఠునికి న్విరించి వెతఁదాఁ ! గంఠంబు నర్పింపఁడే.

ప్రవేశము : శుభకీర్తి.

శుభ—(సవిచారముగఁ దనలో) అయ్యో, పాపము ! భర్తవిషయమై యీ కల్య కంటి కంటినీర్వావిఃలోఁ గడు నీఁదుచున్నది. అయినను శ్రీహరి తనభక్తులఁ బరిశీలింప నిటు కళవళపఱచి యావల పరిపాలించు ననెడిప్రచారము వీరి యందు సార్థకమయ్యె. ఎట్లున్నను నిపు డీమందయానకు హితోపదేశంబు నేసి యీ మెరయెడఁ దన్నమాశ్వసించెద. (ప్రకాశముగ) అమ్మా, లక్ష్మీబాయమ్మ గారు, ఇట్లు పరిపరివిధములఁ బరితపింపనేల ?

శ్లో. "హరిణాపి హరేణాపి బ్రహ్మణాపి సురైరపి
లలాట లిఖితా రేఖా పరిమార్ష్టుం న శక్యతే."

అనునది మీకు తెలిసియేయుండియుం నూఱడిలక పలుమారిటుతమారిలనేల ? వెండియు నార్యపుత్రులు క్షేమాత్ములని విశదమయ్యును మీరిటుల వందురుట కేవలాసంగతము.

లక్ష్మీ—(దీర్ఘనిశ్వాసములో) అయ్యో తల్లి, లోకమున మెప్పుగన్నవారిగతి యిటు

లౌనని యెవరైనఁ దలఁచిరా? మంచినోములు నోఁచనివారికి సౌఖ్య మెటు గల్గు. నామనంబిపుడు యథాయథ లౌచున్నది. నేనేమి సేయుందాన.

(అని రోదించును.)

శుభ—సాధ్వీశిరోరత్నమా, మీభర్తగారి కేమిన్యూనత లేదు. దుఃఖపడక వినుఁడు.

సాధ్వీవృత్తము:—

వారలు మురహారి । భక్తులపరిమిత । పంకవనవనవి । భావసులు౯
త్సారమణుఁడు వడి । మంజుతరళితవి । మానముఁ బనిచె స । మానమతి౯
వారణవరదుఁడ । వారణముగనిడు । వాసియు సురుచిర । వైభవము౯
సారసనయనుని । సారెకు వగచెదు । సాధ్విపారలునె? వి । షాదమునన్.5

ఇఁక నూఱడియుండుము.

లక్ష్మి—స్వామినీ, మమ్ముఁగాపాడెడు మీకోఁటివార లిటులేని సంగతులుదెలుప విసమానముగ నున్నది. ఇఁక వారిసంయోగముపై నాశ యెక్కడిదిగాని వారి దర్శనమైనఁ జేతవులునో లేదో యనుశంక గలిగెను. ఈజన్మమున నాకేమియు సోము కలిగియుండలేదు. ఇఁకఁ గలుగఁబోదు. "న భూతో న భవిష్యతి" యనునది నిక్కము.

శుభ—తల్లీ, అట్లు దలఁపఁగూడదు. దుర్దశారహితులైన మీభర్తగారుపడినసన్నమహాత్ములని రాజుగారే స్వయముగ నొక చతురంగయానముమీఁద వారి నప్పుడే తిరుమాళిగకుఁ బంప నపవాదంబు దయచేసియున్నారని నే నపవాదంబుగ నుడివెద. ఇంతకుమున్నే వారు గుడిఁ జేరియుందురు. నానుడి నానుడిగాదు. మీబత్తియుం దత్తియు రిత్తయగునే? మీ జననీజనకు లెన్నఁడు వైవాహిక కార్య మొనర్చిరోగాని నేఁడు శ్రీపాండురంగఁడు స్వీయకృత్యముగ నెంచి తన్మహోత్సవమొనరింపఁ గంకణంబూనెఁగాన మీపుణ్యమగణ్యము. మఱియు నీయుద్ధర్షము కన్నులారంగాంచు మాసుకృత మెంతసుకృతము.

లక్ష్మి—(స్వ) ఇదంతయుం నాధిదైవికము. ఈసత్యవతీసుభాషితము సప్రమాణము. (పరితోషించి) ఓ మాని మానసాబ్జభృంగా, సమస్తభక్తతమస్తమఃపతంగా, శ్రీపాండురంగా, నేవేఁడిన బల్విడి మద్భర్తను నెట్టకేని ప్రజ్ఞానోదయంబు గావించి ప్రసాదించితివి. వరాభయప్రదానంబుల భవదోషాపహంబుల భవదీయకరుణాకటాక్ష మవాచ్యమును నద్వితీయమునుగాదే. నేఁడు మదీయమనఃపీడనంబు మారుతోద్ధూత వారిదంబు డంబున నడంగె. ఈవే మాకు సదా శరణము,

పాదపవృత్తము:—

భక్తజనామరపాదప, యెంతో, రక్తిమదీయసరాగవరు న్న
ద్భక్తునిజేసి సఖాస్థలిఁజొన్పఁగ, దక్తఖలుండయిధాత్రిఁజెలంగెన్. 6

(ప్రకాశముగ) రాజ్ఞీ, మీమాట యథార్థము. ఇపుడు మనస్సు కోవెలకుంబోవ వేగిరపడుచున్నది. రండు. (నిష్క్రమింతురు.)

---

## షష్ఠాంకము.

### స్థలము II.

### పండరిపురీదేవాలయము : పురందరుఁడు.

పురం.—(కరకమలములు ముకుళించి ప్రదక్షిణించుచు)

మత్తేభవృత్త కందగీతగర్భసీసము.

సీ. భువిలయావాపవిభూత్యనిష్టనుదరు
ద్వేగంబువేదుల్పుగోగణాఢ్య
కువలయారాధ్య నిగూహానంబుచిత మే
వారింపవేళాము గారవంబు
వదలిపోనో నుడి వచ్చునో ననుగనం
దీనావనాథవ్య ధీప్రకాశ
దరలతావృత్తసుకాసతీముఖభవ
ప్రధ్వంసముగాజేయ రారవీర

తే. మురహరజనార్దనాభయ నిరయహరణ
దంతివరద నిర్జరసుఖ దాస్మరహర
సఖవర ధృతమందర శైల సలిలచరణ
సదమలగుణగణాశయ సదయహృదయ. 7

(ఇచ్చోట, మత్తేభమును "విలయా" యను పదమునుండియు, కందమును "మురహర" యను దానినుండియు నారంభింపవలయును. గీతి సాధారణము)

ఓ పాండురంగా,

క. చంచద్భవదంఘ్రుల వీ
క్షించితి రక్షింపు నన్ను గీతప్రవణా

వంచక రక్షో హారణా
సంచిత సంకాబ్ధితరణ ॥ సాధుద్రవిణా. 8

ప్రవేశము : యశోవర్ధనుఁడు.*

యశో—(పురందరుఁగాంచి కేల్మోడ్చి) భక్తాగ్రేసరా, నమస్కారము.

క. నిక్కలసుఁడి, నాకలమీ
యెక్కువ తక్కువలుసుంత ॥ యెఱుఁగమి గమినే
ముక్కారి యలఁచితిని మీ
మ్మక్కట, దోసమ్ముసై పుఁ॥ డమలచరిత్రా. 9

దేవా, భవన్మాహాత్మ్యము నెఱుఁగ కిటు లొనరించితి. అయినను భవదీయాలోకనంబున స్పర్శవేధిస్పర్శముచే లోహంబు మనోహరంబగు మనోహరంబగుచందంబున మన్మానసంబు నిర్మలతఁ జెందె.

పురం—రాజకుంజరా, మీరు భక్తాగ్రేసరులు కావుటం జేసి పండరీనాథుఁడు మెచ్చి స్వయముగ విచ్చేసి దర్శనమిచ్చి మచ్చిక ముచ్చటించి విచ్చేసె. భవత్కారణంబున సమస్తజీవోపాస్యుండగు శ్రీకమలామనోహరు పాదకమలముల నతి సుకరముగ నాకు సేవింపఁగలిగె.

యశో—అట్లుగాదు. ఈసేవకు మీరే కారకులు.
(పాండురంగనికి మొగంబుగనిలిచి యైదుపది చేసి)

ఉ. శ్రీహరి, నీదుభక్తునికిఁ॥ జెట్టనొనర్చితి మోహబుద్ధి నే
ద్రోహిని నాశ్రయించితిఁ బ్ర॥ దోషముసైఁపుచు నాదుజోతలన్
దోహలమూని చేకొనివి.॥ ధూతవిచారునిగా గ్రహింపవే,
కూహకుఁ డేని నిన్నుఁగని ॥ కోర్కులనొందఁడె ? యిందిరావరా. 10

స్వామీ, మదీయాపరాధంబు సహించి యీ భక్తశిఖామణుల మద్గురూత్తములఁ బ్రసాదింపవే.

పురం—(శ్రీహరికిఁ బునఃపునః ప్రణతిచేసి)

క. ఇనుఁడెంచం నింగనెహరి,
నెనరుంచం సంచుగాదె ॥ నీబిరుదము నే
వినిఁబెంచంగద, కరుణా
ధుని, నొంచందగదవర్ణ ॥ దూరుణాధీరున్. 11

(నారదునిగాన మాలకించి రాజుతో) రాజలలామా, మనకీ భక్తిప్రపత్తుల కాలవాలమును గంటిరే? అదిగో, విజయము చేయుచున్నారు.

ప్ర: నారదుఁడు.

పురం—వందనము. మునీంద్రా! భవదీయాగమంబు మమ్ముఁ బవిత్రీకరించె.

నార—(సోత్సాహముగ) పురందరా, నిన్నుఁ బూర్వకర్మము బాధింపుచుండినందున భూపాలునిపల్కుల నామోదించితివేగాని మదీయ దివ్యచక్షువుచే యథార్థము నారయక దివ్యచక్షువుఁబోలె వర్తించినందున నీకీ దురవస్థ సంప్రాప్తమయ్యె. అయిన నిందు చేవిగతకలుషుండవేగాక భవద్విఖ్యాతియు లోకవిఖ్యాతమయ్యె. ఇఁకమీఁదట సచ్చతుష్పథుఁడ వగునీకుఁ జతుర్భుజుఁడు చతుర్భద్రముల నొసం గుఁగాత.

యశో—నమస్కారము, యతిచంద్రా.

నార—శుభలీభవ, (భూపతి కరాబ్జమూని పురందరునితో) భక్తపుంగవా, మీ రెఱుఁ గనిధర్మవు లేను. కావున నీ రాజేంద్రునిపై వాత్సల్యము నెఱపుగ నెఱపుచు వీరికిఁ బరమార్థము బోధింపుఁడు. వీరు మహాభాగులు. అటుగాన నేనిటు వచింపఁగల్గె.

పురం—చిత్తము. మునీంద్రా, ఒక వితర్కమున్నది. ఈజీవాత్మ కెప్పుడు జీవన్ముక్తిగలు గునో తేటపఱచి నన్నుఁ గృతార్థుఁ జేయుఁడు.

నార—ఆహా, యీప్రశ్న లోకోత్తమమైనది. ఇక్కలికాలంబున నరులు తమ యా యుఃప్రమాణ మతిస్వల్పమని యెఱింగియు మాయాబద్ధులై తత్తల్పితామహా దిమరణాంతమునఁ బితృవనంబులఁదచ్ఛవముల గృధ్రకాకోలశివాదులపా లగుట గన్నులారంగాంచియు దేహమునిత్యమనియే యెంచి పామరులై కామాదులవద లక భవతాపత్రయములకు లోనై వారియాయువు వృథా నశింపఁజేయుచు భవాబ్ధిఁ దరింపలేక సర్వదాబాములఁ బడుచున్నారు. ఈతను వనిత్యముగాన జీర్ణవస్త్రముభాతి క్షీణించును. జీవాత్మయన్ననో, యెప్పటికి ధ్రువంబు, నశించు నది గాదు. మానవుఁడు యజ్ఞానముచే దేహాత్మభ్రమవలన దేహమునందే యాశ గొంచునవసానముననక్కటా! మృత్యువు సమీపించెనే యనియుం నిఁక భార్యా పుత్రులగతి యెట్లనియు దుఃఖించుచు జన్మలహరిలోఁ బడుచున్నాఁడు. జీవుఁడు ప్రాక్తనకర్మఫలముల ననుసరించి యన్యదేహమును దాను నూతనవస్త్రమును

ధరించుభంగిఁ బరిగ్రహించినను భక్తివైరాగ్యములకలిమిని గర్భనరక జరామరణాదుల వలననుండి శీఘ్రముగవిముక్తుఁ డగుచున్నాఁడు. అట్టి జీవన్ముక్తుఁడు తన ప్రియతమ మగుదేహమునుసంతసముననే త్యజించుచుండఁగా నిఁక స్వధనధాన్యజాయాత్మజాదులఁబరిత్యజించు టొకలెక్కయే. కావున సర్వము మాయామోహిత మనియెంచి దేహి తన దేహపాతమువఱకు నిర్మలుఁడై సజ్జనసాంగత్యమును సదా హరికల్యాణగుణస్మరణామృతపానము నొనర్చుచున్నచో నిరతిశయానందకరమును నాముష్మికసుఖదమును నగునిర్వాణముననాయాసముగాఁ గొల్లలాడుట కేలాటి సందేహముండదు. ఇఁక నే నేగెద.

(గానము సేయుచు నిష్క్రమించును.)

పురం—(స్మేరాననాబ్జుఁడై భూజాని చెట్టఁబట్టికొని) భూపాలా, అమృతతుల్యమగు వీరి బోధన మాలకించితే? ఇఁక దయచేయుఁడు. గర్భగృహమునకుఁ బోదము.

(నిష్క్రమింతురు)

---

## షష్ఠాంకము.

## స్థలము 111.

### ప్ర: గ్రామాధికారి: కరణము.

గ్రామా—మిత్రమా, ఈవిస్మయము గనుఁగొంటివే?

కరణ—ఏమది?

గ్రామా—పురందరునివిషయమై.

కర—ఓహో, అదా, నేనంతయు నెఱుఁగుదు.

గ్రామా—సరిసరి, అందుచేతనే పురందరునిఁ గలియుంగ కృష్ణావతారమని నుడువవలసియున్నది.

కర—అవునవును. లేనిచో నింతవింత యావహిల్లదు; గాని యతని తేజఃకీర్తులు సాక్షాల్లక్ష్మీసంకాశయగు లక్ష్మీబాయివలననే తలకొనెనని నాతలంపు. ఆహా! ఆసాధ్వి కెవ్వరీయుర్వీలోక!

గ్రామా—మనరాజు చేసినయక్రమ మామె యెఱుఁగదుగాఁబోలు.

కర—ఎఱిఁగియున్న నేమగునో! రానున్నగతి. ఆమెను నీరుగ్రమ్మినదిప్పుని రాజు నకుఁ దెలియదు.

గ్రామ—తెలిసిన నిటునేయుంనే? అయినఁ బురాకృతము ననుసరించిగదా, యేదియుఁ జరుగుచుండును.

కర—సత్యము. (తిరిగిచూచి) ఓహో, ఆపాలకిలోఁ బోవుచు స్వస్తరుణింబోలె ద్యోతించుచునా సాధ్వీమణి యెవ్వరో!

చ. ఘనవిధి నీశుఁడేఁచు టొక । గారమెయంచు గమించువాణియో!
తనవిభుఁడేగెఁ బుణ్యజన । దానముకై యనియెంచు హీరయో!
కనలి నిజేశునీశ్వరుఁడు । కాల్చెనటంచు సరించురామయో!
వినుకలికంటిచెల్వయొ! భు । విన్గలరే? యిటులొకనత్సతుల్. 12

గ్రామ—(నిదానించి చూచి) ఎఱుఁగవే? ఆయమ్మగారే, లక్ష్మిబాయమ్మగారు, గాని యామెపిఱుంద వేడొండు యానమునఁ జనువారెవరో!

కర—(కాంచి) ఆమె రాణివాసిగ నుండునటున్నది.

గ్రామ—(మరల లక్ష్మిబాయి నుద్దేశించి) మిత్రుఁడా,

తే. కను మహా! యాపతివ్రతాళిననపురుచులు!
కోటి కౌముదీ ప్రియులను । నోటువుచ్చు.

కర—

కాంచవే? సాధ్వియణజ్యోతి । గాజువాఱుఁ
గాని తతిఁబ్రజ్వలింపకే । కరణినాఱు. 13

మనమిపు డాపతివ్రతల కభిముఖులముగాక నూరెలిగిన మేలు. రమ్ము.

(నిష్క్రమింతురు.)

---

పండరి దేవాలయము.

ప్ర: లక్ష్మిబాయి; శుభకీర్తి.

లక్ష్మి—(మే పులకరింప శ్రీపాండురంగనికిఁ గైచాఁపులుచేసి)

సీ. ఆర్తరక్షణ బిరు । దాంకుండనఁగనేల
ఘనునిభనాథుఁ గాచినదెసాక్షి,
పతితపావనుఁడంచుఁ । బ్రకటింపనింకేల
దురితుఁ డజామిళుఁ । డరయసాక్షి,

అనుజీవులనుగాచు నసఁగఁ బ్రహ్లాద వి
దురులును వాసవా ద్దారలుసాక్షి,
భక్తాంగనాత్రాణ ప్రౌఢిమ గననేల
జ్వలదహల్యయును ద్రౌపదియుసాక్షి.
తే. ఇట్టులంచును దిట్టలై ల్లెడలఁజాటఁ
జాటుపడనేల ? మమ్ముజే వాటునుంచి
చేరగడసేయవే భవచ్ఛిష్టపాల
నాసుదీక్షానియతికి భంగంబురాదె. 14

చతుర్విధకందము:—

తే. వనపాద నేఁడునీయడి, యనికిణ జగబత్తిఁగఁఅపినంతనె యగురా!
ఘనపాప పుంజమంగద,తనికెణ వగలేక నీదు తత్త్వమునెగడెన్.15

(ఈపద్యమందలి గర్భద్వితీయ, తృతీయ, చతుర్థకందములను వరుసగా "జగబత్తి", "ఘనపాప", "వగలేక", అనువానినుండి యారంభింపవలయును.)

(భర్తన్‌గని, సానందయై) ప్రాణనాథా, దైవ మిటులవిధింప నెవ్వరు నిరోధింప సమర్థులు? తొల్లింటిదంట లెన్నియో బన్నములఁ బడరె ?

తే. రాజు వలరాజు సురరాజు రాజరాజు
తేజుగల పాండవులు నలరాజు చిదక
లంకుఁడు జితేంద్రియుండుత్రిశంకుపట్టి
జడిఁగనరె? దైవహతికి భేషజముగలదె? 16

అయిన నీ కరుణాశ్రీయగు వాసుదేవుఁడు కృపచే సర్వత్ర భవత్కీర్తి కాంతో జ్వలమునకై యిటు గావించె. ఇందుచే విరాగులగు మీపరాగము విరాజితం బగుచున్నది. స్వామీ, ఈరాణిగారు దుఃఖాబ్ధినీఁదు నన్ను సాంత్వవచనంబుల మీసువార్తలన్దెల్పి నిల్వరించినందున మచ్చిత్తము స్వస్థతనొందె.

పుర—ప్రణయినీ, అమితాహ్లాదమయ్యె. ఈ తల్లిరాజ్ఞిసంగతి చెప్పవలయునే? ఈమె యంతఃకరణము నవనీతముగాదే ?

రాజ్ఞి—(లక్ష్మీబాయితో) పద్మముఖా, ఇపుడు హృన్మోదమయ్యెనా ? ఇఁకనైన మదీయవాక్యము విశ్వసనీయమే ?

లక్ష్మి—(సస్మితాస్యయై) సమయోచితముగ భాషింపవలసి వచ్చినదేగాని కేవలాన్యా మంటినా? సరి, దయచేయుఁడు. (నిష్క్రమింతురు.)

---

# షష్ఠాంకము.

## స్థలము IV. కోలాపురి.

ప్ర: సరస్వతిబాయి, అమృతరావు, పురోహితుఁడు.

సర—అమ్మచెల్ల, ఓపికతో రాత్రి రెండుజాలనుండి యింతపర్యంత మిప్పనిసేయుచు సేదదీరఁగ నిప్పటికి సంబళింపనాయె. (ప్రాల్మాలికచే నాసీనయాచున్నది)

అమృ—(విని) ఇదొకతేలికమా? కార్యసాధనమందుఁ బౌరులును విందులును సాదన మఱియు నాలోకించువారు నాకర్ణించువారు ననాదు, తగినయాడుజోడు, బల్బాగుగనున్నదని యనుకొనునటు లంతయు సంతరించినఁ గాదే, కార్యము తీరసెనని వచింపవలయు.

పురో—(అమృతరావుతో) వివాహకార్యమునకై క్షేమమునఁ బోయి లాభమున రండు.

అమృ—అంతయుఁ దమ యాశీర్వచనముగాని కర్ణుఁడులేని భారతమా?

పురో—(హాసనములో) సరి, అట్లయిన నేనుసైతము మీవెంట వచ్చెద.

అమృ—ఎవరోయి, భటుఁడు.

భటు—హజారము గాచియున్నాను, దేవా.

అమృ—సామగ్రి శకటములు పదిలమే? బంధులకుఁ దగినకంతీరథములరథములఁ గట్టాయితము సేయఁబడెనా?

భటు—చిత్తము. బంధుమిత్రాదులకు ముందిరుమైల నందలంబులనరదంబులను వాని మధ్యమునఁ బెండ్లికొమరుని కొకపాలకియును దానివెనందమ యుభయుల కాందోళికాద్వయంబును నాయితము చేయఁబడియున్నవి. అన్నిటికివెనుక సేవకు లేలినవారియనుమతిఁ గనుపెట్టుకొని యున్నవారు.

అమృ—మంచియేర్పాటు.

మిత్రులారా, మీరెల్ల రాలకించి యాలకింపుఁడు.

క. తమినను గనుఁగొనుచును వి
యమ్యములనుగల గలపునఁగని కి యభిచరులయి సం

భ్రమమున నుపయమమునకుఁ
గమనమగుఁడని వినయనయశ్రీ గతులవినిచెదన్. 17

(భార్యతో) ఏమి, అగసాలె యిప్పటికిని నగలు తేఁడేల?

సర—ఏలనో, తెలియదు. మొదటనే, నే సైద్ధాయులవారిని నమ్మఁగూడదని చెప్పితిఁ గాదే? తన భార్యాభూషణములోనే, యాపద్భాగము కైనను దోఁచుకొన యత్నించునగసాలి మనల మోసపుచ్చుఁ డనిచెప్ప నీలగునే?

అమృ—(కుమారునితో) పుత్రా, ఇఁక యానం బారోహణము సేయఁబోము.

విద్యా—(సాశ్చర్యుఁడై) జనకా, ఏల?

అమృ—ఎఱుఁగవా? నీకు వివాహమని.

విద్యా—(సంతసమున మానముగ నుండును)

అమృ—(స్వ) సుతున కిది సంతోషమే. అట్లేగదా? బ్రహ్మచారికి వివాహమన నామోదమును, గృహికి "అయ్యో, ఏల గృహస్థుఁడ నైతి" నను నమోదమును గలిగి యుండుట. (ప్ర) శీఘ్రమ్ము పొమ్ము. ఏల తామసము.

విద్యా—అట్లే, జనకా, చూచితివే, హేమకారానీతాభరణంబులు. నే వీని కాచ్చో నుంచెద.

అమృ—ఓహో, అందుకొంటివా? సమయమున మోసమాయె ననుకొంటి. మంచిది, ఎచటనుంచుటకుఁ గైకొంటివి!

పితామహి—(ఊఁగాడుచు) ఓ బిడ్డఁడా, నీబిడ్డ యవ్యక్తుఁడుగ నగబడినను స్వకార్యమున నెంతవ్యక్తుఁడో గను. తెలియదా, తనభార్య కుపయోగింపవలయునని.

అమృ—(హాసముజనింప, భార్యతో, కంటివే?

ఆ. ఇంతి, నీకుమారుఁ డిప్పటినుండియే
భార్యకొఱకు నింతపాటుపడుట

సర—(అవును. ఇది యందఱికి సహజమె)

మున్నవచ్చు కర్ణములకన్న వెనుదన్ని
వచ్చుకొమ్ము లెప్డు వాఁడిగావె? 18

అమృ—అహో, ఇప్పుడే యిటున్నదే! ఇఁకఁ బరిణయానంతరము మనము దృష్టిపథము గామంగాఁబోలు.

సర—అయిన నీసొమ్మువిషయమై మీరు వల్మరు ప్రస్తావింపకునికి కడుమేలు.

పితామహి—కొమారుఁడా, నీకొమరుఁడు గాఁడా, మఱెక్కడనుండి వచ్చె? ఏయే కాటిపులి కాయావన్నె యుండకున్నే?

సర—(భర్తతో) నాథా, తెలియునే, అత్తగారు మీర లీప్రొద్దు స్రొత్తవారుగారని. ఇఁక నిర్గమింపుఁడు. లగ్నము మించిపోవును.

(పుత్రునితో) పుత్రకా, అభూవు తెచ్చి? ఇమ్ము.

విద్యా—ఇదిగో. (ఇచ్చును)

పురోధ—అర్ధరాత్రము కావచ్చినది. అప్తులందఱు ప్రయాణోన్ముఖులై యున్నవారు. బాకాదిశోనులు సనవలయును. వాళావాళిగ లెండు.

"లాభ స్తేషాం జయ స్తేషాం కుత స్తేషాం పరాభవః."

ఎవరురా, మేళగాండ్రు. వాయించుఁడు, వాయించుఁడు. అందఱు రండు.

(నిష్క్రమింతురు.)

---

## స ప్త మాం క ము.

### స్థలము. 1. ఆస్థానము.

వందిమాగధులు— (సింహాసనాసీనుండై సచివనందనసభ్యుండగు యశోవర్ధనమహారాజుంగని.

ఉ. రాజదమిత్రగాజ మృగరాజ, మహావసురాజరాజ, వి
భ్రాజదమోర్య తేజ, నతరాజక, భోగబిడౌజ, వామవా
మాజితవామతాతచరణాబ్జవినోదవిధాన, కీర్తి స
ద్భోజ, సుధీసమాజసురభూజ, సువిగ్రహనిర్జితాంగజా.

యశో—(సచివునితో) ధీ సచివా, మనరాష్ట్రంబున సకలపురజనసామంతపరిజనంబులకు మంగళమే?

సచి—అందఱు సుఖమువ్నారు, ప్రభూ.

యశో—సంతసము. మన రాజ్యమహిభయరాహిత్యమే?

సచి—అవును. ఇప్పటి కట్లే యున్నది.

యశో—సరి. మఱియు నరాళి జారచోరలినిరపాయమే?

సచి—చిత్తము, ప్రస్తుత మీాలిలేకున్నది. ఉత్తరోత్తర మెట్లో.

యశో — నిరీత్యాదులచే నమితాహ్లాదముగాని,
సచివా, మనసేవకప్రభృతులు తత్తన్నియమితకార్యములఁ జక్కఁగఁ జేయు వారలే?

సచి — చిత్తము. ఆక్షేపమే లేదు.

యశో — (ఆస్థానపండితులం గాంచి) భూసురగ్రామణులు, భవదీయాశీర్వాదముచే నేఁటివఱకు శ్రీకరముగను సుమనోహితముగను రాజ్యపరిపాలన చేసి నేఁడు మదీయపుత్రునిఁ దద్భారధురంధరునిగఁ గావించి తీర్థయాత్రలఁ జేయఁదలంచితిమి, గావున మీరు మత్తనూజునందును దద్వాత్సల్యముంచి మన్నియగ మన్నించి దయాళురగుదురని విన్నవించెదము.

1. వ. పం — ప్రభూ, సదా మీ యాజ్ఞానుగతుల మయ్యెదముగాని మాక్లేశంబులఁ దీర్చుభారము మీదిగాదే?

తే. శిష్టరక్షాభిలాషి సకీర్తిలుఁడవని
జానివౌ నీదరిఁజనవె, సదహితములు,
కలదె, రాకాసుధాకరా గమనకలన,
నందతమసంబు, విచ్చు మెఱగ్గొనుగాక. 2

యశో — (సుతుని కెంగేల్పట్టికొని భూసురులంజూపుచు) కుమారా, ఈవిచక్షణవిచక్షణుల వీక్షించితే? వీరు షడ్శాస్త్రప్రవీణులును షట్కర్మనిరతులును సద్గుణభరితులును వేదవేదాంగోపాంగపారీణులు నవిద్యోదాకరోత్తారకులు నగు బ్రహ్మవంశోద్ధారకులు. అత్యంతపారమార్థికులు.
(క్షత్రియులంజూపి) ఈ రాజన్యులంగంటే?

సీ. గోత్రేశ్వరులుగాని గోత్రేశ్వరులుగారు
తగఁబోల్పఁబటుధామ ధామగరిమ,
* రాజేందులేగాని రాజేందులావీరు
దరిఁబోల్పఁబరదాన దానమహిమ,
ఇన సూనులెగాని యైన సూనులుగారు
తారోల్పరుగ్ధర్మ ధర్మపటిమ,

* "రాజా ప్రభౌ నృపేచంద్రే యక్షే క్షత్రియశక్రయోః"
అని విశ్వము.

అచలేశజులుగాని ౯ యచలేశజులుగారు
ప్రతిసేయరు గ్రస ౯ రసనిషక్తి,

తే. సత్వవిజితద్విషద్వరుల్ ౯ సమధికాభ్ర
శైలధీరులకూపార ౯ సమగభీరు
లనఘులు పయోధరోదారు ౯ లనఁగఁబరఁగు
రాచసింగముల న్గను ౯ రాకొమరుఁడ. 3

పుత్రా, ఇదె,

మ. దరచక్రావసులున్ సుధర్మక్రములుం ౯ దార్ఢ్యప్రదోషాచరుల్
స్ఫురదర్చార్ద్రిరతుల్ సదభ్యుదయులుం ౯ బుంభావవైరిభస
ద్ధరులాభా సుకృతావరీణకమలై ౯ కాధీశసూనుల్ల స
ద్ధరివంశుల్ ద్యుతిలోకబాంధవులు నౌ౯ధాత్రీశులంగాంచుమా.4

(మంత్రుల నుద్దేశించి) వీరల నిరీక్షించితివే? వీ రంగపంచకవేత్తలును సుగుణ సత్తములు నగు సచివోత్తములు.

ఇదిగో, వీరిం గనుము; వీరు సంతతము షడ్భాగంబుల సంతసమునఁ జెల్లించు శ్రీమంతులు నతిధీమంతులు నధికబలవంతులు నగు సామంతసంతతులు. వీండ్రంజూచితే? అహితధ్వంసనానారతధృతసాయకులగు చతురంగనాయకులు. ఈపడాలులు జన్యంబుల నెట్టిదిట్టలనైన భంగించులకోరిలచేఁ బొంగారి కంగారుసేయుట గడుసింగారము; వెలివారియం దీగారము బంగారము. ఏతదార్యుల సముద్వీక్షించి భవద్రాజ్య లక్ష్మీ సామ్రాజ్యము వెలయఁ బ్రజాపాలన మొనర్చుచుఁ ప్రఖ్యాతి వహింపుము. వెండియుఁ గవిసుముఖశిఖామణులయెడలఁ గుకవులవలె రంధ్రాన్వేషణ సేయక స్నిగ్ధతఁజూపుచు నుత్తబహుమానంబుల వారి న్దనుపుచుండుము. మాప్రవహము నీకప్పుడే విశదీకరించితిమి గాదే?

రామభూ—(విని నివ్వెఱపడి కొంతపడికి ధైర్యమూని)

జనకా,

సీ. అతిసుఖవాసులై ౯ నట్టిమూత్రపితల
సంసరణంబు వి ౯ షాదకరము
గానిసుమంత్రులు ౯ కార్యయోచనలందు
రాజబంధులు సమ ౯ రంబులందు

బాడబగ్రామణుల్ కి స్వస్తికార్యములందు
సామంతులధిపుని కి సౌఖ్యమందుఁ
బౌరజనంబులు కి ప్రబలురాష్ట్రాధీశు
పాలనమందు స కి ద్భక్తితోడ
తే. నుండుటం జేసి మీాతన కి యుండుశౌరి
కరుణ నేలినవారి స కి త్కరుణఁ బ్రజలఁ
గాపుగడ సేయనే లోటు కి గలుగు ? కర్మ
సాక్షికులసరిత్పతిసోమ కి సార్వభౌమ. 5

యశో—(హాసించుచు మరల నమాత్యాదులం జూచి) మీరందఱు వలయుసాహాయ్యము సేయుచు నధిష్ఠాతలై యుండనుండ నీ కేలోపముండదు. ఇఁకఁ బని వినుము.

(పారిషదులతో)

క. మీాదీవన నిందనుక
న్నేదీవస మగ్గలింప కి నిరవగ్రహసం
పాదితమా నాడేలితి
నీదారకునింక నాద కి రింపుఁడు వేర్మిఁ. 6

ఈకుమారు నిపుడు ప్రాభవభారైకధుర్యప్రభావునిగఁ జేసి యాదరింపుఁడు. ఇఁక మా ప్రచారమునకుఁ దగినయేర్పాటు చేసికొనవలయు.

1. భూసు—(చింతిల్లుచు) రాజేంద్రా, మీా ప్రయాణము మా కనితదుఃఖకరముగ నున్నది.

యశో—మీాకుఁ దెలియనిస్మృతి యరుదు గాన మీారిందుకై పరితపింపక పరితోషింపవలయు. దీని సారెసారెకుఁ బ్రస్తావింపఁ బనిలేదు.

2. భూసు—రాజకుంజరా, మాకేలికయగు భవద్వియోగ పరితాపంబు దక్క వేఱొండుతాపంబు లేదని మనఃపూర్తిగ విజ్ఞాపించెదము. తమయాజ్ఞ శిరసావహించి యేలినవారిసుతుని సుతునిగఁబరిగ్రహించెదము. మీా పుత్రరత్న మాచంద్రతారకము రూపగుచు మాకుఁబ్రాపగుచు నేల నేలఁగలఁడని సేమము జేపెట్టుచున్నాము.

యశో—అమితానందము. (నిష్క్రమింతురు)

1. వ. భూ—(తక్కినవారితో) చూచితిరే! ఈ రాజసూనుని. చిఱువయసునుండి యీతని నే నెఱుంగుదు. ఇతనివలె సుకర్మములఁ జేయుచు మాతాపితలయెడలను గురుదైవములయెడలను నెంతయో భక్తివిశ్వాసముల నెఱపుచు స్వపరకార్యములయందు సమభావము గలిగియుండువాండ్రు కట్టరుదుగదా.

వేతాళుడు—అవునవును, అరుదే! ఇఁక రండు. (అందఱు నిష్క్రమింతురు)

---

## సప్తమాంకము.

### స్థలము ii పురందరుగృహము.

పురం—(లక్ష్మీబాయితో) ఓ నవలామిహి, ఈలోకంబున సాధారణముగ ననేకులు దుర్విధులై దుర్విషయవిపథిలో నేమి, దుస్తరరోగతరంగములలో నేమి, దురంతకష్టఫేనంబులలో నేమి, కడుఁద్రుంగిలి దుర్మరణపంకాదులపాలగుచున్నారు. కావున నీసంసరణసహ్యాం బసహ్యాంబుగాని సహ్యాంబు గాదు.

లక్ష్మి—స్వామీ, నేనిది మున్నే మనవిచేసి యుంటిగాదే!

పురం—కనుక నే కిష్కింధాపురీసంచారము నన్ను వేగిరపెట్టుచున్నది గాన నేఁ జనెద. మదీయభాషితము లాలించి నీవింట నెమ్మదిగ నుండు.

లక్ష్మి—(స్వ) భక్తిమెయి నిప్పటికి వీరికీతలఁ పెలసె. మహానందముగాని యిర్యోదన స్నెడఁబాయునట్టు నుడువుచుంట గన నాకెంతయో చింతగనున్నది. అటులైన నా కిందేమి సుఖము.

(ప్రకాశము) నాథా, అమితాహ్లాదము. అయిన నొక చిన్న విన్నపమున్నది.

సంవాదసీసము:—

లక్ష్మి—ప్రాణసఖా, నన్నుఁ జె బాసి యరణ్యసీ
మల మలయుటకెటు జె మలయుమనము

పురం—ప్రాణసఖి, సతు జె ల్పతులవెన్నడిఘోర
వనములమలఁగుట జె వలఁతిగాదు

లక్ష్మి—నాథ, వైదర్భి చం జె ద్రమతి సీతాదేవి
వనిఁజరింపరె? వేడ్క జె వరులతోడ

పు—నుడివడెదవు సుమా, జె సుంతేనిగారింప
నామనమొప్ప దజె దేమొకాని.

—అయినఁ దగదింక మిథ్యాసు ◊ ఖాబ్ధినీద.
—ఏల నీవిప్రలాపముల్ ◊ చాలు చాలు.
—విడుతురే ? భార్యలను భర్త ◊ లొడుదొడుకులఁ
పు—గడవ నగు, నేరి కీభువిఁ ◊ గర్మఫలము. 7

లక్ష్మి—కృపాకర, సతీవిచ్ఛేదము పతి కొచ్చముగాదే ? మఱియుఁ గిష్కింధా పురిఁ గనుఁగొనవలె ననునాస నన్ను సంభ్రమింపఁ జేయుచున్నందున నేఁ బ్రతివాస రంబూసరం బగుచున్నదాన, గాన నన్నలుగులమఁసలుపక నిభ్బరికించి యొ క్కటఁ గొంపొండు. కొండొకనేపైన మిమ్మెడఁబాయు నాయసుధారణ మసదుగదా. (అని కన్నీరుగార్చును)

పురం—అబలా, ఉమ్మలిక యేల ? కాఱడువులఁ గ్రూరమృగోత్కరంబు కరం బబరి మితంబు. తదుత్పతితకర్ణకఠోరభీషణార్భటులు విభీషణములు. కావున మద్వాక్య మాలించి యీనీ నిశాంతమున నిశాంతముగఁ నధిష్ఠింపుము. లేని యా యాస మేల.

లక్ష్మి—(ఆయస్తచిత్తయై) మహానుభావా, అన్యత్ర మీవగ తగువగగాని యిపుడు నావగవగ దెంపఁజాలదు. నేసదా మీ యథిష్ఠాత్రినిగాన మీవెంటరా నా కాయాసమే కాని యెట్టియాయాసము లేదు.

క. అనఘా, కన్నడ సేయక
మనవిని గైకొమ్ము నాదు ◊ మంద్రాటము వే
చను నాయక, కనుమూయక
ననుఁబాయక కీర్తికాంత ◊ నయముగఁ గనుమా. 8

తే. నన్ను మన్నింప మీరాయంఘ్రి ◊ లెన్నికొంచు
వెన్నడించెద మిమ్ము నే ◊ వేడ్కమీఱ
భాస్కరునీడి లిగ్నంబు ◊ బడలిరైన
నరుగదే ? యంటితన్ను న ◊ స్త్రాద్రికనఘ. 9

పుర—హరిణనేత్రా, ఈజిగిమిష నేలవర్జింపవు ? అయ్యో ! చరణమునకు నీచరణము హరిణీగతి యుంరవణించినను దిదాశ్రమమార్గము లాశ్రయములవంటివియే ?

ఉ. దారుణఖడ్గసూకర మ ◊ తంగజసైరిభ భల్లశల్య నా
నారజ నీచరద్విరస ◊ నప్లవగాది వికీర్ణముల్ పరీ

సారవనాటకోటి కృత । సాహసఘోర వికారకారికా
ధార నికుంజపుంజము లు । దగ్రచమత్కారు నివాసకుంజముల్. 10

మానినీ, కాన దురాసదముగాన మదీయహితవచనంబు మానసించి నీయుద్యోగము మానుకొనుము.

లక్ష్మి—నాథా, ఆ దావంబుభావంబున కెంతదావంత మావహించినను దమపదాంబుజంబులు నామనంబున నాటియున్న కతన నేఁ దమ కెడననుంటఁ దలఁకొంటి.

క. ఘనముక్తాస్ఫోటంబెడ
ఘనముం వృష్టికినమించు । కట్టడ నకటా!
మననేప్సాసఫలతకై
వినయంబున వేడ నిట్టికవిద్దూరంబే. 11

పుర—(స్వ) ఈమంజువాణికి మంచిసందు దొరకినది. అవును. అట్లేగదా, పతివ్రతలుండవలసినది. సుధాంశుని రోహిణివాసి చనునే.

ప్ర—ఏమి, నీకురా నభిలాషయేనా! ముమ్మాటికి.

లక్ష్మి—ఆ, సందేహము లేదు.

పురం—ప్రేయసీ, అయ్యో, రావలవదని పేమారు బోధించినను వినవైతివి.

తే. గృహిణి, నిన్ జ్యేష్ఠ గేలిఁ । బ్రే । రించెఁగాని
యిందుముఖులను జరియింప । నిచ్చునె? వనిఁ
గ్రూరకాసర శ్వాపద । క్రోడభుజగ
సామజశ్వావి దచ్ఛని । శాటకోటి. 12

నీకెంత ప్రబోధించినను వినక వెంటరాఁ దలఁచెదు. సరి. ప్రయాణించుటకు సిద్ధముగనుండు. ఆదట న గ్గరాళింపకు.

లక్ష్మి—(సంపుటాంజలియై ముప్పొంగి) ప్రాణనాథా, గోత్రధరుగోత్రావలోకనమే పదురునఁ గదురునో యని పదురుచుంటిని. మీకటాక్షమున నాతలఁపునుగల మయ్యె. ఇఁక భవత్పాదచ్ఛాయ కెప్పటికి న్యాయను.

పురం—(కుమారులతో) మీర లలసులుగాక మీమీవ్యాపారముల సవరించుకొంచు నతిథిసత్కారంబు లొనర్చుచు బీదసాదుల నొకకంటఁ గాంచుచు శ్రీహరి ధ్యాననిష్ఠాపరాయ త్తచి త్తంబునఁ గాలంబుగడపుచు మోదమానమానసులై సుఖంబున నధివసింపుఁడు. (జామాతతో) విద్యాసాగరా, నీవు సుగుణివి, సుజ్ఞానివి, సుబోధకుండవు గాన నీకు విశేషబోధ్య మేమియు లేదు. అయినను బిడ్డలయందు కేషస్నేహభావము కొఱపుచుండుము.

(కుమారితో) అమ్మా, మేము కిష్కింధాయాత్ర సేయఁ దలఁచితిమి. నీవు పెద్దలసుద్దులాలించి భర్తననువర్తించి నీనెలవున నెలవుగ నెలకొనుము.

రుక్మి—(చింతిల్లుచున్నది)

పురం—(రుక్మిబాయితో) తల్లీ, ఉల్లాపము లేల? సందర్భమున సన్నిహితులై మీ యన్నలున్నవారు. వెండియు నిన్ సంభరింప నధికశ్రీమంతుఁడును ధీమంతుఁడు నగు నీవరుం డున్నవాఁడు.

క. మదినదవదవదలుము, నీ
కుఁదగిన వరవరువిధాత ◊ కూర్చెఁ ఘనసం
పద యిదె, తొలునోముులఫల
మదంత్రముగఁ జనునె? సత్కు ◊ లాంగన కవనిన్. 13

లక్ష్మి—(సుతను సంశ్లేషించి) నాముద్దుపట్టి, సమాగత శుభోదయసమయమున వగవఁ దగదు.

(భర్తతో రహస్యముగ) నాథా, ఈముగ్ధ మనవియోగానలజ్వాలల నెంతయో సంతాపిత యగుచున్నది.

(సవిచారముగ, సరస్వతిబాయిన్గని) వధూనికా, ఇవ్వధూటికా రత్నముస్గూర్చి మీకు మాపెను పెఱుకయయ్యే యున్నదిగాన విస్తరించి వివరింపఁ బనిలేదు.

పురం—అక్కగారు, ఈ మాబొట్టెను మీచేతఁబెట్టి సనుచున్నాము. దీని నెటు గాపాడెదరో.

సర—మీదుహిత కెట్టియనర్థ మాపాదిల్లదు. మీరీ జలజాక్షి న్గక్షింగంటిరి. నే నక్షింగనియెద. నావెంపుమీఁదట మీకేయింపగు. మీడెంద మానందభరితమగు.

పురం—(జయరావుతో రహస్యముగ) పుత్రా,

ప్రియంవదావృత్తము:—

పరమభావుకము ◊ పాటిలంగనా
దరముదక్కఁగ సు ◊ తామతల్లికన్
దరలఁజేయు, మది ◊ తల్లడిల్లియేఁ
కరుసు, బుచ్చు వెను ◊ కన్ బ్రియంవదన్. 14

ప్రియంవదను నీయనుజకు బాసటగ శ్వశురాగృహంబున నుండునటుల నియోగించినఁ గడుమేలు. మఱియు నీబిడ గాయక మెఱుఁగనిదిగాన నీమెకిచ్చిన సౌధాయుకంబంతయుఁ బదిలముగ నెంటనంపుము.

జయరావు—అట్లే, ఏర్పాటుచేసెద, తండ్రీ.

లక్ష్మి—(పుత్రిక నాలింగనముచేసి) నా బంగరుబొమ్మ, నీసహజాదులు చేరుగడఁ జేరుగడగనుండ శోచనమేల? నీవు సత్వగుణధర్మవృత్తిచే నీయత్తగారియింట నభేదముగానున్నచో నీకేమియు బాము గలుగదు. నీకొసఁగిన తగవంతయు జాగరూకతగ నుంచుకొని యుందిలకొనకుండుము.

మఱియు వినుము.

సీ. భర్తతో మాఱొక్కని § పలుకకు మత్తమా
మలకు శుశ్రూషలే § మఱకుమమ్మ
హీనకాంతల పొందు § మానుము గయ్యాళి
తనమును మాను పె § త్తనముఁ బూను
వనదేవతలకుఁ బె § ట్టినరీతి వరునింటఁ
బుట్టులకుం బ్రీతిఁ § బెట్టవమ్మ
వారికివీరికి § భాగ్యంబు గలదంచు
గుటకలుమ్రింగకు § కుడుపుముందు
తే. నేయ కెవ్వేళ నవ్వకు § సిగ్గువిడకు
మురివవలె నెంతసేరగైన § నోర్చిపుట్టి
నింటికేగాక మఱిమెట్టి § నింటికపుడు
వన్నెఁదేవమ్మ, నన్గన్న § చిన్నిపట్టి. 15

అమ్మా, నీవిట్లెయి నడచుకొనుచు నెల్లరకు నల్లారుబెల్లమై నీచెలవున నెలకొనుము.

పురం—(తనయం దగ్గఱఁజేర్చి యాశ్వాసించి) మత్ప్రియాత్మజా,

తే. తొల్లి యనసూయ మొదలగు § తల్లులెల్ల
పతులనే విశ్వసించి ని § ర్వాణగతులఁ
గనరె? నీకాంతుదైవము § గాఁగను, పతి
భక్తియేసుమ్ము, సతులకు § ముక్తికిమ్ము. 16

వేఱొం డాలకింపుము.

తే. అవని రఘురామునకు జాన § కివగనాయ
యాలివిభునకు శర్మిష్ఠ § భాతిమించి

నీవు భర్తకు బహుమాన । వైవిశిష్ట
పుత్రకాయుష్యవృద్ధి సం । పూర్ణవగుము. 17

స్మి—(తనయులతో) తండ్రులారా, ఈసూనను మీసూరెల నుంచిపోవుచున్నాము గానఁ గంటికిఱెప్పఁబోలెఁ గాపాడవలయును.

జయ—(తల్లితో) జనయిత్రీ, అట్లే మీయాజ్ఞానుసారుల మయ్యెదము గాని మీరు మాకెవ్వరియందుఁ జూపించిపోయెదరు ?

లక్ష్మి—మీ కేసహాయత పనిలేదు.

తే. మీకుఁ గలుగదున్యూనత । మేము మగుడ
వచ్చువఱకును గృహభార । వాహులగుచు
నతిథు లభ్యాగతులకు స । మ్మతిదలిర్పఁ
గుడుపుచు సుఖమ్ముఁ గుడువుఁడు । కోర్కి మీఱ. 18

(అందఱు నిష్క్రమింతురు)

---

## అష్టమాంకము.

### స్థలము 1. గ్రామోపాంతము

ప్ర : మంత్రిప్రభృతి పండితప్రముఖులు.

మంత్రి—(పండితులతో)

తే. రాజులన్ శూరరాజన్య । కాజిచేత
రాజరాజాబ్ధకానీన । రాజులం వి
రాజిలుం గాదె ? భువిమన । రాజజస్ర
రాజదంహాలి రాజిరా । రాజులోడ.

కంటిరే, అట్టియవక్రభుజపరాక్రముఁడైన మన మహారాజుగారి యభినివేశము. వారుజితేంద్రియులై జ్ఞానులై వానప్రస్థవిధానములై నిజోద్యానవాటికాంతరమున విడిసిరి. వారివియోగ మందఱనేకగ్రీవముగఁ దపింపఁ జేయుచున్నది. హా! ఇది దైవ సంకల్పముగాని వేఱుగాదు. ఈభూలోకంబునఁ దదృక్తియుఁ దత్కీర్తియు వేఱొకనికిఁ గలుగునే ?

1. వ. పండి—ఈయదితదీయాభిజనపారంపరీకృత్య మగుటంజేసి వారికి నీయభిజనవ సహజమే.

2. వ. పం—తథ్యము. ఇది పరంపరాగతము. అందువల్లనే మన తొంటివల్లభులకెల్ల విశేషయశోవిభవమును బారత్రికసుఖమును దప్పక గలిగియున్నవను జనవాక్యము వినుచున్నాముసుము. వారు యశఃకాయులనుటకు సందియమేమి?

1. వ. పం—అది సరిగాని మన యౌవరాజ్య మిఁక నెట్టిదిగనుండునో యని శంక పొడమెడు.

2. వ. పం—అది వాక్రువ్వ నెట్టగు.

తే. అలతమోపహాంలధిక ప్ర । భాఢ్యులైనఁ
దత్సుతులు దృష్టులు ఘనులే । నుత్సహించి
యట్టియట్టమొందిరె, యిది । తిట్టగాదె:
ఏరి కీర్త్యపకీర్తులు । వారిదండ్రు. 2

అయినను ధరిత్రీవిభుఁడుగారి పుత్రరత్నము యువరాజుతోసిరాజుగాఁడని వింటిఁగాన నిది కొంతలగ్గే. నీతిగలిగి ప్రజాపాలనసేయనిరాజుండియేమి. లేకయేమి. "కిం రాజా యో న రక్షతి" యనునది వినమే?

3. వ. పం—అవునవును. మఱియును వారు మనోజవులని తెలిసియే యున్నది. "యథా బీజం తథాఽంకుర" యనునది నిజమే.

మంత్రి—అది సరిగాని, కొన్నికొన్ని విషయములలోఁ దండ్రికన్న మఱియు నధికుఁడని యుఁ జెప్పనగు.

తే. శ్రీలవానిని జోడును । స్ఫీతకాంతి
గౌరుఁ డాకారకాముండు । సారధైర్య
జాతరూపాగమము మనీ । షాగురుండు
రమ్య తేజోహారియుఁజాప । రాముఁ డతఁడు. 3

3. వ. పం—సత్యము. ఇట్టివాఁడే పుత్రుఁడు. లోకమున గాదెలోని ధాన్యరాశివలెఁ గీర్తికాములు గానివారసేకులుం బుంజీభవించి నట్లుండిన లాభమేమి?

2. వ. పండి—ఇది వాస్తవికముగాని యిప్పు డెవరెవరు గ్రామాంతరోద్యానమునకుఁ బో నుద్యమించిరి.

మంత్రి—భట్టారకుఁడును బట్టపుదేవియు లక్ష్మీబాయియుఁ బురందరపురోగులై పో నుద్యోగించిరి.

౨వ. పం—ఆప్రకారమా! హరిహరి!

తే. కాండధరుఁడయ్యుఁ బరిపంథి కాండమాఁచి
వీరపూరుషమేలు హం వీరనిభుఁడె!
ఈదృశాచలేశునకిది హితవె? యీశ్వ
రేశ్వరా, నీదునియతి వారింపఁదరమె. 4

1. వ. ఉద్యోగి—అహాహా, ఏమనవలయు, రాజుగారి ధర్మపరిపాలనాశక్తి, ఆ సజ్జనపోషానురక్తి, ఆ దైవభక్తి, ఆ పురందరులహరి సత్కీర్తి, ఆ స్త్రీరత్నముల పాతివ్రత్యస్ఫూర్తి, కేవలాగణితము. అట్టివారి కిట్టి యసాధ్యకార్యము సంప్రాప్తమయ్యెఁ గదా? అయినను మహానుభావుండును సకలశత్రుజైత్రుండును నగు మనరాజున కీయాత్ర యొకదుర్ఘటముగా నుండునో?

3. వ. పం—ఏమటు లూహించెదరు?

తే. రాజుసన్మహాన్వీతుఁ డర్ణవనివృత ధ
రాధర శిరస్త్రరాజిత రత్నరాజి
దీప్తి నీరాజితానూన దివ్యతాంఘ్రి
యుగళ నీరేజునకును ని మ్మొగియలఘువె? 5

2. వ. పం—అవునవును
ఇట్టి కృతలక్షణుల కృతకృత్యములు వినియున్నాము గామే?

తే. అమరులంబుధి మథియింప నందు భీష్మ
మొంద నుత్పాతముల్ పెక్కు లుద్గమింప
విడిచిరే? వారివిజిగీష, వీరవరుల
సాహసం బెన్నఁగాఁగాఁదె? సాగరంబు. 6

మంత్రి—నిక్కము. అది యటుండఁగా నిపుడా మిక్కిలివారినిరోధింప నతిదుర్లభము. (సికగ్రామాధికారిం గని) సాయుతుఁడా, మనమహారాజుగారి వెలివలతికి వలయు పాథేయములఁ బూజావిధానోచిత సాధనములఁ గొన్ని పంపుము. వెండియు నాకుటిల్లాండు కిష్కింధాంతికమున నిర్మించుటకు విన్నాణులగు కలిభటుల నేమింపుము. ఈవిషయమై నేమిక్కిలి ప్రపంచించి వచింప నక్కఱ లేదు. వారిత్వరత నీకుసయితము తెలిసియే యున్నది.

(భాండాగారికునితో) భాండారికుఁడా, బండారముమండి నీవీ గ్రామాధికారి కో
రొక్కమిమ్ము. అందఱు రండు. ఆద్వంద్వద్వంద్వముల సేవింతము.

(నిష్క్రమించుదురు)

—•—

## అష్టమాంకము.

### స్థలము ॥ ఉద్యానము.

పౌరపండితాదులు—(కాషాయవస్త్రధారులును సకళత్రులునైన రాజబ్రాహ్మణుల నమస్కరింతురు)

1. పౌరుఁడు (వేఱొకనితో) మిత్రమా, అహః!

తే. అగ్రజామాత్య రత్నాక ॥ రాంతరమహీ
జాని ముక్తాత్యలంకృతా ॥ స్థానిసీమ
హైమపీఠిక సచ్ఛుస్తుఁ ॥ డై మహాన
పద్యుఁడై ధవళాంతరీ ॥ పమున నవఘ
*ళించు మాధవుఁబోలెఁ గా ॥ న్పించుఁగనుఁడు 7

1. వ. పండి—(భూపాలుని గాంచి),

క. ఓరాజా, మిముఁగనమన
సారస్మల్లోచనోత్స ॥ లా మోదకరం
బారెఁ దోషాంతర్థియు
నారజముగఁ జక్రరిష్ట ॥ మనయుంబూరెఁ. 8

మఱియొకఁడు—రాజేంద్రా, నే ఖింతవఱకు భవదీయకటాక్షముచే సంవర్ధింపఁ బడితిమి. నేఁడు పితృతుల్యులగు మీనియోగము మాకందఱకుఁ బరితాపసంయోగమయ్యె. ఇఁక మముసంరక్షింప నేరులేరుగాన మీవెంటఁ గొంపోవకుండిన మేము బ్రతుకఁజాలము. మఱియు "దుర్బలస్య బలంరాజా" యను ధర్మమేలికకుఁ దెలిసియేయున్నది.

క మనుజేశా, వనవాసము
మునులకుఁ దగుఁగానిమీ క ॥ మోఘంబగునే?

కనుడు, మహాహితసమితిం
గొని పెంపుం గనుటకంటె గుర్వీ! తబముల్. 9

యశో—ఆర్యులారా, మీవార్త సువార్తగాని, వినుడు.

సీ. దుష్టదిష్టంబు మ ర్త్యునినానివలమానఁ
దానభిమాన శా త్రవునకడఁగు
నిషణత్రయముతన్ను నీడాడివలమాన
హంసను హింసించియతకరించుఁ
దాను సత్సంధిని మానినవలమాన
లేకంగదఁ బడఁబాకమాలు
జ్ఞానవైరాగ్య సో పానాప్తివలమానఁ
జేసి యంగదఁ బడ సేమమారుఁ

తే. గాన నివిగని మనుజాళి "జ్ఞానమేవ
మోక్ష"యఁ లక్ష్యమెంచి వి మోహాయుతవి
నోదముఖకృత్యముల నట్టెనుఱిచియాడి
యిద్ధ పురుషార్థమే సేక రింపవలయు 10

మఱియు,

సీ. భవకంధిలో భయా వహావపాదిమలదే
హమనుకలమువిప థాప్తిని నవ
రంధ్ర వేష్టితమయి రా, నావికుండు నాఁ
బ్రాణి దానిఁ దరింపఁ బదరుఁగాని
విషయవపాళిలో విషము ప్రవేశింప
దాఁట నసాధ్యమై తరణిమునుఁగుఁ
గాన జీవుండింద్రి యానుబంధంబున
నెంతకాలంబున్న నంతహాని

ఆ. తప్పదనిరి భూమి నొప్పమిసేయుచుఁ
గాలమెల్లరి త్త గడపికడపి
కడిఁదిఁ బడుచు నేల చెడిపోవలయుఁబాట
కంపు విషయవితతి పెంపరగని. 11

వెండియు వినుండు, పురాకృతము ననుసరించియే, మానవునకు మనస్సాదు లుత్పత్తియగు. తత్తలంబున నతం డంతఃకరణచతుష్టయమునకు లోనై మాయాసంబంధేషణత్రయంబు విసర్జించుట కసమర్థుం డగును. ఇవి యుండునందాఁక నజ్ఞానము దుఃఖము దప్ప శాశ్వతానంద మెన్నటికిఁ గలుగఁజాలదు. కావున భవబంధమోక్షసామ్రాజ్యములకుఁ గారణ మగుమనస్సును నుపదేశప్రాప్తిచే సకల మనఃప్రభవాదిదుర్వ్యాపారముల నుండి త్రిప్పియాడి జ్ఞానమునే నేకరింపవలయు. తదుపరి యాజ్ఞానమే మోక్షమును సుకరముగఁ గొల్లగొనుచున్నది. ఇపుడు సర్వముహావణించు మత్కుమారసచివాధివాసముచే మీకెట్టికడమ కడల్కొనదు. వారి నధిష్ఠించి మీమీ మనికికిఁజని మనికితపడుఁడు.

పౌరులు—(మంత్రితో రహస్యముగ) స్వామి, మేము కొంతదవ్వు రాజుగారివెంట రాఁ దలఁచియున్నాము.

మంత్రి—(రాజుతో) భూపాలాగ్రణి, ఈ నాగరులేలినవారివెంబడి కొంతదూరము రా నుదియగొనుచున్నారు.

యశో—సరి, అట్లేసెలవిమ్ము,గాని జలదర్శనమువఱకే వారి యాగమనమని సూచింపుము.

రామభూ—(సవిచారుఁడై మంత్రితో రహస్యముగ) అమాత్యపుంగవా, మదీయజననీ జనకు లీస్థానీయము వీడి కిష్కింధాప్రయాణమునేయఁ దఱిగొన నాకెంతయో దావంతముగ నున్నది. తన్నిగ్రహమున కేదైన సాధనమున్నచో బోధింపుఁడు.
(అని వ్యాకులత నొందును)

మంత్రి—చింతావిష్టుఁడ వేల యయ్యెదు. ధరణీధరులు సంసారాసారత నెఱింగి సకలఫలసంధాతయగు శ్రీధరణీధరుసందర్శనార్థ మరుగుచున్నారు. వారిసుకృతమే సుకృతము. ఇట్టిసంకల్పమునకు వికల్పముకల్పించిన మహాదోషమని దెలియుము. మఱియు నీసుఖవార్త వినినవాఁటబట్టి నే భూపునివెంట గమనింప గమనించితిఁ గాని కొన్నిహేతువులచే వెనుకొనక వెనుదీసితి. వేఱొకటి విను, ఇట్టి యశోనిధులకీర్తి యెందనుకలోకంబునఁ బ్రకాశించునో, అంతకాలము వీరికిఁ బుణ్యలోకప్రాప్తి గలుగు. వినవే "యావత్కీర్తి మనుష్యస్య, పుణ్యాలోకే ప్రగీయతే" యనునది.

రామ—నిశ్చయము. యశస్తరుణిని జెందనినరుం డెంతకాలముజీవించిన నెన్ని రాజ్యభోగాదుల నాస్వాదించినను నిష్ఫలము.

తే. ఆదికూర్మ భుజంగమ హాస్తులవని
మోయరే! జ్యోతిషాంపతుల్ రోయరె! మురి

రోఁచసిల్, బాహుజోత్తముల్ ౯ రోదసినొగి
నేల రే ? ఘనులకు యశం ౯ బే స్థిరంబు. 12

సచివోత్తమా, నే తదీయసేవాపరుఁడనై కతిపయదివసంబులు వారికడ నుండెద, నందాఁక నాకుమారుఁగ మత్పైతృక ప్రాజ్యసామ్రాజ్యపదస్థానికుఁడ వగుము.

మంత్రి—(స్వ) ఔరా, ఈ రాచబిడ్డ చాకచక్యము. నిగుడులోని నిప్పుచొప్పునఁ దెలియఁబడదు.

(ప్రకాశము, రాజుతో) వింటిరే ? రామభూపాలునివాక్యము.

యశో—(స్వ) ఆ, మదీయాంగజుఁ డెంతవిన్నాణి ! ఇతఁడు నిరర్గళదోర్యుగబలవిన్న నిరూఢవైభవంబున రాజ్యంబును సునాయాసంబుగ నధ్యక్షించి కీర్తిసంపాద కుండు కాఁగలండు.

(మంత్రితో, ప్రకాశము) సచివా, ఈకుమారుఁడు తిరిగి వచ్చువఱకు నస్మద హితభయరాహిత్యవశంబును మీవశంబున నుంచుకొని తన్మనోరథము నిర్వహింప వలయును.

మంత్రి—దేవా, శిరసావహించి భవదాజ్ఞ నెఱపెద.

పురం—(పృథ్వీశునితో) భూపాలా, ఆలస్య మేల ? "శుభస్యశీఘ్రు" మనున దెఱుఁగరా ? నిర్గమింపుఁడు. (అందఱు నిష్క్రమింతురు)

---

## అ ష్ట మా ం క ము.

### స్థలము III. పౌరపరస్పరసంభాషణము. (ఉద్యానముపెంబడి.)

ఒకఁడు—(వేఱొకనితో) వయస్యా, ఈవింత గంటివే ?

అమాత్య గురు బుధ సామంతబంధుజనంబులు సన్నిధిన్గలువఁ, గవిపుంగవులెల్ల నంతరంగం బుప్పొంగఁజేసియుపాంతంబున నిలువ, వేత్రధరులు "సావధాన" యని హెచ్చరి[illegible]ంచు జనంబులఁ దలవ, శాత్రవవ్రాతంబులు భయకంపితులై పాఱి గెలువ, సకలపరివా[illegible]బు పరివేష్టించిగొలువ, నఖండరాజ్యవిభవంబునఁ బాకశాసనుబలె శాసనంబు న[illegible]పుచు నెఱవుగఁ బ్రజ్వలించు మన మహారాజుగారిని బురాకృతము కాషాయవస్త్రధారులనుగఁ గావించి దారుణాటవికిఁ బుత్తెంచె. వారి వెంబడి భగీరథుని వెంట భాగీరథివలె నందఱు ప్రయాణోన్ముఖు లైరి.

తే. హరదాన దయాసత్య ౯ వీరులలర
ద్వీపద్వయాంభోధి మేఖలా ౯ ధిపతియగుచు

రాజ్యరమచేత రాజిల్లు రాజవహాని
లంపటకుఁ జిక్కె, హా! విధి లంఘ్యమౌనె. 13

2. వ. వాఁడు—అవును. కంటిని. వారు కాషాయధరులై రాజయోగింబోలె వెలఁగారుచుండిరి. ఆహా! వారి యశోవిభవ మా సోమమండలము వ్యాపించియున్నది. ఇఁక వారీ పంకసంయుత భవాంభోరాశిని యాశోదేయ కరుణాకటాక్షమునుతరించేఁ దరింపఁబడి సాలోక్యమొందుట కెట్టినిరోధముండదు. అట్టివారికి మదూర్మ లెక్కడివి. నరులు తొల్ బాముల కన్నిదురాకృతములఁ జేసినను సర్వదా భగవన్నామమునేయుచు వచ్చిన, వారికర్మములన్నియు సూర్యునిఁ గన్న మంచువలె మాయమైపోవును. అట్టివారికి సాధారణముగ దుర్వృత్తియే పుట్ట పడదు. మనతనువు గాలిలోని దివెకంబమనియు భోగంబులు క్షణికంబులనియు నెఱుఁగక యీసంసృతియే యధికసంస్కృతమని నమ్మి సదా చర్వితచర్వణములనే, సేయుచు మాయాభవాబ్ధిఁ మునిఁగి పారము గనఁజాలక యిట్లు వ్యర్థముగా ఖిలీభవించుచున్నాము. ఇట్టిమనకా, ఆ తపస్సిద్ధి గలవారి ప్రభావము నెఱుంగుట.

3. వ. వాఁడు—సత్యము. వారి బంఢాలము నాకుఁ గొంతవిశదమే. వా రీసంసారమును నిస్సారమని తెలిసికొని నిస్పృహులై త్యజించిరి. మన కట్లుసేయ సాధ్యమగునే?

ప్రథముఁడు—సాధ్యముకాదని సెప్పఁగూడదు. ఎప్పటికైన బ్రయత్నములేకయే, యేకార్యమైన నెఱవేఱునే? బావిలో జలమున్నది, గాని తలఁచినమాత్రనే యది పొంగి నిర్గమించునే?
ఇఁకరండు. అజాయాపతుల సేవింతము. (అందఱు నిష్క్రమింతురు)

అదేచోటు-ఇద్దఱు స్త్రీల సంభాషణ.

ఒకర్తె—(మఱియొకతెతో) అమ్మా, అమ్మచెల్ల! వింటివే, కడచినరేయి తెల్లవాఱుటకు మున్న మనభూపతియుఁ బురందరుఁడును భార్యాసమేతులై కానఁబట్టిపోవఁ దద్వియోగజాతార్తిపరంపరలు ధూమముఁబోల్కిఁ దత్కాలప్రావిర్భూత నిబిడీకృత జీమూతవ్రాతంబులఁ జేరి నల్దెసలం బాఱుటంజేసి యంబరంబంతయు యమునవలె నంధకారబంధురంబై కానఁబట్టె. ఆచిహ్నము లిప్పటికిఁ బొడవడుచున్నవి.

వ. స్త్రీ—(వెఱఁగున) చనిరే? చెలీ, అద్భుతంబులగు నీవాక్కులు, గగనంబున నోడలు దిరుగుచున్నట్టుగను వృక్షంబులున్నట్టుగను కొండమావుల నీళ్లున్న ట్టుగ నున్నవి.

1. వ. స్త్రీ—ఔరౌర. ఎంత కోలాహలమాయె! ఈ ప్రమేయమాబాలము ప్రవ్య క్తమైనను నీవెటు లెఱుఁగవమ్మ.

2. వ. స్త్రీ—అటులా! వాస్తవముగ నే నెఱుఁగనే యెఱుఁగను.

1. వ. స్త్రీ—(దరహాసములో) ఏల యెఱుఁగవు? రాత్రి విశేషవిచారమేమైన [illegible]?

2. వ. స్త్రీ—విచారము లేదు, విహారము లేదు గాని, యదేమో, నిద్దురపట్టక వేగు ప్రొద్దునఁ బట్టె.

1. వ. స్త్రీ—ఏల నిద్రాభంగమయ్యె? సరసంపుటలుకయో, విరసంపుటడలో? సామా న్యముగా యోగికి భోగికి రోగికిఁ గదా, నిద్రపట్టదు. ఒకవేళ విరహోత్కం ఠితవైతివో?

2. వ. స్త్రీ—నీ విట్లనుట ధర్మమా?

1. వ. స్త్రీ—ధర్మముగాదా? ఓసి వెఱ్ఱిబాగులు, యోచింపఁగా నిదియుం ధర్మములలో నొకటియే.

2. వ. స్త్రీ—అమ్మక్క, ఏల క్రేణించెదవు. ఎంతనేర్చితివే, ఆ ధర్మమెటులో తార్కాణించెదవా?

1. వ. స్త్రీ—ఎటులా? గ్రామ్యధర్మ మెఱుఁగవు గాఁబోలు.

2. వ. స్త్రీ—(ఎలనగుచు) ఇఁక నీకోఱడము చాలు, నిలుపు.

(మీఁదఁజూచి) ఓహో, నీమాటలే నిక్కము. అవిగో, అయ్యరుల సూచించు రేకలు. మఱియు భూమ్యాకాశములు నివ్వెఱపడియున్నట్టున్నవి. ఔరా, ఏమబ్బురము!

1. వ. స్త్రీ—అంతికా, ఇదొకవింతయే, రాత్రివింత లెంత దొంతరలయ్యె.

సీ. పరఁగులక్ష్మీదేవి కి పరఁగఁగ ద్విజరాజు
జడతాతిశయమున కి జడమునఁ బడెఁ
బొంగతిలోరకా కి ప్రోషితభర్తృకల్
జలదచ్ఛదాప్తి గర్జాభరంబు

నాదంభమున రోదసినం బొనర్చుచు వృష్టి
ధారానికృతిని గన్నీరునించె
దీపికావళికెల్లఁ దేజంబు దొలఁగెను
గన్నవారలకు దుఃఖంబుగలిగె.

తే. కువలయంబులుకుందె సంక్షోభమునను
సంకులౌషధుల్ కందె విషాదమునను
నవల యభ్రాంగన వగవ నా[illegible]
రసిత విద్యుల్లతార్ఘుంద్యు లెస నెసంగె. 13

వింటివా? వారినందఱిని వారింప గాలివానలపరిమితముగ సంధించినను దదభినివేశముఁ ద్యజింపరైరి. ఇట్టి దాబాలవృద్ధము ప్రవ్యక్తమైనను నీకేల తెలియదయ్యె. బళా, బళా.

2. వ. స్త్రీ—(ఉద్విగ్నయై) నాదురదృష్టము. మందభాగ్యను గాన నమ్మహానుభావుల సేవ దొరకొనదయ్యె. ఒకవేళ ప్రాతఃకాలమున లేచి రా దొరకొనినను మాయత్తగారు తత్తఱపెట్టి మొత్తుదురు.

1. వ. స్త్రీ—నిక్కమే, అందులకు సందియము లేదు. కనుకనే, అత్తలేనికోడ లుత్తమురాలని చెప్పవలసియున్నది. అయినను నారీమణు లెట్టిధీరలైనను వారికి స్వతంత్రప్రక్రియాది క్రియలు శూన్యములని తెలియుము.
అవంతి, ఇఁక మించినదాని నెంచనేల! రమ్ము. ఇప్పుడైన వారిని సేవించెదము.
(నిష్క్రమింతురు)

---

## అష్టమాంకము.

### స్థలము. IV మంత్రియోలగము.

### ప్రవేశము: స్థాయుకుఁడు.

స్థాయు—(స్వగతము) అహా రే! దైవఘటన. చతుస్సముద్రముద్రిత భూమండలాధీశ్వరుండైన మా మూర్ధాభిషిక్తులకు బదులుగ నీ మూర్ధాభిషిక్తుండు యుద్ధసమయంబున జంబుకంబు శార్దూలంబైనట్లు మూర్ధాభిషిక్తుం డయ్యె. ఇతని కఠినమైన

భూవరు పైతృకీమహి యిఁక నితనిచే పాతమగునో! ప్రపాతమగునో!
(ప్రకాశముగ) అమాత్యపుంగవా, మన భూనేత్రు ప్రవాసమునకై నే బహుదూర
మేతెంచి యాయాయిచోట్ల లగ్గగుమందిరుల నిర్మించి మఱియు సుఖయుక్తార్థ
ముల నేర్పాటుచేసి యేతెంచితి.

మంత్రి—అమితానందము. అచ్చో నెల్లవారికి మంగళమే?

స్థాయి—కాకేమి?

మంత్రి—(స్వగతము) ఆహా, భూపుఁడు నిజరాష్ట్ర మంత్రి సామంత సేనాంగము
న్వర్జించి యడవి నిడుమలఁ [illegible]నట్లుగదా, నే వింటిని. ఇతఁడుమాత్ర మందఱు
సుఖమున్నారని చెప్పుట ద[illegible]గాదే. మంచిది బాగుగా విమర్శించెద.

(ప్రకాశముగా)

ఆ. సకలధర్మ శర్మ ౹ సాధార్థరహితుఁ డై
యెట్టులుండు రాజు ౹ నట్టడవిని

స్థాయి—

వారికేమి సోమ ౹ వైష్ణవ శేఖరుల్,
శాంతి గలుగునే? నిశాంతశమికి. 14

వారీ పునర్భవసుఖంబు తృణప్రాయంబని పరివర్జించి శ్రీమనోహర సమాహిత
మతియుతులై పరివారాప్తులతో నిపుడు పెనుమసనమునుబోని కిష్కింధకుఁ
బోవుచున్నారు. వారిపోగడ్తఁ బొగడ హరిహరబ్రహ్మాదులైనఁ జాలుదురే?

మంత్రి—అవునో, అది వారణాసికి సమానమా! సరిగాని, యానిలుకడ కడపటిదనుక
నుండవలయుఁ గాదే?

స్థాయి—(స్వ) ఔరా, ఇతఁ డెట్టి స్వార్థపరుఁడు, అయిన నే నెపుడైనఁ బట్టీకరించి
యుందునే?

ప్ర—ఆహా, దాని కాటంకమేమి? వినవే? ఒకసీతి.

ఉ. చేయరు దొల్త విఘ్నమని ౹ చెల్గుమునొక్కటి మానవాధముల్
వాయుదు రంతరాయ ముప ౹ పన్నముగాఁగఁ గలంగిమధ్యముల్
దాయుచు నెంతయొద్రుచినఁ ౹ దప్పక దారువరించు చక్కటిక
ద్రోయక యించుకేని తమిఁతో నెఱవేర్తురుగాదె? యుత్తముల్. 15

మంత్రి—నితమరి, హితవరివై యలంగక తత్కార్యముల నెల్లఁ బదింబదిగ నొనర్చితివే!

స్థాయి—నన్ను సైంధవుఁడని యెన్నితిరో?

మంత్రి—నే నటులెంతునా! నీ విశ్వాసము నీ సాహాయ్యము నే నెఱుఁగనే! నీవు
చికీర్షువని తెలిసియేగద, నిన్నంపినది. ఆహా! ఇంత గౌరవ మన్యులకు లభ్య

మే! వినమే? "కే వా నస్యుః పరిభవపదం నిష్ఫలారంభయత్నాః" అనునది.

తే. సతత సంతాపయుతులైన ¶ సార్వభౌము
లకును గర్మక్షముండవై ¶ లలితముగను
హితుఁడవైతివి మేలయ్యె. ¶ ఇంటరమున
సర్వకార్యదక్షుఁడె సుమా, ¶ సహచరుండు. 16

స్థాయి—(స్వ) బళే! ఇపుడుగదా, యితఁడు గతగంధుఁ డయ్యె.

ప్ర—ఇఁక నాకు సెలవిచ్చెదరా?

మంత్రి—సరి, పొమ్ము. మాకును వేళమీఱెను. (నిష్క్రమింతురు).

---

నవమాంకము.

స్థలము. I అడవి.

జయరావు: రామభూపాలుఁడు.

రామ—పశ్చాద్గామి, మాతాపిత లంతంతనున్నవారు. తల్లోకసార్థమై యీతుపారాగ మచ్ఛాయనించుక విశ్రమింతము.

జయ—మంచియాలోచన. (ఇరువురు విశ్రమింతురు).

జయ—(చూడ్కి నలుమూలల నెరపి) ఆహా, వనరమారక్షితంబైన యివ్వనరాజం బగణితఫలపుష్పభరిత తరుగుల్మలతాదులకలిమి నెంత లక్ష్మీప్రదముగా నున్నదో కనుమా.

వృషభగతిరగడ:—

1 విమల విమలా శారిబాచిరి ¶ బిల్వబిల్వహారి ప్రియాసన
క్రముక క్రముక జటాజటాకలి ¶ కారకారభు కుంజరాశన

2. పిచుల పిచుల జయాజయాకర ¶ వీరవీరరసాల శరములు
రుచకరుచక కరంబరంభా ¶ రోహిరోహితజాలపురములు.

3. చతుర చతురలు వీఁకఁజెనకర ¶ సాలసాలములోలివిరియును
వితవితమరి గడంగితాఁకన ¶ వియవియకరయొవ్వధినిదోరయును.

4. చీకుచీకురు వాయులగములఁ ¶ జిందు వందయిప్రేలు మోడ్పడి
నాకనాకాంబుదకణంబులు ¶ నాఁగనాగరు లెన్నఁగాడ్పడి.

5. మృగమృగాదనకోలశాఖా ¶ మృగమృగారవభీకరంబులు
సెగసెగం గొని విడిచి విడిసెడు ¶ జీవిజీవహారాకరంబులు.

6. సాలికాలిమరాళిమధుబిస । సాంద్రనాళములాన వీక్ష్యము
వాలువాలము లొత్తిచటఁగర । వాలువాల్పున నొత్తలక్ష్యము. 1

ఆ. మఱియుదగ్రతరులు । మాఱునఁ దలిదండ్రు
లవలె హ్రస్వనుటము । లవలఁ బిన్న
లబలెఁ గానిపించు । లక్షముగ్గా లక్షింపు.
దారితారిజాల । ధర్మశీల. 2

ధామ—మీవర్ణన మతివర్ణితము గాని మాకుఁ జూడఁగ వేఱొకభంగి గోచరమగు చున్నది.

ఆ. ప్రాంశుపాదపములు । ప్రబలి దిగ్విజయంబుఁ
బొందు యోధులమెఱుఁ । బొటకరించు
మఱియు ఖర్వతరువు । లఱలేక సేనాచ
యంబు డంబుగొంచు । డంబుగాంచు. 3

జయ—బళా, ఈవర్ణన యతి చమత్కారముగను గేవల రాజార్హముగ నున్నది. (తిరిగి చూచి) మిత్రమా, జననీజనకులు సమీపస్థు లగుచున్నారు. ఇఁకఁ జనెదము, రమ్ము. (నిష్క్రమింతురు.)

(అదే స్థలము.)

శుభ—(కాఁడినకంటకముల నూడఁబెఱుకుచు) అబ్బబ్బ, దైవమా! ఏమిముండ్లు.

యశో—(స్వ) ఆహా! సకలసుఖావహమగు శుద్ధాంతమున వసించు నీయసూర్యంపశ్యయగు నసూర్యంపశ్యకీపేరడవి నెట్టిరట్టు సంప్రాప్తమయ్యె.

సీ. మెత్తని విరవాది । మెత్తపై మెలపని
మేనెట్టుఛదముల । మెలపునొక్కొ,
గుజరీతివాసీలఁ గుదురుగా । నడయాడ
నోర్వని యంఘ్రులె । ట్లోర్చునొక్కొ,
నవసుమావళిహస్త । నాళీకములనైనఁ
దీయదే ముండ్లెటు । దీయునొక్కొ,
ఆమోదకరగాన । మాలింపదే? ప్రక్క
లించురుతమెటు లాలించునొక్కొ,

తే. అంతిపురినుండి రానేల ♦ యలంత(గుండ(
గటకటా! దైవమా యెంత ♦ గాసినొంద(
జేసితివి వేసరముగల్గె ♦ నాససంద
డింపలంపటులందీర్పు ♦ మిఁక ముకుంద. 4

(ప్రకాశముగా)

తే. కల్కి యీనగ సీమ లీకకంటకాదు
లీగభీర స్రవంతులీకయిసనిదాఘు
మిట్టి భయదమృగోత్కర ♦ మిట్టికాన(
గాన( గానయ్యొ నీదుదృక్కంజ మకట! 5

శుభ—(స్వ) అక్కటా, చిట్టడవిలో జిట్టాడు పుట్టకాఁపులను బెట్టిదపు మెకములను గనుఁగొని నేనధికవ్యాకులనైతి నని కాఁబోలిమ్మానవేశ్వరులు సమధికవ్యాకులితచిత్తు లగుచున్నారు.

ప్ర.—అయ్యో, నాథా. నాకోసమమీకీ గాసియేల?

ఉ. ఈనగరత్నమింద్రనగ ♦ రీదృశముకంటకరాశి మల్లికా
సూనము లాయతాపగలు ♦ సూక్ష్మపు(గుల్యలహాస్కరాంశుసం
తానముసాంద్రచంద్రికలు ♦ తామససార్థము లచ్ఛధేనువుల్
కానసమిట్టుకాననము ♦ గాఁగనుపట్టెడుఁగాదె? మీరెగెడన్. 6

యశో—(సమందస్మితముగ) ఓహో! అటులా, ఇఁక నిర్భయముగనుండుము. (శౌరులఁగని) మీరువత్సలతనిందనుక విచ్చేసితిరి. ఇఁక దయచేసి విచ్చేయుఁడు.

శౌరులు—(సచింతగ) మానవేశా, యేలినవా రెన్నటికైనఁ దిరిగి వచ్చి యల్లు వెట్టిన లేఁగెలవలె నల్లల్లాడుచు ననాథులమైయున్నమమ్ము రక్షింపవలయు.

యశో—దైవసంకల్ప మిది. అయినను మీకువిరాగత్వ మింకంటరిపక్వముకామిసంసారతాపత్రయముచే వేధితులగుచున్నారు. కావున మీకిప్పుడు కృత్యాకృత్యవివేకము నాత్మానాత్మవిచారముఁ బురుషార్థచింతయుసకల జంతుజాలంబులయందు సమభావముగలిగి సుజ్ఞాన మేర్పడునో యప్పుడే మీకన్నిటి యందు విరక్తి పాటిలు.

సీ. జనులార శ్రీహరి ♦ నసుఁగన్న నాతండ్రి
కమలాక్షిలక్ష్మిన ♦ న్గన్నతల్లి

భాగవతులునాకు । బంధుజనంబులు
ధర్మిష్ఠులెల్ల భా।ర్యతలు దలంప
శాంతిదాంతులుగల । సజ్జనుల్ పుత్రులు
కరుణాసహితులాప్త । వరులుధరణి
సుజ్ఞానులేసతీ । సుతలు విశ్వంభరు
సేవాపరాయణుల్ । చెలిమికాండ్రు.

తే. ఇట్టి సుకృతాత్ములాహితు । లెల్లహితము
వల్కుచుండఁగఁ బడిపున । ర్భవజడధిని
మునుగుచున్నేలుచుండుఁగా । మూఢజీవి
యెప్పుడోముక్తిగాంచులే । నెఱుఁగనొక్కొ. 7

ఇట్టిఘనులే నా కాత్మబంధువులుగాని యితరులెట్టి స్వజనులైనను మరీచికలఁ బోలెఁ గాన్పించుదేహబంధులు సుమా - ఇఁక మీమీనివాసములకుఁ బొండు.

పౌరులు—ఏలికయాజ్ఞ, (రెండడుగులు సని వనివనాటాదుల నుద్దేశించి)

సీ. తరులార, గాలిమే । తరులార, విన్నాణి
దొరలార, మోమరే । దొరలమేటి.
మరులార, నిర్జరా।మరులార, చారుచ
మరులార, యెదరే । మర్త్యపాలు.
కరులార, మలయువే । కరులార, శశివిభా
కరులార, కావరే । కారుణికుని.
చరులార, సద్వనే । చరులార, శర్వరీ
చరులార, ప్రోవరే । చారుమూర్తి.
మావులార, తలిర్చెడు । మావులార,
యద్దికము నేయుఁ డీతఁడే । పావతంసుఁ
భ్రాంతరవిహారవిశ్రుత । స్వాంతులార,
శాంతులార, దయాపర । స్వాంతులార. 8

లక్ష్మి—(భయకంపితాంగయైభర్తతో) హా, ప్రాణేశా, యేతత్వాంత భీకరసత్వనికర కృతభాంకృతి హుంకృతి సమ్మిళితప్రతి ధ్వానంబులు భయాక్రాంతంబైన యస్మత్ స్వాంతంబునునిష్క్రాంతియగునటు సేయుచున్నవి.

పురం—(స్వ) రామరామ, యీవలంతిపలంతియయ్యు నీవలతియందలి ప్రచండవేదండ దండాదిమృగనినాదములకలికిఃకమితాందోళితచిత్తయగుచున్నది. ఏతచ్ఛ్రమంబు వాయసమకట్టెద.

ప్ర—సహధర్మిణీ, ఆదంతావళములకు నీవెంతయోవంతనొందియున్నట్లు కనంజేసెదు. అది వలవదుసుమా.

ఉ. ఏనుఁగు గున్నలున్మదపుకేసనికలున్ జరియించుచుండినన్
మానుము సాధ్వసంబిపుడు ౹ మావిభువేఁడిన నవ్విభీతుమైఁ
బూనియెదుర్పలేవు, నరపూజ్యులు భక్తులు నారసింహులై
మానుగఁ గుంజరాళిమఃఁ ౹ మాంద్యము పుట్టఁ జరించుదుర్సతీ. 9

భగవద్భక్తుల కసాధ్యతగలదే? వినవే, తొల్లి యాంజనేయుం డత్యధికాయతమనతి భయోత్పాదకమునగునంభోనిధి స్వల్పసారణింబోలె సునాయాసముగా లంఘించెనని
వేటొంకుచిత్రమువిను.

ఆ. రమణి, నీదుమృదుతరకరాబ్జములకుఁద
త్కరము లగయుఁగదొరకగానికతన,
మఱియు నీదునడక ౹ యొఱపున కిభతతుల్
వ్రీడవానినేఁచ ౹ విరిసిపాఱు. 10

లక్ష్మి—(శాంతవేటి) ఓహో, అటులా! సరి. జీవితేశా, అహాదరి టింక్లవెంతఁ గనుఁడు.

చ. తరుణశశాంబులెల్లపలు ౹ తావుల దీవుల సంచరించి సం
బరమునఁ బూరిమేసి కరి ౹ పాలికి జంకవదేల?

పురం—

అల్లనాఁ

డరతను బృంహితాళికురి ౹ యూడి శశాంకుని వారిలోనవే
గిరమునఁ జూపిశాత్రవుల ౹ గిట్టునఁ బాఱునోనర్పఁ బైదలీ. 11

(ఆత్మగతము) ఆ! ఈ ఛాయాతరుల క్రింద స్నానఁ గొంత విశ్రాంతి గలిగె.

(ప్రకాశము, భర్తతో) స్వామీ, ఇచ్చోట,

శ్రీకలరవకాళీ మ । యూరవార
కలరవంబులు డంబుగఁ । గల్గు చేల?

సఖి—(కాదా మఱి)

కలఁగు పథికుల కతిరిక్త । గానఫణితి
విరతి నొనరించు విపినంపు । విందులివియ. 12

ప్రవేశము— రామభూపాలుఁడు : జయరావు.

జయ—(స్వ) ఓరా, నేత్రపర్వము సేయునిచ్చోటు ఖరకరకరాగ్నిదగ్ధకాయులగు నధ్వన్యులకెంతయో శైత్యోపచారము సేయుచున్నది.

(రాజకుమారునితో, ప్ర:)

చ. చెలిమరి, కంటె, యిట్టిపథి । చిత్రవిచిత్రచరిత్రముల్ ఘనా
చలచరదధ్వగార్తి పరిశాంతివిధాననిదానముల్లతా
కలితలతాంగనాప్రతతి । కాపవనోచ్ఛలదాత్మసూనకు
ట్మలమిషచామరౌఘముల । మంజులశైత్య మమర్పవీచెడున్. 13

రామభూ—సత్యము.

సవయస్కుఁడా, నేఁ గృతహస్తుండ గాన నీ మంజులవంజులమంజులంబులచెంత వేఁటాడ వేడ్కపొడముచున్నది.

జయ—(చెవులుమూసికొని) హరిహరి! ఇది యశాస్త్రీయముగాన కేవల మశ్రావ్యము. మన మేతెంచిన కెలనమేమి ! ఈనీతలంచిన తలంపేమి? మృగయావినోదము విషాదాకరముగాని మోదాస్పదముగాదుసుమా.

తే. పానముయువతి వేఁటదే । వనముదండ
వాక్యపారుష్యముల్పరస్వహరణ
మనెడుసప్తవ్యసనములు । వ్యసనభాజ
నములవశ్యమువర్జనీ । యములుసుమ్ము. 14

ఇట్టి దుష్కృత్యములచే నలనలయుధిష్ఠిరులలజడిపడరే? కావుననిట్టివియింతకు పరము మీమనంబున నుపన్యసింపఁ దగవని నే నుపన్యసించెద.

(పరలిచూచి) మనవారు చేరువయగుపలుకు నీకౌలత్రాలమీఁదఁ గూర్చుక్క దమురమ్ము.

శుభ—(ఆకంపితశిరోరాజితో) నాథా, అదిగో, అయమ్మో భాగము సీజగద్వఁగొదమ మనకట్టుచూచుచు భయంపజేచుచున్నది.

యశో—(స్వ) అయ్యో, కష్టము. సంభ్రమింపఁజేచుచున్నది.

(ప్రకాశము)

శా. అలికులవేణి, యేలవెఱ ‖ పాగజవైరులనంగనెంత నా
బలమునెఱుంగ వియ్యెడవిఁ ‖ బైకొను కేసరులెల్లఁ బైకొన
న్నులఁగుడువెట్టలేవునర ‖ నాయకుఁడౌటను, నిమ్మహానుభా
వులుహరిభక్తులౌ ప్తశర ‖ భుల్లలనిల్వఁగలంగనేటికిఁ. 15

ఇచ్చోటు భయావహమైనను మాయిరువురికిని నీకుదరము వెరయుదు గాన ధీరత్వమవలంబింపుము. అదిగో, వివిశాంత్యము. అతంత దోఁతెంచుచున్నది.

శుభ—(తిరుగ వీక్షించి) స్వామీ, ఓ కార, కమ సమర్థత! మీవ్యాలోకనావా నామ్రారసత్వంబు లాలోడితసత్వంబులై విచ్చుమొగ్గలగుచుఁ దత్తటంబున క్షేత్రములకు జాఱుచున్నవి. మఱియు వాయూతాయూత వాతాయంపులలో నాచి త్రహరిణములన్ననుఁడు. అవి మనలఁ జూచి యంలికపడి వీనులనిక్క పొడువఁ గాలికి బుద్ధిచెప్పుచున్నవి.

యశో—వెఱపరి, నీవిఁక వెఱవీడిమి గమ్ము. ఏలయనఁగ నవియన్నియు నీ మహిమాతి శయమునసే దలఁకుచుఁ దలఁగుచున్నవి.

క. అంగంబగు నీకొనిపు
డింగముగాఁ జెంగలింప ‖ నీలవదుచు ను
త్తుంగంబగు తుంగమునకు
సింగంబులు పొంగడంగి ‖ చెంగుటగనవే. 16

మెండియు నీ నేత్రశృంగారమున కురియాడి యామృగంబులు నయిత మణఁకు చున్నవి.

శుభ—ప్రాణనాయకా, ఈగట్టు చట్టుఁబట్టునఁ జుట్టుకొనిన యంధకారబంధురో న్నతస్థానంబులఁ గన్గొన కొడఁదయేచి కదఁబడుచున్నది. ఇఁక కొంత దవ్వు నావలయునో!

సీ:—

లలుకంటకము ల్పదంబులఁ । జిక్కనెత్రిటుకాఁగఁగా
నలువనాకుఁ దరంబుగాదిట । నిచ్చలంగమలంగెదుఁగా
జలధరాధర పంక్తిఁ గేరెడు । కొండలెక్కుట యెట్టటో!
తలవిధి న్దలపోయఁ జిత్తము । తప్తమయ్యెడు నక్కటా! 17

నడవనడయాడ నడుగులు । తడబడెవడి
వడిగ నడవఁగ మైగడు । నడుకొనెఁజుఁడి,
నడవఁ బోడగనఁ జీకువా । లడరె, నేమి
తంత్రమో, తప్పె మర్యాద । తలముగూడ. 18

ఈ శిలోచ్చయారోహం బధిక దుర్ఘటము గానఁ గొంతోక తడవీవిశల్యం బగుచోట నిషణ్ణనయ్యెద.

యశో—(స్వ) కటా! ఈతనుమధ్య కెంత చింతగలిగె. అధ్వదుఃఖమేగాక యీ పర్వతారోహణము సేయవలయునని కాఁబోలి ట్లున్నది. (ఆలోచించి) అవును. అట్లేగద, అబలల కుండుట. అయిన నీచిగురుఁబోఁడి మార్గాయాసము పో నెరవగు నెరవుఁబన్నెద.

(ప్రకాశము)

మ. అలివేణీ, భవదీయసాధమిదియా । నా? చెల్లరే! మున్న నే
వలదన్న న్వినకేలవచ్చితివి? సం । వాదంబు చాలించి నీ
నిలయం బందువసింపకైన సరి, క । న్నీరేలనే? నీకుచా
ద్రులుభూయిష్ఠ మృదుస్మితి న్బరఁగఁగం । దోడ్తోఁ గలంగున్నిరుల్. 19

చూచితివా! మనవారందఱు చేరువనున్నారు. భయానకమగు కాననాంతము నంతిమముననే యగపడుచున్నది. అవిగో, చంద్రకాంతములు. అవి మనల కొన్నుది పఱుపఁ గలవు. రమ్ము.

శుభ—(సస్మితముగ) మీరు సదయులు గాన మీయందంతమంతయుఁ జంద్రకాంతముగ నుండ దని భావించెద. కరుణార్ద్రహృదయు లొరుల జాలిం గని జాలిం జెందకుందురే? వినమే? "ప్రాయస్సరోఽభవతి కరుణావృత్తిరార్ద్రాంతరాత్మా" యనునీతి.

యశో—మానినీ, నీ సూక్తులే నిజము. రమ్ము. (నిష్క్రమింతురు)

## న వ మాం క ము

స్థలము ii. ఋశ్యమూకము.

ప్ర : యశోవర్ధనాదులు.

రామ—(జయరావుతో)

కంటివే? ఈశిఖరి రాజంబుడంబు.

సీ. శార్దూలకపికరి ౹ శార్దూలసాంద్రిత
గహ్వరం బాభీల ౹ గహ్వరంబు.
వనతటీస్తైకత ౹ వనతటి త్వరికనత్
కర్బురంబుదళిత ౹ కర్బురంబు.
కనకప్రసూన స ౹ ద్గంధనున్నభ్రమ
రాంబరంబు సమధి ౹ కాంబరంబు.
తాపసచయపరి ౹ తాపసంచయహారి
విష్టరం బాకీర్ణ ౹ విష్టరంబు.
తే. పరమసరిదూర్మివిధుతాబ్జ ౹ పన్నపుష్ప
రసనిరంతర పానప ౹ రాయణాళి
సాకినీ విహారణఖేల ౹ నాప్యకూట
పాళివనరమాకేళి యీ ౹ శైలమాలి. 20

జయ—యథార్థము. బలుప్రవ్నగ నున్నదిగాని నాకుఁజూడ వేఱొకభంగి దోఁచు
చున్నది—

రామ—అదెట్లు?

జయ—

చ. సకల సుదివ్యసేవ్యమయి ౹ చక్రికనత్కటకాభి రామమై
ప్రకటశిరోభ్రి సంయుత విశారావయుతామృతనిర్ఝరాప్తి దీ
పకమయి కాళికాగణ ప్ర ౹ భాసితమూట గిరీశనామమీ
త్రికకుదహార్యవర్యున క ౹ రిందమ, కూర్చుట యప్రశస్తమే? 21

యశో—(పురందరునితో) కనుఁగొంటిరే? ఇచ్చోటు శ్రీఖండాదివృక్షములచే నలం
కృతం బై యెంతగాఁ బరిమళించుచున్నదో. వెండియుఁ నప్పట్టున నానానిగ

ష్పంబులకుఁ బోవ ననేకనిగమంబులు సూచట్టుచున్నవి. కొందఱు భక్తాగ్రేసరు
లు ప్రాతాగ్రమునకు శ్రీరామసందర్శన కుతూహలులై సనుచున్నారు.

రాజదేవేంద్రా, దైవసృష్టికిని దమదృష్టికి నంతరమేమి ? కానీ, యాస్థానము
గాంచ నీవిద్యమానమున నాకొండు దోఁచుచున్నది.

క. మీరావలెఁ గాంచనసాలవ
 శావసురాజీవశృంగ ౹ సదమలసుమనః
 పావనభూభృద్వనికా
 శ్రీవిలసితమై యగంబు ౹ సెలఁగునశేశా. 22

యశో—ఆహా ! మీవర్ణన మతిశ్లాఘనీయము. ఇఁక రండు. ఇచట విశ్రమింతము.
 (అంద ఱాసీనులగుదురు.)

జయరావు—(రామభూపాలుతో రహస్యముగ)
 మిత్రమా, ఆలకించితివే ? వీరి మనఃఫలంబులు దివసక్రమంబున భక్తిసూర్యా
 తప మంటినకొలఁది తజ్ఞాతజ్ఞానరుచుల నెట్టు లవఘళించుచున్నవో.

రామ—తథ్యము. అయిన నీతత్వభాగధేయము నందకమున్న మనవంటి యపక్వశాలం
 బులు లోకజ్ఞానరసంబు నాస్వాదించి ప్రవర్ధిల్లవలయుఁ గాదే ?

జయ—నిక్కము.

యశో—(శుభకీర్తితో) సాధ్వీ, ఆచోద్యము గంటివే ? ఆ జంతుకలాపంబులు కలా
 పంబులుమాని స్వేచ్ఛావృత్తి నెట్లు చరించుచున్నవో.

సీ. అడవికుక్కలు నక్క ౹ లామేషరాశిలోఁ
 జరలాటలాడెడు ౹ సరసముగను
 నొకవంక నొకడొంక ౹ నుబ్బుచు శ్యేన శ
 శకములు మెలఁగు సం ౹ సర్గమునను
 నొకకోనలో శ్వాన ౹ మొకకోనఁ గొనికోన
 కేగులాగును గను ౹ లేఁగలూఁగ
 నామండమునకండ ౹ నాహ్లాదముననాడు
 కుండలిమండలి ౹ మండలియును

తే. బకము బగిఁదారుకోక శా ౹ బకముబకము
 కపిబిడాలకునకసు సం ౹ గమముగమము

సతతమీకేళికి హారిసా । కలమె కలము
గాన నివిగానఁ గనవు వేఁ । కరముకరము.

ఇట్టనేక మృగపక్షిజాతంబుల మైత్రీమత్త్వ మత్యాశ్చర్యకరంబు గాదే!

శుభ—(సాశ్చర్యముగ) స్వామీ, ఇట్టిమహిమ యెచ్చోటం గానము. ఇది కేవల రామమయముగ నున్నది. మఱియు నిష్పక్షపాతముగఁ బ్రజాపాలనమొనర్చు తమ మనశ్చక్షువు లెందేని సల్లక్షణంబులఁ గాక మఱేమిదృష్టించు?

శా. మాయామగ్నులు మానవుల్మతవే । మాఱు స్వరుల్దారటం
చాయావృత్తుల భేదవృత్తిమెయి న । న్యాయంబుగా వర్తిలన్
హేయద్వేష విశిష్టసత్వతతి హిం । సించుష్టము, నిర్మలుం
డా యీశౌరి సదేశసార్థసమర । వ్యాసంగప్రవృత్తులే
లా, యట్లుండు. అమానశిక్షితనరుల్ వ్యాపాదసంచారులే. 24

జయ—గురువర్యులారా, బ్రొద్దెక్కుచున్నది. (పురోభాగమునఁ గని) అదిగో,

క. వారలు పాటలు మొగపడఁ
దారట గనుఁడలిరయత స । దాహ్వాన్మోదం
బారభునీ తీరవనీ
త్మారమణీ రమణువరుణ । శరణుంశరణున్. 25

చూచితిరే, కొందఱుబాడబులు స్నపితులై నదీతీరమునుండి ఋశ్యమూకాద్రి కరుగుచున్నారు. వారిఁజేరిన మనముసైతము కిష్కింధకు వేగఁ బోఁగలము.

పురం—(విని, దర్శనోత్కంఠుండై) బ్రాహ్మణులా! బ్రాహ్మణులా! ఏఁతి! ఏఁతి! (వారిం గని సోత్సాహుండై రాజుతో) రాజేంద్రా, ఈ నగరాజమహిమాతిశయమును దన్మహోపకృతియుం వర్ణింప నేనోపఁగావలయు.

క. హారిసుత తైర్థికనియమములు
సారగళ సేవించు లేఖ । సురభీష్టలమున్
సురభిస్వారామాస్థలి
సురభియు సురభియుమపార । సుమనోనిధియున్. 26

మఱియు నీగోత్రము కిష్కింధాక్షేత్రములోనిది. అప్పురి తొల్లి కీశనాథులగు వాలిసుగ్రీవుల రాజధాని. వారు సహోదరులైనను బరస్పరవిరోధులుగ నుండిరి. ఒకతఱి బలశాలి యగువాలి దుందుభి యనురక్కసుని వధియించి తక్క-

శబరం బెగరఁదన్నిన నది యిగ్గిరిమీఁదఁబడి చెల్లచెదరైనకతనఁ దద్రుధిర మాంసాంత్రము లిన్నగంబునఁ దపంబొనర్చు మతంగమహామునిపైఁ బడె. అంత నాఋషి రోషించి యద్దురాత్ముఁడు వాలి యీయద్రినెక్కినఁ దచ్ఛిరంబు వ్రక్కలౌఁగాక యని శాపించె. తత్కారణంబున సుగ్రీవుం డిందు సురక్షితుండై నిర్భయముగ వసించి రామునికార్యము నెఱపి కృతార్థుం డయ్యె. పెండియం నిపుడు పరమార్థసీతాన్వేషణం బెట్టిదని యెట్లు సేయవగునని తల్లడిల్లు మనకు విప్రశాఖామృగోత్తముల సహచరులం జేయుచున్నది. తత్సంధికై మన్మనంబు మనోజవంబున విక్రమించి గమింపనున్నది. వేంచేయుఁడు. (ఋశ్యమూకాద్రి నుద్దేశించి)

నైకసురర్షి దేవయువతీ లలితకూటము, ఖేద ఖేదనా
నాకలుషార్తి ముక్తసుమనః ప్రవరేణ్య సమీరహితాగమా,
ప్రాకట ఘర్మశాంతికర వాతవతంసము, శోకపైకగో
త్రాకుల సత్వసంకుల శిఖాచలపాకము, ఋశ్యమూకమా. 27

క్షణంబు సెలవొసంగుము. తిరిగి యేతెంతుము.

(అందఱు నిష్క్రమింతురు)

---

## నవమాంకము.

### స్థలము iii. నదీతీరము.

ప్ర—రామనాథదీక్షితులు, కాశీనాథశాస్త్రి.

మఱికొందరు భూసురులు.

కాశీ—(దీక్షితులంగాంచి, స్వ.) ఓహో! ఇఁక మనకెక్కడిజీవిక. యాజకు లిట్లు ధనజాడ్యబద్ధులై యాచకులవలె మన కడ్డమువచ్చుచున్నారు. ఇట్టివారు తాము సకలాగ్నికర్తృకంబున నిపుణులమని పొగడుకొంచు నిట్టి స్వల్పకార్యము లొనర్ప నొడికట్టుచున్నారుగదా. ఇదేమన్యాయము.

ప్ర—ఔరౌరా! మీరును వెంచేసితిరో!

రామ—ఏమి సేయుదము, విధిలేదు.

కాశీ—ఏల ? యజ్ఞకర్త లెటో చనిరిగాఁబోలు.

రామ—(అసూయతో) ఆప్రసక్తి యిపుడేల ? మీపూజాపునశ్చరణము లన్నా
నేఁ డమావాస్యగదా ? ఏల యింతయాలస్యము.

కాశీ—(స్వ) అహ ! మంచియమావాసి ! కాసువిశేషముగా గడింపకున్న నిట్టి కల్పి
ల్పుండునే.

ప్ర—ఏల, ఈదివసము నమావస్యగా మార్చితిరి. భారతంబునందలి శ్రీకృష్ణునిచర్య
మనంబుననాటెనో ?

రామ—(అధోముఖుండై) అదిగాదు. పొరపాటు, గాని నేఁ డేమిసేయవలయుఁ ?

కాశీ—నేఁడాలయమున నర్చనావిధు లెచ్చుగాన మనమిచ్చోఁనున్న యాత్రాజనంబు
లేమిసేయుదురు ? ఇదిగాక యీసంవత్సరము స్వామిదర్శనార్థమై యేతెంచు
తీర్థసేవులు కోటానఁగోటులు. ఇపుడే యాసజ్జనమున్న జనము సేయింపవలయుఁ
గాదే ?

ప్రవేశము—పురందర యశోవర్ధనాదులు.

పురం—(భూసురులతో) పూజరులారా, అతిదూరవ్యాపనముచే విజృంభమాణమై
యధిక గంభీరంబగు నీ నదీరాజ నామంబెద్ది?

రామ—వినుండు,

ఆ. తుంగభద్రసహిత । తుంగతుంగంబుల
మధ్యమమునఁ బాఱి । మధ్యలోక
మింగముగన భంగ । తుంగభద్రానది
యనఁగ మించుఁగనె సకమస్తధునుల. 28

ఈ యుత్తమపుణ్యనదీప్రభావ మేతన్మాత్రమే? ఈయది ప్రతివర్షర్తువునకుఁ
బిమ్మట నొకతూరి శ్రీరాములవారి పాదప్రక్షాళనము సేయఁగోరి పొంగారి
బాలువాఱుచు మీఱుచున్నది. ఇం దహోరాత్రము కృతస్నానులగువారు
రామునివాడియే సుమ్ము.

యశో—(చెంత నొక సరసింగని రాజ్ఞితో) కంటివే ? నాభీలస్థానంబును నాలీ
నమీనంబును నాఫుల్లనలినంబును నిర్ముక్తఫేనంబును నిర్గత దుష్టజంతుజాలంబును
నిర్మలోదకపూరితంబును నగు నిష్పంకజాకరంబు శ్రీకరంబై కరంబు మానసో

స్రవాహంబు గావించుచున్నది. ఇదియే పంపాసరోవరంబు. మున్ను శ్రీరామ లక్ష్మణులు వనవాసము సేయుచో నీప్రాంతములఁ గొంతవిశ్రాంతిఁ జెందియుం డిరని వినికిగలదు. మఱియు నిచ్చోటఁ గనుము.

లయజవృత్తము:—

సరుహానేత్రప ౹ విధమలయంబున ౹ బిసబిసఁ జేరెడు ౹ శిశవగమిఁగా
సనిచిగుర్వసఁ ౹ బసగఁబసాపడి ౹ పరిపరిఁగేరెడు ౹ పరితములఁగా
ఎసకొనిమారుని ౹ మసమసఁగున్గను ౹ మధుపవివర్తము ౹ మఱికసటౌ
పసట్టునడంచి క ౹ మలకుఁదలంబగు ౹ మలయజవృత్త వి ౹ మలసరసిఁగా. 29

శుభ—బలుసొంపుగ నున్నదిగాని యొకచిత్రము వింటిరే?

యశో—చిత్రమా! ఏమది!

శుభ—

తే. స్వామి, యీకమలినిఁ దెల్ల ౹ దామరనను
రాగమునఁ దాఁకనదినాయ ౹ రత్ని మీటె.

యశో—(నగుచు)

అంచనీకేలు దమ్మిని ౹ నటుగ్రసింప
నెరఁగె. ఇష్టార్థ మెవ్వరి ౹ కరుచి యగును? 30

శుభ—ఓహో, అదియా, సమాచారము. మంచిది. ఇచట తిలకించితిరే? ఈతోల దోఁట తాటాదూటము గాక నానావిధరమ్యలతావిటపి విటపాళులచే నలంక రింపఁబడి యెంతయో తిలకించుచున్నది. మఱియు నిందలి తిలకతిలకము న్గనుఁడు. ఇయ్యది శోభావిహీనులమైన మనకు నిందీవరములకువిరోచనుల ఘాలిభాలినిచ్చుచున్నది.

యశో—(కనుఁగొని) ప్రియా, నిక్కము. ఈ యభినవాగమమానవిలాసము వాగమే యము. అయిన నీ వివృతప్రసూనంబులకలిమికి నీ వివృతవీక్షణమే కారణము.

శుభ—అయ్యారే! అలాగా!

యశో—సందేహమేల! ఇట్టియకాలమున సైతము స్త్రీలదోహదక్రియల ననిచి తను చున వనేకములు గలవు.

ఉ. గోరఁట బొట్టుగుల్ పొగడ ౹ గోఁగులశోకము మావి సంపెగల్
మోరటి పొన్నవావిలులు ౹ ముద్దియ కాఁగిటఁ జాడ్కనుమ్ములన్

డా రెడుగేలిఁ దాఁపులను ః దాఁకుడదల్పులఁ బాటపాడఁగన్
వారకనవ్వఁగన్నిడుద ః వాయువు దీయఁగఁ బూచువావిరిన్.

శుక—స్వామీ, తమయూలమున సెన్నఁడు వినవివింతలెల్ల వినఁగల్గె. కర్ణరసాయనం బయ్యె.

యశో—(భూసురులతో) అగ్రజన్ములారా, ఇచ్చోట్టు కిసలయవ్యాప్తసంధ్యారాగ మయ్యు వికసిత నానావిధపుష్పభరితమై వనలక్ష్మియుంబోలెఁ దేజరిల్లుచున్నది. ఈ యారామనామంబెద్ది?

కాశినా— భూపాలాగ్రణి, పూర్వ మాంజనేయుం డశోకవనంబుననుండు సీతాదేవిం గాంచి పెక్కురక్కసుల నుక్కడంచి లంకందహించి యేతెంచుచోఁ దద్భవాందూరగమనాయాసత్తృప్తి పానలం స్వమధురమధురసాఫలముఖఫలామృతంబులం దీర్చి ప్రశస్తినొందిన యారావలము మధువనమంద్రు. దీని కావల వలమైనకావలముసైనను గేవలముగఁ బోఁగొట్టునట్టు కిష్కింధనావెలయు.

పురం—(రాజుతో) రాజోత్తమా, జనసంతతి వంతదొలంగించు నిట్టివంతయందుఁ దీర్థములాడి దేవునిదర్శించిన మేల్ గాదే?

యశో—అవు, అట్లే సేయుదము. (తుంగభద్ర చాయంజూచి)

గీ. ఘనరమావిభు పాదసం ః గతముకతనఁ
దనరి పావనివై ము క్తి ః దాయినివయి
సారభక్తాళిఁగాచి సం ః సారబంధ
సంగతింజెంగఁజేసెదు ః తుంగభద్ర. 32

మమ్ముఁ గరుణింపుము.

విప్రోత్తములారా, భగవత్పాదారవిందద్వంద్వదర్శనాయత్తచిత్తులమైన మాకు విధ్యుక్తముగా శ్రీహరిసందర్శనసేవాది సుఖంబులొసంగి చేతఃప్రీతిఁ జేయవేడెదము.

రామ—అలాగే, విజయంచేయుఁడు.

(శాస్త్రులతో) మీరీ మిథునంబుల యభిమతంబు తెలుపుఁడు. నే మరలవచ్చెద.

శాశీ—(స్వ) తెలియును, వీరి సంపర్కము జీవికకు మోసమని. ఇఁక మననోట మన్నే.

ప్ర—మీపోకడ తెలియునుగాని యిపుడెక్కడికో? పోకడ.

రాఘ—మీరయాశయము పొంటుంగుడు. పెనుక మాటలాడుదుము.

శాశీ—అది సరికాదు. నేఁగూడ వెంబడించెద.

(రహస్యముగ) మీకిచ్చువాడుదలమఖవను. యథార్థము. మీరు వీరి
వెన్నడి విజయము చేయుండు.

—సరి, అటులైనం బోందు.

(పురందరునితో) అయ్యా, రాజుగారి గోత్రమెయ్యది ? తమగోత్ర మెద్ది ?

—వీరిది కౌశికగోత్రము, మాది వాశిష్ఠము.

—ఓహో, మీరు మాకు సంబంధులే.

సంతోషమేగదా,

సరిసరి, దయసేయుండు. (నిష్క్రమింతురు.)



## న వ మాం క ము.

### స్థలము IV. కిష్కింధాభ్యర్ణపర్ణశాల.

### ప్ర. ఇద్దఱు పనివాండ్రు.

ప్రథముడు—(రెండవవానితో) సఖుండా, మనరాజుగారు మనకంటె ముందుగ బయలువెడలిరిగదా ? ఏలాగో, యింకను వారి పొడ్పవగానము. ఇచ్చోటు భయోత్పాదకము. ఇంక నెన్నినాళ్లు ప్రాణాలు బిగబట్టికొని యిట్లుండవలయునో.

2. వ. వాండు—అది చెప్పనెట్లగు ? వారి సౌకర్యార్థమునకే యీచందగుపాకను మనవారు పరిణమించి కట్టించి వలయుసామగ్రులు సేకరించియుంచిరి. మన మధిక ప్రయాసపడి దీనినెంతయో బాగుగ భద్రాకరణముచేసి యొకయుంఖ కారికవలె నుంచితిమి. అయినను మనశ్రమ వృథ యని యనుకొనం గూడదు. తలందిరిగి కబళము నోటికివచ్చునటు వారెటు చరించినను తుట్టతుదకిచటికి రాకమానరు. అందాక మనము కండ్లుమూసుకొని కాలహరణము సేయవలయును.

ప్రథ—సహకారి, అదేసరి, తల నమ్ముకొనినవెనుక రొన్ని యమిబిజనులువచ్చినను చేయుచుం గాచుకొని యుండవలయు. ఇంతగాం గళవళపడియుం గడకేదో యొండు పొరపైన సేవకునిగతి చెప్పవలయునే ! ఛీ, ఛీ, సేవావృత్తి; దీననే మైన సౌమంగలదా ? దీనికంటె నుంఛవృత్తి కడుమేలని తోంచెడి. ఇదియుంనుం

గాక యెంతయో భయభక్తులతో నడచిన నిష్కృతియజమానుల సంతో;
యతిదుర్లభము. వారిచేత నించుక చెప్పెద నాలింపుము.

ఉత్పలమాల:—

చేసిన చేతగాదనుట చేయక చెంగినఁ జప్పటించుట
ల్యాసిగ సంతపెట్టిన సెకబా, సిదిలీరెను మాదునేరిమిఁ
దోసముగూరనే నితఁడ దున్న, యెనర్చెను నేరమిఁగాదటఁ
గాని కథింపఁగానికిని గైకొన కన్నృతమంచు నెట్టటఁ
గాసిలఁ జేయఁజూచునధి కారి; ఖుతంబిడిగాన భృత్యుఁడే
వేసము వేయునేల, యటు విశ్రుత మాధుకరంబుపాటిలన్. 33

2. వ. వాఁడు—తాలీ, నీమాటలు సరిగానీ యందఱకు భిక్షపై యభిలాషగల్గునా? నేనీ నాటనిక్కై గన్నవారి కాళ్లపట్టుకొని మిక్కిలి కష్టపడితిని. ఇప్పుడు సుఖపడుచున్నాముగాదే?

ప్రథ—అవునవును. పనిగావలసివచ్చిన కునకపాదములకైనఁ గడుగక విధిలేదు.

2. వ. వాఁడు—(తిరిగిచూచి, సంతసమున) చెలువుఁడా, ఆలకింపు. అప్రక్క నేదో సద్దు వినఁబడుచున్నది. ఎవ్వఁడో వచ్చునటున్నది.

ప్రథ—వేఁడి! వేఁడీ! (అని చూచుచు) ఆహా! వారుగో, వారుగో, వచ్చుచున్నారు.

ప్ర. రాజపురందరాదులు.

ప్రథ—దొరలారా, మీకొరిగలు (అని చాఁగిలుచున్నాఁడు)

2. వ. వాఁడు—బాబులారా, జోతములు. (అని సాఁగిలఁబడుచున్నాఁడు)

యతి—(పనివారితో) ఏమిసంగతి?

ప్రథ—దేవర, ఏలికనివిరోగించుట కీవల్లభంబగు నాకుటిల్లు నిరీక్షించుచున్నది. దయచేసి మీరందఱందు వెంచేసి వెంచేయుఁడని సేవకునివిన్నపము. మీనిమిత్తము మేము మాశక్తికొలఁది యందు వెగడొందుచు సుసవసించి వసించియున్నాము. మజ్జు మఱవవలదని మఱిమఱి విన్నవించెదము.

పురం—(రాజుతో ప్రోత్సాహముగ) అయ్యా, మీరీలేఁకల విశ్వాసము గంటిరే? వీరి పల్కులవింటిరే? వాస్తవముగ నీయుటజ మిక్కుటిమునస్థలికి వాస్తవ్యముగానే యున్నది.

—అవునవును. ప్రస్తుత వాసయోగ్యమే. ఇచ్చట యింతమాత్రమాధార మెంత విశేషము. వీరు మహాబుద్ధిమంతులు.

(పనివారితో) మీ సాదరమృదూక్తులవలన మాయంతరంగంబు శాంతినొందెఁ. మేమందఱ మానందమందిరంబునఁ దేలితిమి. ఇపుడు శ్రీహరి నోలగించి తిరిగి యిచ్చోటి కేతెంచెదము.

పనివాండ్రు—ఏలినవారి చిత్తము.

ప్రథ—(2. వ. వానితో, రహస్యముగ) ఇటు రా మఱి. వింటివే, నే సమయమున నొకమాట విడిసితిని. ఏడ్చుబిడ్డకేగద, పాలుదొరకును.

2. వ. వాఁడు—బలే, మంచిపని చేసితివి. ఇఁకఁ బోదము రమ్ము. (నిష్క్రమింతురు.)

లక్ష్మి—(మెల్లఁబరికించి భర్తతో) ఆర్యపుత్త్రా, అచిత్రమేమి! అచ్చోట నొక జంబుక మొకమేషీ శాబకంబునకుఁ బాలిచ్చుచున్నది. ఔరా, తద్వీతవై జాత్యము!

పురం—(విని) సహచరీ, ఇదొకవిచిత్రమా? ఈప్రస్తవము మున్నె ప్రస్తావింపఁబడెఁ గాదే? ఈప్రాంతంబుల నెల్లెడలఁగాంచిన నిట్టి సత్యవృత్తులే గలవు. వైరస్య మనునదే పూజ్యము. అదే, పురోభాగమునఁ గాంచుము?

సీ. తల్లు లేగఁగనార్చు । పిల్లాకములఁ జేర్చి
చలివాపు నల్ల భు । జగములోర్చి
ఛాగి యేగఁగఁ దన । శాబకంబుదరఁగ
మేకొని సాఁకును । మేఁక తిండి
చిఱుమెకం బెండచేఁ । జేడ్పడనోముఁ ద
త్పరత నఱుతఁ జిఱు । త విడివీడి,
అహ్యాహిభుగ్యోగ । మమరినఁ బవరంబు
కాసంత లేకయే । కడగఁబోవు
తే. నిట్టి మాత్సర్యరాహిత్య । మిట్టిశాంతి
యిట్టి వాత్సల్యసాహిత్య । మిట్టి దాంతి
వాసవా ల్దోరలైనఁ జే । పట్ట భ్రాంతి,
అద్భుత దయారసము లిట । నమరు నింతి. 34

యశో—(తనువు పులకింప భార్యతో) దేవీ, ఇదిగో, దేవాలయము. ఇది సమస్తాలయములలో బహుప్రతనమును సర్వమునిజనమనితమును సకలభక్తజనపని

తము నైయున్నది. మఱియు నిందలి పనితన మెచ్చోఁ గని వినియుండ
అత్యద్భుతము.

(పురందరునితో) స్వామీ, కంటిరే, దేవాలయము. సకలవర్ణవర్ణనీయము. దర్శించె
దము, రండు.

(అందఱు నిష్క్రమింతురు.)

---

## నవమాంకము.

### స్థలము V. కిష్కింధా దేవాలయము.

ప్ర. రామభూపాలుఁడు : జయరావు.

రామభూ—(జయరావుతో) అక్రందుఁడా, కాంచితివే? శ్రీరాములు వెలయుం
నీయాలయఘనసింహద్వారము పర్వతగుహయందుఁ దొలుపఁ బడిన కతన నెంత
సంచుగనున్నదో. మఱియు నిచ్చట సైతము జంతుజాలంబుల యైకమత్యము
వర్ణనాతీతము.

క. ఆసురభీ భల్లుకముల్
లాసకనికురుంబముల్వ కలనుగ న్మది ను
ల్లాసమునం జెరలాడెడు
వేసర కాహారమున కవిత లుండుటచేన్. 35

జయ—(కని) ఔనౌను. అత్యాశ్చర్యమే. ఈక్షేత్రము భక్తసంతానసంతానసంతాన
మని తెలిసియే యున్నది. (శ్రీరాముల సందర్శించి వందనం బాచరించి.)

ఊ. శ్రీల, తమాలనీల, వర శిష్టజనాఘతమస్తమోరి, ని
ర్వేల కృపాలవాల, పరి ఖేదితపాల, వ్రజాంగనాలి హృ
ల్లోల, నరానుకూల, ఖల లోకవిఫాల, సుశీల, దేవకీ
బాల, రమావిలోల, నత వైష్ణవజాల, విపన్నపాలకా. 36

(ప్రవేశము.) భార్యాసమేతులైన యశోవర్ధన పురందరులు

పురం—(శ్రీరాముల సేవించి) శ్రీపరమయోగిహృదయసంచారా, విజితవిమతవీరా,
భవవిదూరా, గతిలేనివారలఁ బ్రతిపాలించు ప్రతిన నెఱపుట కిదే తఱి. దేవా,

తావకనిశాంతంబు మామకస్వాంతంబును నిశాంతంబుగఁ జేసి రంజింపంజేసి నిఁక మీ కనికరంబున మాకనికరం బపనీతం బయ్యె.

రంగ, నీదయ గలుగంగఁ ౹ దుంగరైన
రంగ దుత్తుంగ తుంగమై ౹ పొంగు, యుష్మ
దంతరంగంబు వింగడం ౹ బైన భర్త
శృంగిరైనఁ బులొఁ బర ౹ మేశసంగ. 37

(రాజులో) రాజప్రకాండా, అనుకంపాసింధుండును, జనతాబంధుండును, ప్రసతాలక్షణసహితుండును, దివ్యమనోహరమూర్తిమంతుండు నైన శ్రీరామచంద్రుల నభివీక్షింపని జన్మమేల?

ఉ. కన్ను నెఱింగి శౌరిఁ గను ౹ కన్నులు కన్నులు, తత్సమూర్తికిఁ
జెన్నఁటి వోవదం చెఱఁగు ౹ చేతులు చేతులు, తన్నికాయముం
గన్నడ లేక చేరఁ జను ౹ కాలులు కాళులు, తద్విలాసముం
దిన్నని బుద్ధితోఁ దలఁచు ౹ డెందము డెందము గాదె? మేదినిన్. 38

యశో—అవును. ఇందులకు ద్వాపరంబేమి?

(శ్రీహరి పదాంబుజసేవనాబ్ధిమగ్నుఁడై)

తే. శ్రీమనోహర, గోపికా ౹ చిత్తపశ్య
తోహరా, శేషతోష, సా ౹ ధుపరిపోష,
పతితపావన, నిన్గన ౹ భవభయచయ
హారణ మయ్యె నగదా? యస్మ ౹ దాదులకును. 39

పురం—రాజచూడామణి, పూర్వము విభీషణులవారి సంరక్షణార్థమై శ్రీరంగనాథుండు శ్రీరంగమున వెలసిన తేపఘోరరాక్షస విరాముండును భక్తవ్యూత్కృష్టముదపో ముండును నగురాముండు సతతాభి రాముండై సుగ్రీవారాధన కిట వెలుఁగు చున్నాఁడు. కావున పురాతనమగు నీవ్యాప్తక్షేత్రము విశ్వజనీనమునను వాని యోగ్యముగ నున్నది.

యశో—నిశ్చయము, ఇందుండు తీర్థవాసులు శ్రీరామశ్రితులు గాన వారికపవర్గము హస్తాములకమని పరమర్షు లానతిచ్చిరి. దానంజేసి యందఱిందుండుట శభి లాషలై సదాసుఖోదధిలోఁ గ్రుంకుచుందురు.

నిలుపుచు ఫలకామివిగాక మోక్షసంధాయకుఁ డగు శ్రీహరి పదభక్తినిరతుండ వగుచుఁ దదపాంగవీక్షాపరంపరల కావాల మగుము.

సు—(తల్లితో) సవిత్రీ, సవితృనిర్దేశమయ్యె నీకుఁ దామ సెలవిండు.

త్మ—(వ్యస్తచిత్తయై) తండ్రీ, ఏమిసెలవు?

ఉ. వినుము కుమార నిత్యము త్రివిక్రమదివ్యకథా ప్రసంగముల్
వినుచుఁ దదర్పణంబుగ నివేద్యపదార్థము లెల్లఁ జేసి స
జ్జనజటి నిర్ధనాదుల యథావిధిఁ దన్పి మృషం ద్యజించి యా
సు దొలఁగించి భక్తజన సత్కృతిచేఁ దులకింపుచుండు మా. 43

మఱియు,

ఉ. ఎవ్వఁడు ధారుణీరథిక హేతిమతవ్వని దృగ్రథాంగముల్
కవ్వడియంతయేఁ డధిక కర్కశవిద్విడనీకభేదితా
నెవ్వఁడు లోకహాని జనియింపఁగఁ దత్క్షణ ముద్భవించువాఁ
డెవ్వఁడు భక్తసాధ్వ వనుఁ డెవ్వఁడు వాని భజింపుము క్త్రికై. 44

వత్సా, పోయిరమ్ము: "ప్రాణినాముపకారయైవ సాధూనాం జగతి జీవిత" మనునది మనస్కరించి శీలవంతుఁడవై పాడిపీడకరాజపుత్రునితో క్షీరనీరంబుల తెరంగునఁ గూడి మాడి వర్తిల్లుము. ఇట్టి మనికి మేల్గాదే? మఱియు యశో నిలయయగు మత్పుత్రి నీయనుజమావియోగానలజ్వాలల నధికసంతప్తమానస యగుఁగాన నామెను విడనాడకు.

య—తల్లీ, ఆలాగే.

మభూ—(మాతతో) మాతృకా, ఆజ్ఞ దయచేయుండు.

భ—(సవిచారముగ) బాలకా, స్వామియాజ్ఞ. రాజకులకల్హారవైవాతృకుఁడవై వైవాతృకుఁడవు గమ్ము. వెండియు నీసవయస్కుఁ డగు జయరావును వెన్నుదిగఁ గొని పురంబున కరుగుము. ఈదివ్యక్షేత్రము ముక్తిక్షేత్ర మగుటంజేసి యవ శ్యము నిషేవ్యము గాన నిందు మాసకలిపయము నిల్వఁ గాంక్షించెదము.

మభూ—(తండ్రితో) జనకా, అనుజ్ఞయిండు

సశో—పుత్రా, సర్వశాస్త్రకోవిదుండవై సుజ్ఞానవంతుండవౌ నీకు బోధనీయ మేమియు లేదు. అయినను,

సీ. మేము లేమనుకొంటి నీమదిఁ బోకాడఁ
జేసిసాగర నేమి వాసిఁ గనుము

చలపాది నీచు బ | ల్కాలికఁ గొండాడి
కొండెము ల్నుడువఁ గ్రి | కొలువడకు
మండలేశ్వరుల సా | మంతుల మంతుల
మచ్చికతోఁ బరా | మరిసనేయు
రాజబంధులకు స | ద్రాజకంబునకు మ
ర్యాదసంధింపు మే | రాళముగను

తే. సదయునై కహంసద్ధ్యులు సహితుసుహితు
నార్త మాతంగపాలుఁడో | యదవినీలు
శ్రీశుఁ జేర్కొని నీయశ | శ్రీ చెలంగ
రాష్ట్రము న్దాల్చి యేలు స్వ | రాష్ట్రము, సుత. 45

భరతవాక్యము:—

చ. సకలచరాచరోద్భవము | చాతురిఁదార్ప విరించిరై జగ
త్ప్రకటితశాంతభావమున | రక్షణమూన విరించిరైతమిఁ
దకపికలాడుభూహతవి | ధాననిరూఢి విరించి యూ మహా
ప్రకృతివిజేత పూత జన | పాత త్రిమూర్తి మము న్భరించుతన్. 46
(అందఱు నిష్క్రమింతురు)

ఇది, డాక్టరు, పసుపులేటి వీరస్వామిప్రణీతం బైన

శ్రీపాండురంగవిలాస నాటకము

సమాప్తము.

శ్రీ కృష్ణార్పణమస్తు.

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారిచే
శ్రీ 'రామ' ప్రెస్సున ముద్రితము.—1930.

# శుద్ధపత్రశేషము.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 12 | ప్రేశపణచే | ప్రేరణచే |
| 7 | 19 | యాచకార్థమై | యాచనార్థమై |
| | 25 | రంగడు | రంగఁడు |
| | 28 | గాగల | గాఁగలది |
| 5 | 8 | రుక్మి | రుక్కు |
| 6 | 25 | జిష్ణుక దర్శింపుమురో | జిష్ణుక విష్ణుక బాలిత [illegible] |
| | 26 | విష్ణుంబరి పాతకృష్ణ-సిద్ధిసిరిక | కృష్ణుక రో విష్ణుఁ గారించు*మిష్టం |
| 7 | 11 | శ్రీరామచంద్రసుపర్ణులే | సుపర్ణ శ్రీరాములే |
| 9 | 8 | వసునది | వసునదే |
| | 17 | మాతృపుత్ర | మాతాపుత్ర |
| 3 | 10 | వల్కువల్కులు | వల్కువల్కులు |
| 4 | 7 | జూచుచు | చూచుచు [చిరో. |
| | 10 | వారికేలదెలియదు. | వారొకతఱిఁ బొరపాటుగాఁ దలఁ |
| | 22 | విద్యాసాగరుఁడెక్కడ? | విద్యాసాగరుఁడెక్కడ? |
| 5 | 5 | విచకిలిత | విచికిలిత |
| | 25 | చెన్నజిదుమడే? | చెన్నుఁజిదుమడే? |
| 6 | 24 | మెంగము | శృంగము |
| 7 | 4 | తనుననువుగ. | తనలినలిగ. |
| | 6 | యాగికకందంబు | యాగికఁగందంబు |
| | 11 | గనుకయే | గనుకనే |
| 8 | 21 | కురులునీకెన్నడుము | కురులీకెన్నడుము |
| 1 | 16 | మాబాగాయె. | మాబాగాయె. |
| 2 | 13 | గానజేర్చి | గానఁజేర్చి |
| 4 | 15 | తేవివాయితం | త్వద్వివాయితం |
| | 26 | బధ్నజః | బ్రధ్నజః |
| 5 | 10 | విమంగంబు | చరణంబు |
| 6 | 29 | తాలిఁదలఁచు | తాలిఁదలఁచి |
| 7 | 1 | గనఁగ గొట్టి | కేని, రొట్టి |
| 0 | 21 | వైకుంఠధామా, | వైకుంఠధామము. |
| | 23 | కంఠభానుమి | కంఠభాస్సుమి |
| 8 | 1 | బెట్టుందుగొ, | బెట్టుందునే. |

# శుద్ధపత్రికము.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 39 | 18 | భుజంగుల | భుజగుల |
| 39 | 23 | త్రేలబడెడి | త్రేలఁబడెడి |
| 40 | 10 | కేలఁ | నిసులఁ |
| 42 | 9 | తోఁట్లు | బోంట్లు |
| 45 | 3 | చిత్రతతి చిత్రజా | చిత్రతతిఁజిత్రజా |
| 47 | 23 | మటమటించుఁ | మటమటించు |
| | 24 | జకలలకుఁ | చకలలకుఁ |
| 48 | 4 | ఓశేఖరి | ఓ శేఖరీ, |
| 49 | 1 | ఇదిగో: | ఇదిగో. |
| 52 | 16 | గామనీమణుల్ | గామినీమణుల్ |
| 54 | 7 | కూనెగాద, | కూనెఁగాద, |
| 56 | 17 | అభిషంగమేల, | యభిషంగమేల, |
| 57 | 28 | దోఁపలేదు. | దోఁచలేదు. |
| [illegible] | 27 | నారఁటే! | నారటే ! |
| | 29 | ఫణిహారుఁడా, | ఫణిహారీ! |
| | 4 | లక్షి: | లక్ష్మీ: |
| | 28 | మంటి | మంట |
| [illegible] | 4 | జెనయుంగేళ | జెనయుంకేళ |
| | 6 | యగలినయంతి కావ్యమునగ | నగలినకలశ[illegible]గఁగదు |
| 68 | 3 | వ్వని చో | య్యనిచో |
| | 15 | తోఁదిగంత | తోధిగంత |
| | 18 | సంగ్రహించి | సంతరించి |
| | 22 | వృద్ధుఁడంచు | సుగుణుఁడంచు |
| 69 | 6 | త్వష్టా | తృష్టా |
| | 19 | వలదుఁ | వలదు |
| 71 | 18 | పీడను. అతిలాంఛి | పీడరా, దతిలాంఛి |
| 72 | 2 | త్రరదర | త్రరతర |
| | 25 | వృద్ధిబొంది | వృద్ధిఁబొంది |
| 73 | 12 | మీరిటులఁతిరస్కరించ | మీరిట్లు తిరస్కరించ |
| 77 | 14 | సంపండితా: | సపండితా: |
| 79 | 19 | పట్టుడు | పట్టుఁడు |
| 80 | 17 | టానంగా | టానంగు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 128 | 28 | ఖాళిమించి | యనువుగాను |
| 130 | 10 | దృష్టులు | ధృష్టులు |
| 131 | 21 | బెన్నగాఁగాఁడె? | బెన్నఁగాఁగాడె? |
| | 23 | సారయుఁడుడా, | స్థాయుఁడుఁడా, |
| | 25 | కిష్కింధాంతికమున | కిష్కింధాంతమున |
| | 26 | కలిభటుల | కలిపయభటుల |
| 132 | 16 | దోషాంతర్థియు | దోషంబాతెను |
| 135 | 26 | పారదాన | వితరణరణ |
| 136 | 18 | కైనబ్రయత్నము | కైనఁబ్రయత్నము |
| | 25 | జాతార్తి | జ్వాలార్తి |
| 139 | 2 | భూనేత్రు | భూనేతృ |
| | 26 | యెంతయెద్రుచినఁ | యెంతశాకిడినఁ |
| 141 | 22 | లివాసీలఁగుదురుగా* | లివాసీలఁ*గుదురుగా |
| 143 | 19 | వే * కరులార, | వేఁ * కరులార, |
| 145 | 3 | కీరకలరవకారి | కీరకలరవశారి |
| | 15 | ప్రతతి*కా | ప్రతతి*కల్ |
| | 17 | గృతహస్తుండగాన | గృతహస్తుండఁగాన |
| 147 | 9 | తలముగూడ. | తట్టెఁదపన. |
| 150 | 16 | శరణం శరణం. | శరణు శరణ్యక. |
| 156 | 7 | కన్నృతమంచుసెట్టటక | కాదటమానిరెట్టటన్ |
| 159 | 1 | నిశాంతముగ | శాంతముగ |
| | 23 | చున్నాఁడు. | చున్నారు. |
| | | కాపున పురాతనమగు | కాపునఁబురాతనమగు |
| 160 | 28 | న్యాయముగఁదద్ద | న్యాయమట్లుగాక తద్ద |
| 161 | 10 | మతెవ్వనిద్రుగ్రథాంగముల్ | మతేనికనుల్ రథాంగముల్ |
| | 14 | ప్రాణినాముపకారయైన | ప్రాణినాముపకారాయైన |

Note:—(1) శ్రీపాండురంగవిలాసనాటకము, (2) అంకము—తీర్సివేసి యుండులోని పంక్తులనంబరులు లెక్కపెట్టఁబడియున్నవి.

# అభిప్రాయములు.

రాసు—1.2.31.

మహారాజశ్రీ, డాక్టరు పసుపులేటి వీరాస్వామినాయనింగారిచే రచిత
న పాండురంగవిలాసనాటకమును స్థాలీపులాకన్యాయమున చదివి చూచి
ని. నేను చదివిచూచిన పద్యములును గద్యములును, కడుంగడుఁ బ్రౌఢపద
భితములై కవికవితాప్రగాఢతను ప్రవ్యక్తపఱచునవిగా నున్నవి. కవి, ప్రాచీన
ప్రౌఢకవికృతులఁ బెక్కింటి నక్కఱతోఁ జదివి నిఘంటువులనేర్చి పదపదార్థ
చమత్కారముల సేకరించి యీ నాటకమున వీలుపడిన పట్టులందుఁ జక్కఁగా
నొక్కల్పినట్టు కానవచ్చుచున్నది.

అన్యవ్యాపారమున కవకాశమీయని వైద్యవృత్తిలో దీర్ఘజీవితము గడ
పుచుఁగూడ నాయనింగారు ఆంధ్రభాషలో తలస్పర్శమైన పాండిత్యము సంపా
దించుట, అంతేకాక కవితాశక్తినిగూడ గడించుట మఱియు, గ్రంథరచనము
కావించుట, ఆనందావహమైనది. ఇదియబ్రమైనదిగదా?

(Sd) వేటూరి ప్రభాకరశాస్త్రి,
ప్రెసిడెంసీ కాలేజి పండితులు.

---

దరాసు—1.2.31.

మహారాజశ్రీ, డాక్టరు పసుపులేటి వీరాస్వామినాయఁడుగారిచే రచింపఁ
బడిన శ్రీ పాండురంగవిలాసనాటకమును స్థాలీపులాకన్యాయమునఁ జదివితిని.
పటుతరరీతిని జూపు నుత్సాహముతో రచింపఁబడిన యీ గ్రంథము కృతికర్త
గారి సాహితీబలమును వెల్లడింపఁజాలియున్నది.

గ్రంథకర్తగారి కవితోత్సాహము ప్రశంసనీయమై యున్నది. భగవ
ద్భక్తాగ్రగణ్యుఁడగు పురంధరదాసుగారి చరిత్రము పరమపవిత్రమైనదగుటచే
నీగ్రంథము సునీతిబోధకమగుచు నుత్తమ పురుషార్థసాధకమగుననుటకు సంది
యము లేదు.

(Sd) వఝల చినసీతారామస్వామిశాస్త్రి,
Junior Lecturer in Telugu, Oriental Research Institute,
Madras University.